# గంగ

శ్రీ చిఱ్ఱావూరు కామేశ్వరరావు బి. ఏ. ఎల్. టి.



సరస్వతీగ్రంథమండలి
రాజమహేంద్రవరము

# భూమిక

"కాలసింధు నిరవధి, జగము విపులము,
తప్పక గలుగుదురు మమ ధర్మ నములు"

(భవభూతి)

నవలలు రెండు విధములు: అత్యున్నతాదర్శ మూలకములు: వాస్తవతామూలకములు. ఈ యాఖ్యాయిక ద్వితీయ శ్రేణికిఁ జెందినది. ఇందు సర్వసామాన్య సాంసారిక దృశ్య మభివర్ణింపఁబడినది. కథాప్రణాళి స్వకపోల కల్పితము; ప్రత్యేక వ్యక్తుల నుద్దేశించి యితివృత్తము కల్పింపఁబడలేదు.

కథావైచిత్ర్యమునఁ బాఠకమహాశయులదృష్టి నాకర్షించుటకు నే నిందుఁ బ్రయత్నింపలేదు. పాత్రపోషణమున నేకమాత్ర లక్ష్యము నెలకొల్పి యథా సాధ్యప్రయత్న మొనరించితిని. నా యాశయ మెంతవఱకు లభ్యంబైనదో రసజ్ఞులు నిర్ణయింతురుగాక.

నాయందు నిరంతర మవ్యాజ దయాతిరేకమును బ్రదర్శింపుచు గ్రంథ ముద్రణభారమును వహించిన శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయఁడుగారికి నేను చిరకృతజ్ఞుఁడను.

ఇట్లు

30—4—25
రాజమహేంద్రవరము

రసజ్ఞ కవిజనాశ్రయుఁడు,
గా॥ చిర్రావూరు కామేశ్వరరావు.

# విజ్ఞప్తి

నిజాము రాష్ట్రమందు ఆంధ్రసోదరుల సౌకర్యార్థమై ఈదిగువ పేర్కొనినవారిని మా ప్రతినిధులుగా యేర్పఱిచినాము. కావున నిజాము రాష్ట్రవాసులు కావలసిన పుస్తకములను వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

నామపల్లి గౌరీశంకరవర్మ అండుకో.,
ఆంధ్రబుక్కు డిపో,
నెం 844-566 రెసిడెన్సీ బజారు,
దక్షిణ హైదరాబాదు.

# ౧

## హాసోన్మాదిని

భాద్రపద మేఘములు గగనతలమున వివిధవిలాసలీల లొలుకుచుండెను. వివిధ వినోదగమనము లొనరించు చుండెను. మృదుమంథర ప్రచారమునఁ గొంతసేపు, ద్రుతవేగమునఁ బరుగెత్తి కొంతతడవు, నిస్తబ్ధభావమున నిమగ్నమై కొంతవడి, యా మేఘశకలములు హృదయాకర్షణ మొనరించు చుండెను. ఆరూపవిలాసమునకు మేరలేదు; రక్తారుణశిఖమై సౌధాకారమున నొకమారు, మనోహరసుకుమార తరుణీరూపమున నొకమారు, మత్తగజమువలె వేఱొకమారు, మనోజ్ఞ పాంచాలికా సముంచితలీలానికేతనమువలె మఱియొకమారు, అద్భుత పరివర్తనములకు లోనై ఆకాశమున మేఘలక్ష్మి స్వర్గీయసౌందర్యమును బ్రకటించుచుండెను.

సంధ్యాభానుఁడు కషాయకాంతులను వెదజల్లుచు నస్తపర్వతశిఖరమున విద్యమానుఁ డయ్యెను. ఆ మేదుర మేఘావరణము సూర్యమండలమును సంపూర్ణముగ నావరింపలేదు. ఆకారణమున స్వర్ణరంజిత తేజః ప్రవాహము జగతీవలయమును ముంచి వేసెను. శకుంతముల లీలాగాన ప్రచయము దిగంతములకుఁ బ్రాకి, యవ్యక్త మాధుర్యమును స్ఫురింపఁజేయు చుండెను. గోధూళి కషాయధూమాకారమున వీధుల నావరించెను.

ఆ పవిత్ర సమయమున రఘురామమూర్తి మేడ డాబాపై నిలువఁబడి, గగన కావ్యమున స్వచ్ఛందనిశ్శబ్దఛందోబద్ధమైన ప్రేమమయ రామణీయక గీతమును దదేకధ్యాన నిమగ్నుఁడై, హృదయంగ మముఁ గాథించు కొనుచుండెను. ఆతని హృదయమున్నాపవిత్ర సమ

యమున వెల్లి విరియుచున్న భావమును నాతఁడు శోధించుకొనలేదు. ఆ యవ్యక్తానందరహస్యము నాతఁడు గమనింపలేదు. ఆ మహోదారసుఖాను భవతత్త్వమును నాతఁడు యోజింపలేదు. కేవలము ముగ్ధుఁడై, గగనప్రదేశమున నిండి ప్రవహించిపోవుచున్న నిశ్శబ్ద—సంగీత శ్రవణమున నాతఁడు బాహ్యలోకమును మఱచి పోయెను.

అతఁడు పదునెనిమిది యేండ్ల యువకుఁడు. ముఖము వర్తులమై, నవయౌవన దివ్యతేజోవిరాజితమై, మనోహరముగా నుండెను. పాశ్చాత్యనాగరికతననుసరించి యాతని శిరోజములు సవరింపఁబడి యుండెను. సన్ననియంగరకా మాత్రమప్పుడాతఁడు తాల్చియుండెను; మిలమిలలాడు చిన్న బంగారు బొత్తాయి లాతని వెడఁదయురమున మెఱయుచుండెను. ఆతని బాహ్యవేషమును బరికింప నాతఁడొక విద్యార్థివలెఁ దోఁచుచుండెను. ఆ సౌందర్యగాత్రుని విశాలనయనములు ప్రేమార్ద్రములై, దివ్యకాంతి మంతములై, యాతని హృదయనైర్మల్యమును నమాయక భావమును ప్రచురించుచుండెను.

ఆతఁడట్లే యా యే కాంత సౌధోపరిభాగమున నిలువఁబడియుండెను. చూచుచుండఁగనే సూర్యభగవానుఁడు మేఘాచ్ఛన్నుఁడై పోయెను. జగతీరంగమున సంధ్యాతిమిరము ప్రసరించి పోయెను.

అప్పుడు మేఘావరణమున నొక వినోదనాటక ప్రదర్శనము రఘురాముని నేత్రగోచరమయ్యెను. ఆహూవక పాత్రలు వివిధవర్ణాంబర పరిశోభితలైన మేఘకన్యకలు.

ప్రథమరంగమున నీలాంబరధారిణి జలధరాంగన యొకతె ప్రవేశించి హాసోదంచితయై విలీనయై పోయెను. అంతలో నాస్థానమున రక్తరంజిత గాత్రి వేఱొక మేఘకన్యక ధృతగామినియై ప్రవేశించెను. ఆమె కోమలతరుణ మస్తకమున సుశ్యామలభాండ మొకటి మెఱయుచుండెను. ఉత్తరక్షణమున నయ్యది క్రిందపడి, యాప్రదేశమును

రక్తస్నానిత మొనరించెను; కన్యకయు ననంతపథమున నదృశ్యమైపో యెను. తరువాత విమల శుక్లాంబరధారిణి వేఱొక యువతి యావిశాలప్రదేశమున దృశ్యమానమయ్యెను. అస్తమించుచున్న సూర్యుని యరుణ కిరణము లొకటి రెండు, మేఘముల తెరను జించివైచి, యాయువతీ పవిత్రశిరో భాగమున మెఱసి పోయెను.

రఘురాముఁ డాతరుణీముఖలావణ్యమును, హృదయసౌకుమార్య మును, నా ప్రదేశమును ముంచివేసిన సూర్యకిరణపరిపారమును, దిల కించుచు, దివ్యపథమున నిలచినట్లు తలంచెను. ఆ ముగ్ధస్వరూపము, పరిణయప్రఫుల్ల తేజము, కూడ నిమిషమాత్రములో మాయమైపో యెను. ఆ పాత్రల జీవనలీల యాగగనతలముననే విలీనమై పోయెను. యువకుని హృదయ మాసౌందర్యవిపణిలో విక్రీతమైపోయెను.

అతఁ డప్రయత్నముగా వీథిలోనికి దృష్టిఁ బరిసరింపఁజేసెను. దూరమున మనోహరగాత్రి, పండ్రెండు పదుమూఁడు వత్సరముల బాలిక యొకతె యాతని గృహమున కభిముఖముగా నొకక్షుద్రకుటీర ప్రాంగణమున నిలువఁబడియుండెను. ఆ బాలికా యమాయికవదన మున, రమణీయకోమలగాత్రమున, మృదుమధురహాసము, పవిత్రభావ పూర్ణమగు హాసము, ప్రాణరసవిజృంభణమగు హాసము, వెల్లి విరియు చుండెను. ఆ నవ్వునకుఁ గారణమేమి? వీథిని బోవు గోగణమధ్యమున నొకదుడుకు యావు ప్రబలవేగమున నా కుటీరప్రాంగణమున దుమి కెను. మున్జూరు గడ్డిపోచలను ముట్టితోఁ బెకలించి, వాలమును మ హోల్లాసమునఁ ద్రిప్పుచు, నమలఁదొడంగెను. కుటీరాంతరమును దుడుచుచున్న ముసలిది యాగోమాతను గూర్చి పరుషవాక్యములా డుచు, నీవలికరుదెంచి, దానిని చీఁపురుతోఁ గొట్టఁబోయెను. చెనఁటి యావు తప్పించుకొని యింటిచుట్టును వేయఁబడిన ముండ్లకంచెను దాటి పారిపోయెను. సంజచీఁకటిలో నాయువ్వకు బాగుగా దృష్టియా

నలేదు ; కాని పరుషవాక్యములకు మేర లేదు. ఆమె యానిర్జీవకంటక ప్రాకారమును, “ చావు ! చావు !” మని తీవ్రముగాఁ బరిహరించు చుండెను. బాలిక యా వినోదమును గిలకించి హాసోల్లాసినియై పోయెను.

రఘురాముఁ డాకోమలస్వర్ణవిగ్రహమును జూచి పులకితగాత్రుఁ డయ్యెను ; అతని నిలువెల్ల సాత్త్వికభావ సంచాలితమయ్యెను. కొంతసే పటికి బాలిక యచ్చోటుఁ బాసి రఘురామమూర్తి నిలువఁబడియున్న మేడకు నభిముఖముగా నడువఁదొడంగెను. అప్పుడాతని కామె యొక వినిర్మల జ్యోతిర్బిందువువలెఁ బొడకట్టెను.

## ౨

### తంతివార్త

ఆనాఁటి రాత్రి భోజనానంతరము రఘురామమూర్తి యన్యమనస్కుఁ డై తనపాఠాగారమునఁ బ్రవేశించెను. పరీక్షాదినములు సమీపించు చుండుటచే నత్యంత శ్రద్ధాధీనుఁడై యాతఁడు చదువ నిశ్చయించుకొని యుండెను. అతని మనోనిశ్చయమున కనుకూలముగా మేజా బల్లపై నాంగ్లగ్రంథములు కొన్ని యాతని నాహ్వానించుచుండెను. కవిసార్వ భౌముఁడు “షేక్స్పియర్” తన మధురలేఖినీ సామర్థ్యమున, విశ్వ భారతీహృదయరంజన మొనరింప విరచించిన “ది మర్చంటు ఆఫ్ విన్నిస్ ” అను నాటకరాజము నాతఁడప్రయత్నముగాఁ దెఱచెను. ప్రప్రథమమునుండి యాగ్రంథమును బఠింపవలయునని యాతని కభి లాషవొడమెను. నిబిడమేఘగర్భమున విద్యుత్ప్రభవలె నాయాకాంక్ష నిమిషమాత్రములో నదృశ్యమయ్యెను. ఇందుకుఁ గారణ మాతఁడూ

హింపలేదు; ఊహించినను గ్రహింపఁజాలియుండఁడు.

ఆ యాంగ్లనాటక ప్రథమాంక ప్రథమరంగమునఁ బ్రారంభ వాక్యము.

* "I know not why I am sad."

ఆతని హృదయమునఁ బ్రతిధ్వనించి, యంతకంత కాతని నతిశయ చింతానిమగ్ను నిఁ గావించెను. "I konw not why I am so sad" అని యాతఁడప్రయత్నముగా ననుకొనియెను. ఆతనిమనోగతము నణచివేయు చింతాభార మవ్యక్తత్వప్రకీర్ణమై, యాతనికే యాశ్చర్యమాపాదించెను. గ్రంథము నాతఁడు మఱి పఠింపఁజాలక పోయెను. ఆతని దృష్టిపథమున నొక సుశ్యామల మహోన్నతభిత్తిక వెలసిపో యెను; గ్రంథమును జూచుచుండఁగనే యాతని కదియగోచరమయ్యె ను. ఉత్తరక్షణమున నాతఁడు నిమీలితనేత్రుఁడై యానసమునఁనే గభీ రయోజనాధీనుఁడై పోయెను. ఆ యోజన నీహారిహితమై, యస్పష్ట మై, సుస్నిగ్ధదుఃఖానంద సమ్మిళితమై, యాతని హృదయము నావ రించెను.

అప్పుడు కాలపురుషుని ప్రబోధమువలె గడియారము పదిగంటలు కొట్టెను. రఘురాముని కర్ణకుహరములఁ నాసున్నితధ్వని ప్రవేశింప లేదు. ఖండచంద్రుని మధుర మరీచికా విలసనము విముక్తవాతాయ నపథమున గదిలోఁ బ్రవేశించి యాతని పృష్ఠభాగమునఁ దరళించు చుండెను; ఆతని కానుధామధురస్పర్శము లేశమాత్రమైనను స్ఫురింప లేదు. విరహావ్యాకులితకోకిలరాణి సమీపవటవృక్షాగ్రమున నిదుర రామి యాగి యాగి, 'కో' యని యఱచుచుండెను; ఆ విరహాగాన మాతనికి వినిపించలేదు. తదేకధ్యాన నిమగ్నుఁడై యాతఁడట్టులే కూర్చుండియుండెను. ఆతని దృష్టిపథమున నొక్క మారు కనక కును

* "నే నెఱుంగ నేమిటికో నాకింతవగపు"

మములు వర్షించెను. సంపూర్ణ పూర్ణిమా చంద్రాతపము సుప్రసన్నమై, యవిరళమై పోయెను. దివ్యగానప్రవాహము నిరంతరమై పోయెను. ఆ సుఖప్రపంచమునఁ బ్రేమకిరీటధారిణి, దివ్యసుందరియొకతె సన్మధురహాసోదంచితయై, విరాజమానమయ్యెను. ఆ నాఁటి సంధ్యాసమయమున నాతుచ్ఛకుటీర ప్రాంగణమున రఘురాముని హృదయాకర్షణముఁ గావించినవినీలకుంతల యా యనంత సుఖసామ్రాజ్యాధీశ్వరియై యాతని కత్యంతాశ్చర్య మాపాదించెను. ఆహా! ఏమి సోయగము! కనకకేతకీ సుకుమారకాంతి నిరసించు మేనికాంతి; తొలకరి మబ్బులఁ దలపించు వినీలవిలంబకేశములు; ముక్తాఫలంబులవోని పలువరుస; అవ్యక్తరామణీయక బంధురంబగు ముఖవిలాసము! రఘురామమూర్తి యా యానందమూర్తిని మనోనేత్రమునఁ దిలకించుచు బ్రహ్మానంద మనుభవించుచుండెను. మేఘగర్భమును గాంత్యుజ్జ్వలమొనరించు మెఱుపుతీఁగవలె నాయానందానుభవము క్షణభంగురమై విమలాంతఃకరణుం డగు నాయువకుని హృదయమును సముజ్జ్వలమొనరించి, యుత్తరక్షణముననే గాఢాంధకార బంధుర మొనరించెను. హృదయరంగమున నా ప్రణయప్రఫుల్లతేజ మంతర్హితమైపోయెను. అతఁడుకన్నులు తెరచి, యస్ఫుటభంగి, "I konw not why I am so sad" అనుకొనియెను.

ఆ మఱునాఁటి యుదయమున రఘురామమూర్తి కళాశాలకరుగఁ బ్రయత్నములు సాగించుకొను చుండెను. ఆతనిగృహమున కనతిదూరమునఁ దంతివార్తాహరుఁ డొకఁడు లోహితవర్ణ మయం బగు బైసికిల్ నడపించు కొనుచు, "కాంతమ్మగారి ఇల్లు ఎక్కడ?" అని యడుగుచు నగ్రసరుఁడగు చుండెను.

రఘురాముఁడాతని వేషమును దిలకించుచు, "ఆహా! ఈతఁడేకదా మానవుల భాగ్యాభాగ్యములను, సుఖదుఃఖములను, నివేదించు నజ్ఞాత

దూత! ఈతని హస్తమున గర్జానినాద శూన్యములైన యెన్ని పిడుగులు, మధుర రసోపేతములైన యెన్ని యఖండ పుణ్యఫలములు, దివ్యసౌరభ సమాలంకృతములైన యెన్ని నందనవన సుమంబులు, కలవో యెవ్వఁ డెఱుంగఁగలఁడు!" అని భావించుకొనుచుండెను.

తంతివార్తాహరుఁడు కర్కశహాస మొనరించుచుఁ, గాంతమ్మగారి వాకిటనిలువఁబడియెను. తంతివార్తయని నంతనే కాంతమ్మ—ఏండ్లు గడచిన ముసలిది—కెవ్వున కేకవేసి, భయంకరరోదన మొనరించెను. ఉత్తరక్షణమున నామె యా వార్తాహరదత్తంబైన కవరును గైకొని పరుగు పరుగున రఘురాముని సమీపించెను.

రఘురాముఁ డాకవరుగైకొని, విప్పి తనలోఁ దాను జదువుకొని, దీర్ఘనిశ్వాసపురస్సరముగా, "అమ్మా! మీ యల్లుఁడు రోగార్తుఁడై యిహలోకమును బరిత్యజించెను!" అని చెప్పెను.

"కొంప మునిగిపోయింది! అయ్యో ! అయ్యో!" యని కాంతమ్మ నెత్తిమోదుకొనుచు భూతలమునఁ బడిపోయెను. ఇరుగుఁ బొరుగువారు యథాకాలమున నట కరుదెంచి, లౌకిక భావపూరితవాక్యముల నామెనునోదార్పఁ గడంగిరి.

"రఘురాముని హృదయమునఁ బొడసూపిన ప్రేమతేజము, „హాసోన్మాదిని" యట కరుదెంచి, మందహాసమున విషాదమాలిన్యము స్ఫురింపఁ, గాంతమ్మను సమీపించి,

„అమ్మా! నీ వేటి కిట్లేడ్చెదవు? ఏ మాయెనే?" యని యడిగెను. కాంతమ్మ యా యమాయిక శీలను బిగియారఁ గౌఁగిలించుకొని, „గంగా! గంగా! నీనుదిటి కుంకం ఆరిపోయిందే తల్లీ! నీ బతుకు తెల్లవారి పోయిందమ్మా! నీ కెంత కష్టం వచ్చిందే అమ్మా! అయ్యో! గంగా! వరాలమూటా ! నీ చక్కదనం అడివిలో వెన్నెల ఐపోయిందే తల్లీ! నా కేంగతి! ఏజన్మపాపమే ఇది!" అని పలుభంగుల విలపించెను.

గంగ యా మహిళాసంఘము మధ్య నశ్రుపూరిత నేత్రయై, పరిభ వింపఁబడిన దానివలె నిలువఁబడిపోయెను.

రఘురాముని సహజకోమల హృదయమునఁ గరుణారసము వెల్లి విరిసెను ఆ స్వర్గీయ సౌందర్యమును గప్పివేసిన విషాదమేఘమును దిలకించుచు నాతఁడు బహుళబాష్పకలిత నేత్రుఁడై, యంధకారమునఁ దన్నుఁదానే మఱచిపోయెను.

## 3

### మార్జాలవృత్తి

కొన్ని దినములు గడచెను. హాసమయి గంగ నవయౌవనవిలాసినియై ప్రభాత ప్రఫుల్లకమలమువలె మధురలీల లొలుకుచుండెను. ఆ భర్తృవిహీన ప్రగాఢదుఃఖావరణమున నసహాయికయై యనంత సుఖసముంచితమార్గమున నడిచిపోవ నుద్యమించుచుండెను.

ఆమె వివాహమును గూర్చి విపులముగా వ్రాయుటకు మాకిష్ట మున్నది; కాని యవసరము స్ఫురింపదు. ఆమె మూఁడేండ్ల పసిపాప యైనప్పుడే కల్యాణసుఖము—దుఃఖమా?—అనుభవించెను. ఆయనుభ వము, భయంకరానుభవము, ఆమెకు జ్ఞాపకమున్నదా? పుస్తెలను దన గళప్రదేశమునుండి త్రెంపివేయునప్పుడు మాత్రమామె తల్లితో,

"అమ్మా! ఇవి నామెడలోని కెట్లు వచ్చినవి; ఎవరుకట్టి యుండిరి?" అని యనియెను.

పూర్వోక్తసందర్భమును బట్టి రఘురామమూర్తి యిల్లుకూడ ఆవీథిలోనే యున్నదని పాఠకమహాశయులు గ్రహించియుందురు. గంగ తరచుగా వారింటికిఁ బోవుచుండును. రఘురాముఁడా బాలికతో

సాధారణముగాఁ జాలసేపు సంభాషించి యుండలేదు; గాని యా బాలికావదన మండలమున వెల్లి విరియు దివ్య తేజమును, హాసోన్మాదమును, ఆతఁడు ధ్యాన తత్పరుఁడై తిలకించుచుండెను. గంగ రఘురాముతో మాటాడ నెన్నియో విధములఁ బ్రయత్నించి యవకాశములను గల్పించుకొను చుండెను.

వీథికాలువలోఁ బ్రాణావశిష్టమై పడియున్న యొక పిల్లికూనను రఘురాముఁడు, కొన్ని దినములక్రిందట, దయాతిరేకమునఁ గొనివచ్చి, పాలుపోసి పెంచెను. ఆ పిల్లికూన నానాఁటికిఁ, బ్రాణప్రసారమున గృహమున నిర్భయముగా సంచరింపఁ దొడంగెను. దానియాటలకు లెక్కలేదు; దాని యానందమునకు మేరలేదు. రఘురాముఁడు దానిని నెత్తుకొనునపు డది కన్నులరమోడ్చి, తన క్షుద్రహృదయమున బ్రహ్మానంద మనుభవించుచు, మైమఱచినట్లు లుండును.

పిల్లికూనపై రఘురామునకుఁ గల గాఢానురాగము, మిక్కుట మగు కనికారము, గంగ చాలసారులు చూచి యుండెను.

ఒకనాఁటి మధ్యాహ్నమున రఘురామమూర్తి యేదియో యొక గ్రంథమును దెచ్చుకొనుటకై పుస్తకభాండాగారమునకుఁ బోయెను. ఆతఁడు తిరిగి వచ్చునంతలో గంగ యాపిల్లికూనను దీసికొనిపోయి తనయింటఁ గట్టివేసెను.

రఘురాముఁడు పుస్తకభాండాగారమునుండి వచ్చునపుడు పిల్లికూనకొఱకు బజారులో బిస్కత్తులను గొని తెచ్చెను. ఇంటఁ బ్రవేశించిన తోడనే "పూస్! పూస్!" అని పిలుచుచు నాతఁడు పిల్లికూనను వెదుక నారంభించెను.

అంతలో గంగ యట కరుదెంచి,

"రామా! ఆలాగున నుంటివేమి?" యని యడిగెను.

"పిల్లికూన మీయింటికి వచ్చినదా?" యని రఘురాముఁ డామెను

ప్రశ్నించెను.

"మాయింటికి వచ్చుటకు దాని కేమిదారి తెలియునా?"

"ఎచ్చటికిఁ బోయినదో!"

"ఏమో!"

గంగ నవ్వు పట్టలేకపోయెను; గట్టిగా నవ్వుచు,

"రామా! ఆ పిల్లికూనపై నీ కెందు కింత ప్రేమ?" అని యడిగెను.

"దానిని మృత్యుముఖమునుండి తప్పించితిని కాబట్టి"

"తప్పించినంతమాత్రమున మఱి పోఁగూడదా?"

"పోవచ్చును. ఎప్పుడో యొకప్పు డేలాగునైనఁ బోవునదే. కాని, పోయినందుకు విచారించుట మానవస్వభావము."

"అట్లైనఁ బోయినవా రందఱిని గురించి విచారింతువా?"

"నాహృదయమున నెవ రెవరికిఁ జోటుకలదో, వారు పోయినపుడు నేను విచారించుచునే యుందును."

"నేను బోయిన నీవు విచారింతువా?"

రఘురాముని శరీరమున నాపాదమస్తకము స్వేదజలము ప్రవహించి పోయెను. గంగ—అమాయిక—యెట్టి భయంకరప్రశ్న వేసినది!

అతఁడు కంపితగాత్రుఁడై,

"గంగా! ఏమంటివి! వృక్షాగ్రమున నటించు పుష్పము భూతల పతితమైనపుడు, చక్కని చందమామ నల్లని మేఘములలో దూరినపుడు, కిరీటమునఁ బొదుగవలసిన రత్నమును బెంటలోఁ బారవేసినపుడు, కారుచిచ్చు వసంతవనలక్ష్మినిఁ గాల్చివేయునపుడు, ఏరాతి గుండె కరుగకుండును? ఏరాక్షసుఁడు కన్నీరు విడువకుండును!"

"రామా! మాటసందడిలోఁ బిల్లికూనమాట మఱచితివి! వెతికి

తెచ్చిన నా కేమిచ్చెదవు?"

"నిన్నుఁ జాల మెచ్చుకొనియెదను?"

"ఈపాటదానికే మెచ్చుకొందువా? దానిని నేనే దాఁచితి ననిన నన్ను మెచ్చుకొందువా?"

"గంగా! ఇంతవఱకుఁ జెప్పితివి కావేమి?"

"అప్పుడే చెప్పివేసిన నాతో నింతసేపు మాటాడి యుందువా?"

గంగ వడివడిపోయి, యుత్తరక్షణమునఁ బిల్లికూనతో మరలి వచ్చెను.

## ౪

## విషాదచ్ఛాయ

గంగా వివాహమును గూర్చియు, విదళిత మంగళసూత్రమును గూర్చియు నేకాంతసమాలోచన మొనరించు రఘురామునిదృష్టి బాహ్యలోకమున కెంతయు దూరమైపోయినది; పరీక్షసంగతి యాతనికి విస్మృతమయ్యెను. అభ్యాసవశమున నాతఁడు కళాశాల కరుగుచుండెనే కాని యాతని హృదయ మాయావరణమున కెంతయు నెడమై యుండెను.

ఆతఁడు ఇంటర్ మీడియేటు తరగతిలోఁ జదువుచుండెను.

మహా మహోపాధ్యాయుఁడు 'గంగాధరరావు' మృదుల మధుర కంఠస్వరమున మహాకవి "టెనిసన్" కృతంబగు "ఇనోనీ" యను గీత కావ్యమును బోధించుచుండెను.

విద్యార్థులు తన్మయులై యాలించుచుండిరి—

మంద్రస్వరమున గురుముఖవినిర్గతమగు నా గీతము రఘురాముని

హృదయగహ్వరమునఁ బ్రతిధ్వనించెను. అమాయిక "ఇనోసీ" సుఖ
స్వప్నలోకమున వంచితురా లాయెను. ఆ యువతీ దృక్కోణముల
నుండి జాలువారు పుణ్యనదీజల సదృశ బాష్పపూరము రఘురాముని
హృదయక్షేత్రమును బరిప్లావిత మొనరించెను. అతఁ డప్రయత్న
ముగాఁ గన్నీరుఁ గార్చి, యుత్తరక్షణమునఁ దెలివొంది, కృత్రిమ
హాసపూరితవదనముతో సహాధ్యాయుల వైపుఁ జూడసాగెను. అతని
మనోవైకల్యము నెవ్వరును గ్రహించి యుండలేదు.

"రఘురామా! ఇవాళ ప్రొఫెసరు మా మజాగా లెక్చ రిచ్చా
డురా!" అని విద్యార్థి యొకఁడు విస్ఫారిత నేత్రముల నవ్వులు గురి
యుచుఁ బలికెను.

"అవును," అని రఘురామమూర్తి పులకితగాత్రుఁడై గద్గద స్వర
మునఁ బలికి విసవిసనావలి కరిగెను. అతఁడు గృహోన్ముఖుఁడై సంచ
లిత పాంచాలికవలె నడచి పోవుచుండెను.

హతభాగిని "ఇనోసీ" వంటి భాగ్యవిహీన లెందఱీభారత
భూమిలోఁ గలరు?—నవ్వులబండి గంగ, తన హృదయమున దావా
నలము రవులుకొనుచున్నను నవ్వుచునే యున్నది! ఆ యానంద
బాష్పలహరి యెంతలో మహాభయంకర జ్వాలాస్రవంతిగా మార
నున్నది! విషాదసముద్రమున నా తేజఃప్రభ యచిరకాలములో విలీనమై
పోవును. మకరందతుందిల మధురప్రసూనము కంటకశయ్యాతలమున
నిర్జీవపదార్థమువలె సౌరభసౌందర్య విహీనమై కనికరముఁ గొలుపు
చున్నది. కఠోరసామాజిక శాసనాబద్ధయై పుణ్యశీల గంగమధుర
స్వాతంత్ర్యభాగ్యాభిలాష గగన శకుంతమువలె నెగసి పోవ గమకించు
చున్నది! ఎట్టి యుడియాన! సమాజము వ్యక్తివిహీనమై, నిస్తేజమై,
రక్తపాన మాకాంక్షించుచున్నది. అనాథల రక్తబాష్పములను గ్రో
రక్తకలుషితశాసన ప్రచారమునఁ దలమెత్తి, రక్తరంజితనేత్రములతో

రక్తస్రావమభిలషించుచున్నది. రక్తకలుషిత సమాజమునకు ధిక్కారము. రఘురాముని కోమల హృదయమున విప్లవభావపరంపర సింధుగర్భమున ననంతతరంగసదృశమై విజృంభించెను. సౌమ్యతేజః పుంజమవిరళమేఘావరణమునఁ జిరకాలపర్యంతము నిక్షిప్తమై యుండవలయునా? అఘటనఘటనాపటిష్ఠుఁడైన విధాత లోకకల్యాణార్థము సృజించిన మహోదారస్వర్గీయసౌందర్యము విషాదతమోచ్ఛాదితమై యా మహాశిల్పియొక్క దివ్యకౌశలమును నిగూఢ మొనరించునా? అహోరాత్రములు జగత్ప్రార్థనా మందిరాభ్యంతరమున వెలుఁగవలసిన యఖండదీపము— అమేయపుణ్యప్రభ— నిష్ప్రయోజనము కావలయునా? లోకోద్ధరణమున కవతరించిన యప్సరస దుర్వారకాలప్రవాహావర్తమున విఘూర్ణితము కావలయునా? సృష్టినిర్మాణమునఁ గౌశలమే కాని నియతిలేదా? భగవంతుని భావనాప్రపంచసౌందర్యమున శాశ్వతానందము లేదా?

రఘురాముని మనోభావములు సీమారహితములై యాతని నున్మాదునిగాఁ జేయఁ దొడంగెను.

పూర్ణచంద్రునిఁ గాంచి యుప్పొంగు రత్నాకరలక్ష్మివలె నయనచకోరచంద్రుఁడగు రఘురామునిఁ దిలకించి ౫౦౫ యుప్పొంగుచుండును. ఆ నాఁ డాతని ముఖఫలకమున విస్పష్టముగా దృగ్గోచరమగుచున్న విషాదపట్టికను జూచి యామె యలజడి పడియెను. హాసోన్మాదిని విషాదిని యయ్యెను. గాని, యుత్తరక్షణముననే యా మనోవికారము హాసోన్మాదమున మఱుఁగుపడి యంతర్యామినివలె నదృశ్యమై పోయెను.

## ౫

"Men are cradled into Poetry,
They learn in suffering what they teach in song."
Shelley.

విద్యార్థుల మేధాసంపదను లెక్కించు పరీక్షలు ముగిసినవి. పరీక్షా ప్రశ్నపత్రములకు సమాలోచనా పూర్వకముగా సమాధానములు వ్రాయుటవలన, రఘురాముని మేధాప్రపంచము, హృదయరంగమున, లేఖినీవృత్తమున నొకానొక యవ్యక్తభావమను గాఢాంధకారమున దీపకలికవలె, నిశ్శబ్ద నిశీథమున "రజనీగంధ" వలె, నిర్జనప్రదేశమున దివ్యసంగీతప్రవాహమువలె, మాధుర్యము లొలుకుచు, సౌరభము నింపుచు, దేదీప్యమానముగను, నూత్నతేజము నొసంగూర్చెను. ఆతని రచనాపరంపర కాంత్యుజ్జ్వలమై, మనోహరమై, సుధారససంకలితమై, నిర్దుష్టముగా నుండెను.

పరీక్షలు ముగిసిన మఱునాటి సాయంసమయమున రఘురామమూర్తి పట్టణపరిసరప్రదేశమున నేకాంతవిహార మొనరించుచుండెను. పరీక్షకాతఁడు ప్రబలప్రయత్నములు కొనసాగింపలేదు. కాని యా యగ్నిపరీక్షలో నాతఁ డుత్తీర్ణుఁ డెట్లు కాఁగలిగెను? ఆతని నా సమయమున నావేశించిన యుత్తేజభావ మెట్టిది? నదీగర్భమునఁ బడినవానివలె నాతఁ డాలోచనలలో మునిఁగిపోవుచుండెను. ఆ యాలోచనలలో హాసమయి గంగ మేఘావరణమున సుధాకరబింబమువలె నస్పష్టముగా స్ఫురించుచుండెను. ఆ యమాయిక తన హృదంతరాళమున సుధావర్ష మేటికిఁ గురియుచున్నది? తన నయనద్వయమున నాలావణ్యతారుణ్యమూర్తి సుధాంజన మేటి కలము

చున్నది? తన జీవనపథమున నీ యనాథ బాలిక సముల్లాసవదనయై ముత్యాలముగ్గులేల రచించుచున్నది? ఈ యకారణసంఘటన కుత్తరవాది యెవరు? ఈ యభినవనాటకప్రణాళి కెవరు కర్త? సంకల్ప సిద్ధుండైన విధాత యీ సంబంధసూత్రమున నీ యువతీయువకుల భావిభాగ్యములను బంధించియుండెనా? వారి జీవనప్రసవంతులేకోన్ముఖములై ప్రవహించి కాలసింధువున కలిసి యుగునా? లేక గంగా యమునా ప్రవంతులవలె సమ్మిళితములై ప్రవాహాజ్యంబు లగునా? రఘురాముని నేత్రములు ప్రయుక్తముగా ప్రశురంజితములయ్యెను.

ఆతని సమ్ముఖమున జలపక్షులు రెండు నిర్మల పద్మపత్రములపై నిలువంబడి యానందోత్సవము నెఱపుచుండెను. వాయు సంచలిత తటాక గర్భమున ముత్యాలవలె దృశ్యాదృశ్యములై మాతృభద్ర విహంగముల హృదయావేగమును నిరూపించుచుండెను. ఎడ తెరిపి లేని యలల మంద్రనాద మాపక్షుల నిశ్శబ్ద ప్రేమగానమున విలీనమై స్వర్గీయానందమును చాటుచుండెను.

సృష్టిరచనా సమర్థుండైన వాణీనాథుండు ప్రేమరాజ్యమున స్వాతంత్ర్యపతాక నెలకొల్పియుండవలయును. వాయు సంస్పర్శనమున వన లక్ష్మి యేల పులకితశరీర కావలయును? తారకా సమ్మేళనుల్లికా కోరకములేల హిమధాముని సుధాకర సంస్పర్శనమున ప్రఫుల్లములు కావలయును? అనంతసాగరుని తరంగహస్తముల వాశించి సురగభీరనదీ సదంబులేల మృదుమంథరగమనమున నాతని రత్నాలయమున కభిముఖముగాం బ్రవహింపవలయును? పరిశ్రమ విశ్రాంతిగాం బరిణమించునటులు, ప్రేమ సౌందర్యముగాం బరివర్తన మొందును. ఆ ప్రేమ సౌందర్య పరివర్తనము ప్రకృతిరంగమున విద్యమానమగుచున్నది.

రఘురాముండీసుగాఢ మహోదార తత్త్వమును జలపక్షుల

యనంత కల్యాణ సంబంధమునఁ బరిశీలన పూర్వకముగాఁ గాంచి, యానంద పరవశుఁడయ్యెను. మేదినీధామమున ననుక్షణము దృశ్య మానమగుచున్న నీ యమోఘస్వర్గీయనియతి, మహానంద దాయక సుఖానుభవము మానవునకేల దురవగాహమును, దుర్లభము నగు చున్నది? మేఘగర్భమున మెఱుపుతీఁగవలె, సింధుగహ్వరమున రత్న రాశివలె, వికసిత కమలవనంబున సౌరభ ప్రసారమువలెఁ బ్రేమలో సౌందర్యము ప్రస్ఫురిత మగుచున్నది. మానవుని యహంకారమున కీయమృత దృశ్యము గోచరించునా? వాని యుక్తాయుక్త విచక్షణశక్తి కీయనవరతాభినవమంత్రార్థము విదితమగునా?

రఘురాముఁడు గృహమునకు మరలివచ్చిన వెంటనే తన దైనిక చర్యా పుస్తకములో నీక్రింది గీతమును వ్రాసెను:

“వసుధలో నన్నుమించిన ప్రాణియేది?
మంచిచెడ్డల నరసెడు మహితశక్తి
సృష్టి రాజ్యంబునందు నింకేరి ధనము?”
అనుచు గొంతెత్తి పలికెద వనుని మిషము!
ప్రకృతి విధ్వంసకార్య తత్పరుఁడవీవు!
కన్నుమూయఁ దనుకఁ గన్నుఁ గానవకట!
ఆసురంబగు నీశ్రమ కవిధిలేదు!
అన్నదమ్ముల రక్తమే యమృతమయ్యె
నీకు!—రక్తభోజన కాంక్షనీ హృదంత
రాళమున నిరంతరముఁగ రాజ్యమేలు!
ఏదినీదు బలమటంచు నెడఁద నెంతు
వదియ యొనరించె నిన్నధమాధమునిగ!
చంపఁగలవు ప్రాణుల, బ్రతికింపలేవు!
త్రుంపఁగలవు పూవుల, రచియింపలేవు!

తెలియనెంతు వన్నియు, నిన్నుఁ దెలియలేవు!
పరుగులన్నియు నీయధః పతనమందుఁ
బరిణమించునని యొకింత యెఱుఁగలేవు!—
మానవ! దురభిమానము మానవు కద!—?

## ౬

### ప్రణయపరిభ

రఘురాముని గృహపరిసరమున నొక జలయంత్రమున్నది. ఆతఁ డొకనాడు సంధ్యావిహారమునకు వెడలి కొంతవడికి మరలివచ్చెను. స్వీయమందిరమునఁ బ్రవేశించు నప్పుడు గంగ యాజలయంత్రి సమీపమున సువర్ణ సాలభంజికవలె నిలువఁబడి యుండెను. పూర్ణకౌముదీస్నాతయైన యామనోహర విగ్రహమును నాతఁడు కన్నులార విలోకించు చుండెను.

వృద్ధ బ్రాహ్మణుఁ డొకఁడు కౌతుక చేష్టా వినోదుఁడై పిత్తళ పాత్రలో నీరు పట్టుచుండెను. పూర్వసువాసిని యొకతె యాతని సమీపమున బిందెపై సుఖాసీనయై యాతనితో వినోదగోష్ఠిఁ గాలయాపన సేయుచుండెను.

ఆసమయమున జలగ్రహణార్థమచటి కరుదెంచిన వేఱొక పూర్వసువాసిని వారి సంభాషణ మాలించి, విస్ఫారితనేత్రములతో "అమ్మా! మీరిద్దరేమౌతారు?" అని యావిధవరాలినిఁ బ్రశ్నించెను.

ఆమె చకితయై యాప్రశ్నకు సదుత్తర మొసఁగఁ జాలమి, లజ్జాతిరేకమున మౌనముద్రాంకిత యయ్యెను.

వృద్ధవిప్రుఁడు చాల గడుసువాఁడు. వెంటనే గొంతెత్తి

"మేమిద్దరం ఏమౌతామూ? అది ఆ వేపునుంచి, నేను ఈ వేపు నుంచి వస్తే, ఎదురౌతాం; అది ఆ వేపు, నే నీవేపుపోతే దూరమౌతాం; అది అక్కడ నే నిక్కడ నిలబడితే దగ్గిరౌతాం. అది ఆవీధిలోకి, నేను ఈ వీధిలోకి వెళితే మరుగౌతాం!" అని యట్టహాస మొనరించి నీళ్ళ బిందెతో వడివడి నడచి పోయెను.

ఆ వినోద ప్రసంగశ్రవణమున గంగ నవ్వులలోఁ దేలిపోయెను. రఘురాముని వర్తుల ముఖచంద్ర మండలము దరహాస చంద్రికా విలసితమై యుత్తరక్షణముననే యనిర్వచనీయ చింతాభరమున మ్లానమయ్యెను.

భోజనానంతర మాతఁడు శయ్యాతల శాయితుఁడై, భావనా భారతీ పుత్రుఁడు, శ్రీకంఠబిరుదాంకితుఁడు, శ్రీకంఠుఁడు శ్రీ భవభూతి విరచించిన లోకోత్తర పుణ్యగాథ, "ఉత్తరరామచరిత్రమును" జదువు చుండెను!

"సుఖదుఃఖము లందు సమరూపమగుచు, సర్వావస్థల ననుకూలమగుచు, వ్యథితప్రాణమున కపారవిశ్రామకారణ మగుచు, వెలయు ప్రేమ తులలేనిది; వికృతాకారజరయు నాప్రణయసుధారసమును హరింపఁ జాలదు; అది స్నేహసారరూపమునఁ జిరంతనము. అట్టి లోకకల్యాణమయప్రేమ విభవము—ఆహా!—విపుల వసుంధరామధ్య నెంత దుర్లభము!" అను శ్రీరామవాక్యమును జదువు నపుడాతని నేత్రములు బాష్పావరోధమున నంధప్రాయము లయ్యెను; గాత్రము రుద్ధమయ్యెను.

"నిజము! ఆ దివ్యప్రణయ ప్రసాదము మానవహృదయమునకు లభ్య మగునా? లభ్యమగునేని మానవులకును దేవతలకును భేదమేమి? భూలోకమునకును స్వర్లోకమునకున నంతరమేమి యుండును? సుఖదుఃఖముల నిరూపించుటెట్లు? దేవతలు సుఖసామ్రాజ్యమునకధీశ్వరులు,

మానవులు దుఃఖభోగులు. శ్రీరాముఁడు దేవతా సార్వభౌముఁడు; పుణ్యశీల సీతాదేవి మహాతపస్విని; ఆ యిరువురి సనాతన సంబంధము ప్రణయైకమూలము. వారి జీవనమార్గము ప్రణయకౌముదీప్లావితము, ప్రణయము వారి నిత్యజప సనామంత్రము." రఘురాముఁడు సీతారాములను స్మరించి, యవ్యక్తానందపరవశుఁడై, "భూసుతా! సీతా! నీకు నమస్కారము! ఇనకులచంద్రా! రామచంద్రా! నీకు నమస్కారము! భావవిభూతీ! భవభూతీ! నీకు నమస్కారము!" అని కన్నులు మోడ్చెను. అశ్రుసిక్తములైన యాతని నేత్రములు దీపకాంతిలో ముత్యపుఁజిప్పలవలె మెఱయుచుండెను.

ఆ సమయమున గంగ కలకంఠమెత్తి శ్రీజయదేవకవి విరచితగీత గోవింద కావ్యాంతర్గత సుధాగీతమును బాడసాగెను.

"చందనచర్చిత నీలకళేబర పీతవసనవనమాలీ,
కేళిచలన్మణికుండలమండిత గండయుగస్మితశాలీ,
హరిరిహ ముగ్ధవధూనికరే—విలాసిని విలసతి కేళిపరే."

గంగ కాయనురగీతార్థము దురవగాహమునై యుండెను. ఆమె చదువను వ్రాయను అప్పుడప్పుడే నేర్చుకొనుచుండెను. ఆ వీధిలోఁ గాపురమున్న "శారదాంబ" యను విదుషీమణి యా గీతమును దఱచుగాఁ బాడుచుండును. శ్రుతి సుఖదాయకమగు నా "సామోద దామోదర భ్రమరపదము" గంగ పలుసారులాలించి పాడనేర్చెను. శారదాంబ రాగతాళభేదములెఱింగి, భావార్థసంపద సంగ్రహించి సుధామయపదవిన్యాస మలవరించి, యెన్నియో గీతములు విరచించి యుండెను గంగ యాపాట లెన్నియోసారులాలించి, వినోదార్థము మననముఁజేయుచుఁ గంఠస్థ మొనరింపఁ గలిగెను.

ఆమె పాడినగీతము రఘురాముని శ్రవణగోచరమైన తోడనే యాతఁడు పులకిత కంచుకితగాత్రుఁడయ్యెను. ఆనందబంధుర బృందా

వనమున సదానందుఁడు, వనమాలి, శ్రీకృష్ణభగవానుఁడు గోపికా హృదయధామమున శృంగార కేళీవినోదుఁడై యమృతవృష్టిఁ గురియించినటుల గంగా హృదయమున రఘురామమూర్తి యేనాటికైన నానందజ్యోత్స్నాస్రవంతిఁ బ్రవహింపఁ జేయునా? రాధాకృష్ణుల మధురప్రేమ గౌరవము ననుభవించు సువర్ణసమయము గంగా రఘురాముల కెన్నఁడేని సంప్రాప్తించునా? ఆ పురాణ దంపతు లేకచ్ఛత్రముగఁ బరిపాలించిన యనంతప్రేమ రాజ్యమునఁ బరిభ్రమణభాగ్యము వారి కెన్నఁడేని లభించునా? రఘురాముని హృదయమున నానందము వెల్లివిరియుచుండెను. గీతమాగిపోయినను, నిశీథగర్భమున నయ్యది నినాదితమగుచునే యుండెను. ఆ నిశ్శబ్దగాన శ్రవణమున నాతఁడుకన్నుదామరలు మోడ్చి విపుల సుఖస్వప్నరంగమునఁ బ్రవేశించెను.

## ౭

### హాసము

ఒకనాఁటి ప్రాభాత సమయమున శారదాంబ గంగ నుద్దేశించి,

"అమ్మా! నీవు జగన్మోహినివి; మానవులలో రాక్షసులును దేవతలును గలరు. నీ యనమాన సౌందర్యము యువతీ హృదయమును గూడ విముగ్ధ మొనరింపఁ గలదు. సౌందర్యమున నున్మత్తహాసము శాపకారణము. విషమపరిణామమున కది మార్గము జూపును. సౌందర్యమున సాత్త్వికానందము వరప్రసాదము. నిన్నుఁ జూచిన నాకెంతయానందమో యంతభయము కలుగుచుండును!" అని యశ్రుపూరితనేత్రయై పలికెను.

గంగ యొక్కింత మౌనమూని,

"అమ్మా! నేనింక నవ్వనులే. నానవ్వు లోకభయంకరమేని, నాకది సిగ్గుచేటుజనము. నవ్వుల జాడలోఁ బువ్వులు గలవని నాకు స్ఫురించుచున్నది; కాని యీసౌరభాంచిత ప్రసూనరాశి విషగర్భితమేని, నాకింకేమి యాశకలదు? సృష్టి రాజ్యమున నవ్వుటకు నాకధికార మున్నదని భావించితిని; నవ్వు ప్రాణప్రసారకారణమని యూహించితిని. నవ్వఁగలవారలే స్వర్గ సోపానము లెక్కఁగలరని నమ్మితిని. కాని నవ్వు లోకకంటకమనియు, సౌందర్యవిధ్వంసక మనియు, నరకావతరణమునకుఁ గారణమనియు, నేఁ దలంపలేను. మల్లికాకుసుమమున మధుర సౌరభమువలె నానందమున నవ్వు నిసర్గరామణీయకముఁ దొలఁగాడు నని విశ్వసించితిని. నా విశ్వాసము లోకగర్హితమేని, యసంగతమేని, నేనికముందు నవ్వుల కెడ మయ్యెదను!" అని యాఁదలవాల్చి, చెఱఁగునూలు పోగులు త్రెంచుచుఁ బలికెను.

శారదాంబ యాయమాయికను కౌఁగిలించుకొని, మూర్ధమును ముద్దాడి,

"గంగా! నీవు బాలికవు. సమాజనిబంధనముల నెఱుంగవు. మానవ నిర్మిత భయంకరశాసనాబద్ధవైన నీవు, రక్తప్రవాహమధ్యమున నిమగ్నవైననీవు, జీవనప్రాభాతమునఁ జీవనసంధ్యఁ దిలకింప వలసిన నీవు, హాసోన్మాదిని వెట్టులైతివి? దుఃఖావరణమున నానందాశ్రువిసర్జన నీకెట్టులలవడెను? కరాళకాలసింధుముఖంబున సుఖస్వప్నావలోకనము నీకెట్లు సహజమయ్యెను? అమ్మా! నీనవ్వులకును బసిపిల్లల నవ్వులకును భేదము లేదని నేనెఱుంగుదును. అకారణమును, మధురభావవిలసితమును, దివ్యానంద దాయకమును, నగు నీహాసముకఠోర సమాజనేత్రమును గషాయితమొనరించుచున్నది. నిన్నుఁగూర్చి యిరుగుఁ బొరుగువారు తీవ్రవిమర్శనలు గావించుచున్నారు. నీ సుమకోమల హృదయమున బాణఘాతము నే నూహింపలేదు. అట్టి నిష్ఠురకర్మ నే నెన్నడును భావింపఁ జాలను.

గర్జించెను.

ఆమె దక్షిణపార్శ్వమున వత్తులు చేయుచున్న సుబ్బమ్మ రంగమ్మ నభినందించి, "అక్కయ్యా! నీ కన్నీ తెలుసును. ఆ మతం పేరేమిటి? మొగవాళ్ళు దంధ్యాలున్ను, ఆడవాళ్ళు పుస్తెలున్ను తెంపుకుంటారు?" అని యడిగెను.

"అదా? బ్రమ్మమతం. మొన్న బంగాళా దేశం పండితుడు మన ఊరొచ్చి ఉపన్యాసాలు చెప్పింది ఆ మతం గురించే కదూ? వెంటనే జోగావధాన్లున్ను, మరికొందరు పెద్ద మనుష్యులున్ను వెంకటేశ్వర్లు కోవిల్లో సభ చేసి అతని పెడవాదన ఖండించారు. మగవాడు ఏతప్పు చేసినా సరే, దంధ్యం మాత్రం తెంపకూడదు. మొగుడు బతికేఉండగానే ఆడది తెంపిపోసినముండలాగ కనబడకూడదు.

రంగమ్మ పలికిన ధర్మసూత్రముల నాలించి గ్రహించిన యా స్త్రీ మండలి యొక్కసారి హాస్యోద్రేకమున సాంఘిక భాగ్యవిధాతలవలె మురిసి పోయిరి.

వీధిగడపపై నిలువంబడిన గంగను పిలకించి,

"పిల్లా! అక్కడ నిలవడతావేమి? లోపలికి రా?" యని రఘురాముని తల్లి యశోదమ్మ యనెను.

గంగలోనం బ్రవేశించి, యొక మూల వారి కెడముగాం గూర్చుండెను.

"ఈ పిల్ల ఎవరే, యశోదా? ఎంతచక్కగా ఉందే!" అని నూతనాగంతకురాల నరసమ్మ యశోదమ్మ నడిగెను.

"నరసా! ఇది మా పొరుగు కాంతమ్మ కూతురు. దాని చక్కదనం చెక్కలై పోయింది!" అని యెలుంగువంచి, "దాని నుదుటి కుంకం ఆరిపోయిందమ్మా! దాన్ని చూస్తే నా గుండె నీరై పోతూ ఉటుంది! ఆ పాడుదేముడు దాని నుదుట వెధవరికం రాశాడు." అని

యశోదమ్మ కంటఁ దడిపెట్టెను.

మ్లానవదనమున దరహాసరేఖ స్ఫురింప గంగ సాశ్రునేత్రయై యా మహిళామండలి ముంగల నవనతు రాలాయెను. ఆమె కా మంది రాభ్యంతరము ఘూర్ణిల్లుచున్నటులఁ దోఁచెను. అనిర్వచనీయ భయ భ్రాంతభావ మామె నావేశించెను. స్థలాంతరమునకుఁ బలాయన మార్గము నన్వేషించు నా యువతీ కాతరదృష్టులు రఘురామునిపైఁ బడియెను.

ఆ భయంకరప్రసంగ శ్రవణమున రఘురాముఁడు పుస్తకముల మాటుననుంచి, గంగాముఖావలోకన మొనరించెను. వారి చూపులు సమ్మిళితములై పోయెను. దీనదృష్టులు, కరుణరస తరంగితదృష్టులలో విలీనమయ్యెను.

"రఘురామా! నీవే నాకు దిక్కు; నీ వుండఁగ నే నెట్టులు హాత భాగ్యనయ్యెదను?" అని గంగాపాంగములు నిశ్శబ్దముగా ఘోషించు చుండెను.

"నే నుండఁగ నీ కెట్టి యమంగళమును గలుగఁ జాలదు! గంగా! భయము లేదు!" అని రఘురాముని చల్లని చూపు లాయనాథబాలి కకు నాశ్రయ మొసఁగుచుండెను.

వారిరువురి మధ్య కఠోరసమాజము వికటాట్టహాస మొనరించు చుండెను. వారి పవిత్రహృదయాశ్రువులు నసమాజమును చండోజ్జ్వల మహాగ్నికుండమున నింకిపోవుచుండెను.

## ౬

## హృతాలంకార

ఒకనాఁటి సాయంసమయమున శారదాంబ పెరటిలో పూలచెట్లకు నీరుతోడి పోయుచుండెను. శీతల జలప్రసారమునఁ బల్లవిత, పుష్పిత లతానికుంజములు మందమారుత వీచికలలో డోలాయమానమగుచుం డెను. జాజిపూవు లనంతసుశ్యామలగగనభాగమున తారామండలి వలెఁ జల్లని కాంతు లీనుచుండెను. గులాబి రాణి మహోల్లాసమున, లజ్జావతియగు మానవతీగండభాగముల నలంకృతమైనపాటలవర్ణమును స్మరించుచుండెను. మల్లికాప్రసూనములు లేశమాత్రపీతవర్ణ మిశ్రిత గౌరవర్ణంబులై ప్రేమరాజ్యభోగములను బ్రకటించుచుండెను. పుష్పిత రసాల వృక్షమొకటి ప్రాకారమున కనతిదూరమున మనోహర సౌర భముఁ గురియుచుండెను. ఆ వృక్షమూలమున నొక చలువతాతిపై రంగుల చాప యొకటి వేయఁబడి యుండెను. ఆ చాపమీఁద "కేశ రంజనీ" సుగంధతైలపూరితమగు సీసాయొకటియు, వినిర్మల దర్పణ మొకటియు నుండెను.

పూలచెట్లకు నీరుపోయుట ముగిసిన తోడనే శారదాంబ యను రాగపూర్వకముగాఁ బూవులు కోయసాగెను.

ఆ సమయమున గంగ యట కరుదెంచెను.

"గంగా! వచ్చితివా? ఆ చాపపైఁ గూర్చుండుము." అని శారద పుష్పనికురంబముతో నామెను సాదరపూర్వకముగా సమీపించెను.

వారిరువురును జాపపై నధివసించిరి.

"అమ్మా! నేను నవ్వ రాదనియంటివి? ఈపువ్వులేల నవ్వుచున్నవి?" అని గంగ ప్రశ్నించెను.

"బాలికా! పుష్పములు నవ్వుటకే వికసించినవి. వీటిని శాసించుటకు సమాజమున కధికారము లేదు. ఈశ్వరసృష్టిచాతుర్యమును జగమున కెఱింగింప నివి నిర్ణీతములైనవి. పువ్వులలో నవ్వు లేకున్న సౌరభము లేదు. సౌరభము లేకున్న, సృష్టిలో సౌందర్యము లేదు. సౌందర్యవిహీనజగంబు మృతప్రాయము. పువ్వులు లేకుండిన మానవ హృదయమునఁ గోమలత్వ ముండదు. ఆ కారణమున నేను బూవుల నారాధింతును. పూవులతో సౌందర్యమును బూజింతును."

"అమ్మా! విరులు తురిమి నా వేణి నలంకరింపవా? సువర్ణరత్నాభరణధారణ నా వంటి దీనురాలికి దుర్లభము. ప్రకృతిదేవతాలంకారభూతీ సుమంబు లేల నానుభవనీయములు కాఁగూడదు!"

"గంగా! నీ పలుకులు నా హృదయమున దావాగ్నిరవులు గొలుపుచున్నవి. నీ వమాయికవైనను, నిందితురాలవు! భర్తృవిహీనలు ప్రసూనమాలికలను స్పృశింపరాదు. భగవంతునికిఁ బ్రీతికరమైన వస్తుప్రచయము వారి దృష్టిగోచరము కాఁగూడదు. నీవు పుష్పాభరణములు దాల్చినచో లోకము వేయికన్నులతో నిన్నుఁ జూచును; వేయిరీతుల నీ వర్తన చారిత్రము నఘోషించును; అకళంకితహృదయమునఁ గళంక మూహించును."

"అటులైన నే బ్రతుకరాదు!—అమ్మా! నేను లేకున్న లోకమున కేమికొఱఁత? లోకకల్యాణ మహోత్సవమునఁ బాల్గొనుటకు నాకర్హత లేదేని నేను జీవించి యేమి ప్రయోజనము?"

"గంగా! అశ్రులు రాల్పకుము. శరచ్చంద్రమండల సదృశమైన నీ లావణ్యామయముఖము దుఃఖాశ్రుకలుషిత మగునేని, నాహృదయమును ననిర్వచనీయ భార మొకటి యణచివేయుచున్నటు లుండును. జీవనద్వారమున నీ విటు లేడ్చుచుండిన జీవనమార్గమంతయు మహాంధకారమున మునిఁగిపోయినట్లు నాకుఁ దోఁచును.—తల్లీ! నీకు జడ

వేసెదనులే! నీ కోమలహృదయమూనంగచంద్రికాబంధురమగునేని, ఈశ్వరుడు సంతసించును. పరమేశ్వర ప్రీత్యర్థము నీకు జడ వేసెదను. నీవేణీబంధమును బ్రసూనమాలికలచే నలంకరించెదను." అని పూతి గంగాజలసదృశమైన గంగానయనజలమును జేలాంచలమున నొత్తుచు శారదాంబయామెను కౌఁగిలించుకొనెను

గాఢపరితప్తమైన గంగాహృదయము శీతలచందన చర్చితమయ్యెను. వర్షానంతరము ముంజూరులనుండి జారు నీటిబొట్టులవలె నా యువతీ నేత్రములనుండి యశ్రుబిందువు లొక్కొటొకటిగా నేలపైఁ బడుచుండెను.

ఆమె మ్లానవదనమును ముద్దాడి శారద, "గంగా! పూవులను బ్రేమింపఁగలిగిన నిన్ను లోకమేల ప్రేమింపదు? లోక నేత్రమునఁ గోమలదృశ్యము కర్కశప్రాయ మెట్లయ్యెను. భగవంతుని సృష్టిసౌందర్యమయము. సుశీతల భాస్వంతములైన నక్షత్రమాలికలు, శాంతి సంపాదన తత్పరలైన వివిధతరులతాగుల్మములు, అస్పష్టసంగీతసౌభాగ్యమున మనోహరములైన శుకపికశారికాదిశకుంతములు, అనుల్లంఘనీయవిధాతృశాసన ప్రచారకులైన సవితృసుధాకరులు, సురభిళసుమంబులు, సదానందజ్యోతిర్బిందువులైన పసిపిల్లలు, ముగ్ధనారీమణులు, మానవుని సాత్త్వికహృదయము, సృష్టిసౌందర్యనిర్మాణమునఁ బరికరములుకావా!" అని యామె గంగను దగ్గరగూర్చుండఁ బెట్టుకొని, వినీలవిలంబకుంతలములకు సుగంధతైలమలఁది, నీటుగదువ్వి, మల్లెపూవుల జడ వేసెను; వినిర్మల జలపూరమున నామె ముఖబింబమునుగడిగి, ధవళవస్త్రాంచలమునఁ దుడచి, మనసార ముద్దాడి,

"గంగా! నీ మనోరథము నెరవేరినదా? అని యడిగెను.

దరస్మితశాలిని గంగ భాద్రపదశ్యాలి లక్ష్మివలె మెఱసిపోవుచుండెను.

"అమ్మా! ఒక్కసారి పూవులను ధరించినచో మనోరథ మీడేరు నని తలంచితిని. కాని నాకేటికో నీ యకళంకసుకుమార పుష్పధారణాభిలాష నూతనమై, శతగుణితమై పోయినది! నా జీవనమధ్యమున నేను మఱిపూవులను దాల్పఁగూడ దేని,—"

అర్ధోక్తిలో గంగానేత్రములు బాష్పాకులితములై పోయెను.

"గంగా! గంగా!—ఏమనుచుంటివి?" అని శారద యావేగమున నడిగెను.

"మఱేమియును లేదు. మరణానంతర మేని నన్నుఁ బూవులలోఁ బూడ్పింపుము. అట్లు చేయుదువేని నా యాత్మ మహానంద మొందును. వేల్పుల యనురాగమునకు నేను బాత్రురాల నయ్యెదను." అని గంగ గద్గదగాత్రయై పలికెను.

శారద సవితర్కముగా నామె మూర్ధమున మోమిడి సజలమేఘ రాశినిఁ బోలు నా యువతీవినీలకుంతలములను బాష్పవర్షమునఁ దడిపి వేసెను.

## ౧౦

### ఉపాసన

"గంగా! నీవిప్పుడు వసంతలక్ష్మివలెఁ గనువిందు గొలుపుచున్నావు. నీ యనమాన లావణ్యసరసిలో నా నేత్రములు నిమగ్నములైపోయినవి. నీ యమంగళవాక్యములు నేను వినఁజాలను. లోకోత్తర సౌందర్యరాశివగు నీకు సుమసమాధి స్మరణ యేల? పుష్పరథమున నిన్నుఁ గొనిపోయి వేల్పులు, సురభిళ పారిజాత విలసితనందనోపవనమున వికసితమందార సుమసమలంకృతాసనమున నధిష్ఠింపఁజేసి, దివ్యసుమాం

జాతుల నిన్నుఁ బూజించి, చరితార్థులయ్యెదరు. సౌందర్యపూజావిధానము నెఱుఁగుటంజేసి కదా, వేల్పులు స్వర్లోకవాసులైరి. తల్లీ! నీ సౌందర్యమును దర్శించి యభినందించుటకు విపులవసుంధరావలయమున నొక్కరైనను లేరా?" అని శారద దుఃఖ మణచుకొనుచుఁ బలికెను.

“అమ్మా! ఈ దీనురాలిపై నీ కింత యనురాగమేల?”

“ఈశ్వర సంకల్పమున ననురాగమేటికి నిర్దేశింపఁబడినది?”

“అనాథ లనురాగమునకుఁ బాత్రులా! వారి కన్నీరుఁ దుడుచుటకు మానవహస్తము సుస్నేహహర్ష కంపిత మగునా?”

“గంగా! నా లోక యాశవాదము చున్నది; మానవుఁడు తన కజేయమగుశక్తి సమక్షమున శిరము వంచుటకే కాక, స్వశక్తినిరూపణకుఁ గూడ సమర్థుఁడని నేఁదలఁచుచున్నాను. అవ్యక్తసమాజము కఠోరభావపూరిత శాసనపరంపరలచే మనలను బంధింపఁ బ్రయత్నించినను, భగవంతుని సంకల్పానుకూల్యముగాఁ బ్రవర్తించుటకు మన కధికారమున్నది!”

“అట్టులైన సమాజమునకును మనకును సంబంధ మేముండును?”

“ఈశ్వర సంకల్పమునకుఁ బ్రతికూలమైన సమాజగౌరవమును నే నంగీకరింపను; ఈ నానూతన తీర్మానమును నీ వేణీబంధన వ్యాపారమున విశదీకరించితిని.”

“అమ్మా! ఈ పుష్పమాలిక లేటికో నా శిరమున బరువుగాను న్నవి! అయోగ్యమగు నా శిరమునుండి యివి జాఱిపోవుచున్నవి. వీటిని ధరించి నేను బాపకర్మురాలనైతిని!” అని గంగ వడివడి జడవిప్పి పూవులను గ్రిందఁ బారవేసెను.

“బాలికా! నీ హృదయమింకను బరిపక్వ మొందలేదు. నీ నీడను జూచి నీవే భయపడుచున్నావు! పరమేశ్వరుఁడు నీకు సుస్థిరమనస్థై

ర్యమును బ్రసాదించునుగాక!" అని శారదయామె శిరమును నిమురు
చు నిమీలితాక్షియై, ధ్యాన నిమగ్నయయ్యెను.

"శ్యామల నదమల జలధరాంగమునఁ
గూర్చినాఁడెవ్వాఁడు క్రొక్కారు మెఱుఁగు?
నవ వసంతంబున నవజీవనంబుఁ
గరుణా ప్రసన్నుఁడై కల్పించె నెవఁడు?
కడు మనోహర శరత్కాల చంద్రికలఁ
బీయూష మెవ్వాఁడు వెలయింపఁ జేసె?
విరివిగా విరిసిన విమలగర్భమునఁ
గమ్మనివాసనల్ గావించె నెవఁడు?
నిశ్శబ్దగంభీర నిశలవిన్వీథి
వెలిగించు నెవ్వాఁడు విమలతారకలు?
ప్రత్యూషమున జగద్భవనంబునందు,
వరశాంతిమంత్రంబుఁ బఠియించు నెవఁడు?
మధ్యాహ్న మార్తాండ మండలంబందు
పీతిహోత్రునివోలె వెలుగొందు నెవఁడు?
చెలువముఁ దోలకాడు చిఱుతగాలులను
మలుసంజవేళల మలయించు నెవఁడు?
అస్వార్థగుణమయం బైన ప్రేమమును,
దల్లి యెడందలోఁ దరళించు నెవఁడు?
బాల్యయౌవన సుధాపాంగంబులందు,
నిర్మలానందంబు నెలకొల్పె నెవఁడు?
ప్రాజ్యసౌందర్య సామ్రాజ్యపీఠమున
నధివసించిన మోహనాకారుఁ డెవఁడు?
కన్నులారఁగ నా సుఖస్వరూపమును,

గాలి స్రవంతిలోఁ గదలిపోవుచును,
ప్రీతితో నొకసారి వీక్షింతునేని,
జన్మమెత్తిన మేలు సమకూరఁగలదు!—

## ౧౧

### పరిత్యక్త

"అమ్మా! మన యిరువుర కెంతయో యంతర మున్నది. నీవు పుణ్యాంగనవు; నే ననాథను. నీవు సౌభాగ్యలక్ష్మివి; నేను సర్వమంగళ విశేషముల దూషితను." అని గంగ యొకనాఁడు శారదాంబ యొడిలో శిరమిడి పండుకొని మెల్లగ ననియెను.

"తల్లీ! నీవు కల్యాణమయివి; నీ వెట్లనాథవైతివి? అనాథ యువతీ దృక్కోణవినిర్గతకాలానల సదృశబాష్పపాతమున మేదిని యనాథయగును. త్రిలోకైకపూజ్యంబగు శిరీషకోమల స్త్రీహృదయమును దిరస్కరించిన మానవుఁడు వికటాట్టహాసబంధురుండగుచు నరక మార్గమున నగ్రగుఁడగును. గంగా! నీ వనాథవైనచో సనాథ లెవరు?"

"అమ్మా! నీ నాథుఁ డెవరు? నే నాతని నెన్నఁడును జూచి యుండలేదు."

శారద మానముద్రాంకితయై యూఁదలవాల్చెను. ఆమె నేత్రములు బాష్పసిక్తములై కజ్జలమలినములై పోయెను.

"గంగా! హతభాగిని శారదావృత్తాంతశ్రవణమున నీ హృదయమునంటియున్న లేశమాత్రహాసము గూడ విలుప్తమైపోవును! నా హృదయవిచారమును నేనే యనుభవించెదను. తప్తభాండమునఁ

బదార్థమువలె నా హృదయశోకము నన్నే కలంచును గాక!'' అని యామె కన్నీ రొత్తుకొనియెను.

"అమ్మా! నీ దుఃఖభాగిని నగుటకు నే నుత్సహింతును. నా కట్టి పుణ్యావకాశముఁ బ్రసాదింపవా?" యని గంగ సత్యృష్ణనయనములతో నా వంకను జూచెను.

"గంగా! నేను పరిత్యక్తను. వసంతకోకిల మధురగాన ప్రవాహమున లోకమును దేల్చుట మహాపరాధమేని, వసంతోదయమున వనలక్ష్మి ప్రఫుల్ల పుష్పపరాగవసనధారిణియగుట లోకవిరుద్ధమేని, సూర్యచంద్రులు వియత్తలమున సరణిఁ దప్పక చరించుట యకార్యమేని, నా ప్రేమచరిత్రము నిందాపాత్రము నగును.

"నావిభుఁ డీయూరనే కలఁడు. అతఁడు చాల ధనవంతుఁడు, గుణగ్రహణపారీణుఁడు; సకల శాస్త్రపారదర్శి. అతని ప్రేమార్ద్రవీక్షణ మాలిక లొకానొకప్పుడు నన్ను దివ్యానంద సమలంకృత నొనరించినవి; నేను భాగ్యవతినని మురిసిపోతిని! కాని నాయానందము క్షణప్రభవలెఁ గాలమేఘగర్భమున నదృశ్యమై పోయెను. నేను జిరదుఃఖానుభవమునకు విధాతచే సృష్టింపఁ బడితినని తెలిసికొంటిని.

"నా మనోనాథుఁడు వేఱొక యువతీవీక్షణముల బంధితుఁడయ్యెను. ఆ బలవత్తరబంధమోక్షణ మాతనికిఁ గష్టసాధ్యమయ్యెను. ఆ యపూర్వ ప్రేమనాటక సంవీక్షణమున నా యానందజ్యోతి యొక్కసారి యారిపోయెను; సుఖప్రపంచము విషాదతమోచ్ఛాదితమై పోయెను.

"అమ్మా! గంగా! నా హృదయవిషాదము నా హృదయనాథునకుఁ దెలియకుండునటులు నే నెంతయు శ్రద్ధవహించితిని. అతని దృష్టిపథమున కెడమై, యాతని యానందవర్ధనమునకుఁ దోడ్పడితిని.

"నా భాగ్యచక్రము మఱి తిరుగలేదు; తిరుగఁ జాలకపోయెను.

ఆ యువతీపరిరంభణ భాగ్యము నా నాథునకు నిత్యనూత్నమై, మోదావహమయ్యెను. ఆతని సుఖమార్గమున నేను కంటకమువలెఁ బొడకట్టుచుంటిని. ఆతని కెడమైపోయినచో, నే నాతని కెంతయో సేవ చేసినదాన నగుదునని విశ్వసించితిని.

“ఒకనాఁటిరాత్రి మృదుల పర్యంకతలమున నావిభుఁడు నిద్రాసక్తుఁడై యుండెను. ఆతని పాదపద్మముల నొత్తవలయునని నే నాతనిని సమీపించితిని. ఆతఁడు మేలుకొని, తీవ్రదృష్టుల నన్నువలక్షించి, ‘నీవిట కెందులకు వచ్చితివి?’ అని యడిగెను.

‘నేను మీఛాయను.’ అని మెల్లగా, సవినయముగా నే నంటిని.

‘నీవిట రా నవసరము లేదు.’ అని యాతఁడు ఖండితముగా వాక్రుచ్చెను.

‘నాథా! మీ పాదసేవయే నే నర్థించుదానను. ఇంతమాత్రము దయసేయరాదా?’ యని నే నంటిని.

‘నీవు నన్ను స్పృశింపవలదు!’ అని యాతఁడు పెడమొగము పెట్టెను.

‘నాథా! నేను మీ పాదదాసిని; నాయం దింత కాఠిన్యమేల? మీ యాశ్రయము లేకుండిన నా కింకేమి యాశకలదు?’ అని పలికితిని.

శారద కన్నులు కషాయకాంతియుతములయ్యెను. నాశికాపుటము లెగురఁ జొచ్చెను. సమున్నత వక్షస్థలము వాయుసంచలిత సముద్ర భాగమువలె దృశ్యమానమగుచుండెను.

“అమ్మా! నీ విభుఁ డింత కాఠిన్య మూనినను, నీ వాతని నభినందించెదవు. నీ సాత్త్వికభావ మేమని వర్ణింతును!” అని మధురవాణి గంగ యశ్రులు రాల్చుచుఁ బలికెను.

“గంగా! పూర్ణచంద్రునిఁ బోలు నీ ముఖమండలమున విషాద

చ్ఛాయ నేఁ జూడఁజాలను. కాకై నీ వేటికి జాలిపడియెదవు? సకల జగదుపకార తత్పరుఁడగు పరాత్పరునకే నాయందు జాలి కలుగదయ్యె. ఈశ్వరేచ్ఛ నా కనుకూలమేని, ప్రేమాస్పదుఁడగు జీవితేశ్వరుని ప్రణయ ప్రసాదమునకు దూరమై యుందునా? తల్లీ! నేనెంత దీనముగాఁ బ్రార్థించినను నా నాథునకు నాయందు లవంబేని జాలి కలుగదయ్యె.

‘నీ వుండిన నాకు సంపూర్ణసుఖము లేదు.’ అని యాతఁడు మనోగతభావమును విశదీకరించెను.

“వాతాహత లతావల్లివలెఁ బ్రకంపితగాత్రనై నేను శయనాలయమునుండి యీవలి కరుదెంచితిని. నా మాతృదేవి నా పరిణయోత్సవ సమయమున నా కొసంగిన సువర్ణాభరణములను విక్రయించి నే నీ గృహమున నివాస మేర్పఱచుకొంటిని—

“పది వత్సరములనుండి నే నీదుర్భర జీవనయాత్ర నెఱపుచున్నాను. ఆర్యావర్తము పుణ్యభూమి. అచ్చట దేవతానివాసము లెన్నియో కలవు సంసారబంధ విచ్ఛేదముఁ గావించి, బుద్ధదేవుఁడు, ప్రసన్నసలిల ఫల్గునీ నదీతీరమున నిర్వాణ సామ్రాజ్యభోగము లనుభవించెను. ఎన్నటికైన నాకా పుణ్యనదీతీర విహారము లభించునా!” యని యామె విస్ఫారితనేత్రముల నానందజ్యోతిస్స్ఫురింపఁ బలికెను. అశ్రురంజితములైన యా నేత్రము లాకాశాంక దివ్యశోభను జూచుచున్నటు లుండెను.

ఆమె యొక్కింత యాఁగి, పదంపడి యిట్లనియెను:

“గంగా! నేను సనాథనయ్యు ననాథను; నీ వనాథవయ్యు సనాథవు!”

“అమ్మా! అట్లంటివేమి? నా నాథుఁడు మరణించెనని చిన్ననాఁడే నాగళప్రదేశము నుండి మంగళసూత్రమును ద్రెంపివేసిరి. నేననాథను

గాక సనాథ నెట్లయ్యెదను?"

"బాలికా! నీ హృదయధామమునఁ బ్రేమదీప మింకను వెలుఁగ లేదు; నీ వెవ్వరి నింకను బ్రేమింపలేదు. ప్రేమించుటకు నీ హృదయమున శక్తికలదు. మృతుఁడైన నీ నాథుఁడు నీ కపరిచితుఁడు; వాని సంబంధతత్వము నీ కగోచరము. అతఁడు జీవితమధ్యమున నిన్నుఁ బ్రేమించియుండఁడు. నీ నిసర్గసౌందర్యామృతపానమున కాతఁ డర్హుఁడుగాఁడు; కావుననే విధాత వానిని మృత్యుముఖమునఁ ద్రోసి వేసెను. నీ హృదయకుసుమ మిప్పు డిప్పుడే వాసనలు వెదజల్లుచున్నది. సమాజము సహస్రనేత్రములతో నిన్నుఁ గావలికాచినను, అచిరకాలములో నీ హృదయ పుష్పమునఁ దుమ్మెద వ్రాలక మానదు. సమాజమెంతబలవంతమైనను, ఈశ్వరేచ్ఛ కెదురేఁగఁజాలదు. ఈ నా విశ్వాసమే నన్నుఁ జాలసారులు భయభ్రాంత నొనరించినది. గంగా! ప్రేమరాజ్యముననీవు రాజ్యేశ్వరి వయ్యెదవో, లేక బందీకృతురాల వయ్యెదవో, నేనూహింపఁజాలను. ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో యెవరు గ్రహింపఁగలరు?" అని శారద సాలోచనపూర్వకముగా నామె నుపలక్షించెను.

గంగ ప్రత్యుత్తర మొసఁగలేదు. ఆమె శారదయొడిలో నట్లే పండుకొని యింటివాసములను జూచుచుండెను. ఆమె నేత్రపథమున రఘురాముని గంభీరామృతదృశ్యము విరాజమాన మగుచుండెను.

## ౧౨

### భిషగ్వరుఁడు

కాంతమ్మ శిరోవేదనవలన బాధపడుచుండుటచే గంగ రెండుమూఁడు దినములదనుక గృహకృత్యములలో నిమగ్నురాలై యుండెను. పాక

శాస్త్రమున నామె కెక్కువ నేర్పులేదు. ఆ కారణమున వంటచేయునపుడు రెండుమూడు సారులామె వ్రేళ్లుగాల్చుకొనెను. వంకాయలు తరుగునపు డామె బొటకనవ్రేలికి గాయము తగిలెను. ఒక పూట లవణాధిక్యము వలనను, మఱియొకపూట కారముకెక్కువగుట వలనను, వేఱొకపూట పులుపు తగ్గుటవలనను, పచనపదార్థములామెకే రుచ్యములు కాకుండెను.

కాంతమ్మ రోగార్తురాలు; పథ్య మరుచికరముగా నుండెను. అందుచే నామె గంగపై విసుగుకొని, కానిమాట లాడుచుండెను.

"నీవంట మండిపోను! కడుపు కాలిపోతూ ఉన్నా నీకు తోచదేమే! ఆ పాడుముండతో మాటలంటే పడినస్తావు; మరి ఒళ్ళు తెలియదు. ఆడదానికి గంటె తిప్పడం రాకపోతే బతకడం ఎలాగ?" అని కఠినోక్తు లెన్నియో పలుకుచుండెను.

గంగ తోఁకత్రొక్కిన బాలనాగమువలె నిలువునలేచి,

"అమ్మా! నీ వామెను దూషింపవలదు. మన మెట్టి పాపమును జేసితిమో యీ జన్మమున నింత యనుభవించుచుంటిమి. సాత్త్విక గుణసంపన్నురాలు శారద; ఆమెను దూలనాడిన మనకింక గతులుండునా!" యని పలికెను.

ముసలికాంతమ్మ మాటఁ ద్రిప్పుచు,

"చాల్లే! కాళ్లు విరగకొట్టేవాళ్లు లేక విరగపడుతున్నావు. అది చదువుకొని ఇంత ఉద్ధరించిందికదా? ఇంక నువ్వు చదువుకొని లోకాన్ని ఉద్ధరింతువుగాని! ఆ వైద్యుడు—అతని తల్లికడుపు చల్లగా—మన ఇంటికి దారి వెతుక్కొని రాబట్టి గాని, లేకపోతే నా ప్రాణాలు ఈపాటికి ఎగిరిపోయి ఉండును!"

గంగ ప్రత్యుత్తరముఁ జెప్పకయే వంటయింటిలోని కరిగి, మొసరు పెట్టి, పెరటియరుఁగుపైఁ జెక్కునకరంబూని కూర్చుండెను. ఆమె

ముఖమునఁ గోపరేఖలు విస్పష్టముగాఁ దోఁచుచుండెను. ముసలి తల్లితప్ప తన కింకెవ్వరును దిక్కులేరు; అది యెంత పాపాణియైనను, మాతృదేవతకదా? తల్లి నిందుకొనినందులకు XoX లోలోన నొచ్చుకొనుచుండెను.

సంధ్యాతిమిరము పురవీధుల నావరించిన తోడనే వైద్యుఁడు వేంకటాచార్యులాగృహమునఁ బ్రవేశించెను.

XoX యానరికి పాచనక్రియ సమాప్తమొందించుకొని నడవలో నిలువఁబడి యుండెను.

వైద్యునిదర్శనభాగ్యము లభించుట తోడనే కాంతమ్మ ముఖము-ముకుళిత ముఖము-చాటంత యయ్యెను.

"నాయనా! నీ చేతి మాత్ర నా ప్రాణం నిలపెట్టింది; దిక్కులేని దాన్ని. కాలాడకపోతే కదు పాడను!" అని మామె పలకమంచముపైఁగూర్చుండి పలికెను.

"మీా తలనొప్పి తగ్గిందా? నాది అమృత హస్తం! నేను పట్టిన కేసులన్నీ జయప్రదంగా నిర్మూలించాను మీాకు తెలిసే ఉంటుంది. రామచంద్రరావుగారు—కోమల వీధిలో ప్లీడరు—తెలియదమ్మా?-"

"తెలుసును నాయనా! చాలా మంచివాడు. నేనంటే అతగాని పెళ్ళానికి పంచప్రాణాలున్నూ!"

"అతగానికి ఈ మధ్య ప్రాణం మీాదికి వచ్చింది. పెద్ద పెద్ద పరీక్షలు ప్యాసైన ఇంగ్లీషు డాక్టర్లు—హేమాహేమీాలు—అదేదో, గొట్టం చెవులో పెట్టుకొని, పరీక్షించి, మూతులు విరిచి, ఇవతలికొచ్చారు. జట్కా వేసుకొని వాళ్ళ గుమాస్తా—వాడి పెళ్ళానికి దెయ్యం వదిలించాను కాబట్టి నా సంగతి బాగా తెలుసును—అర్ధరాత్రి మా ఇంట్లో పడ్డాడు. వేయినూట పదార్లు కట్నం ఇస్తారని చెప్పాడు. నాకు డబ్బంటే ఖాతరా? ఒక పెద్ద మనిషి ప్రాణాలు నిల

పెట్టడం ఎంతో పుణ్యం అని, నిద్రమానుకొని-వెంటనే వెళ్ళి, ఒక్క మాత్ర గంధం నీళ్ళలో కలిపి ఇచ్చేసరికి పక్కలోకి నిలిచినట్లు ఆ ప్లీడరు కళ్ళు విప్పి చూశాడు. ఆ మొన్నాడు ఆ మందే రెండు మోతాదులు ఇచ్చాను-గుండులాగు లేచి భోంచేసి, కోర్టుకెళ్ళి, సింహంలాగ కేసులు వాదించాడు!"

"కట్నం ఇచ్చారా?"

"వెండిపళ్లెంలో పెట్టి పెద్ద సభలో నన్ను మెచ్చుకొని బహుమతి చేశారు. నాకిది ఒక లెక్క కాదు. జమీందారు లందరు నా పేరు చెపితే తలలు వంచుతారు. నేను అందరిదగ్గర డబ్బు పుచ్చుకోను. అది నా మతం కాదు. వితరణ లేకుంటే ధనంత్ని స్థిరంగా ఉండదని పెద్దలు చెప్తారు. అందుచేత మీ బోటి వాళ్ళందరికి ధర్మార్థం మందు లిస్తాను. పిలవకపోయినా, వాళ్ళ కష్టం చూడలేక, వాళ్ళకొంపల్లో దూరి మందు వేస్తాను."

మీ కా ధర్మగుణం భగవంతుడు కలిగించబట్టిగాని, లేకుంటే మా లాంటి బీదలు బతగ్గలరా బాబూ"

వైద్యుడు మొలనున్న డబ్బీదీసి ధూమ్రవర్ణమయుంబులైన మాత్రలు రెండు ఆమె చేతిలో బెట్టి,

"ఇప్పు డొకటి పుచ్చుకోండి; రాత్రి పన్నెండు ఘంటల కింకోటి పుచ్చుకోండి. తెల్లవారేసరికి దులాగ్గా ఉంటుంది." అని పలికెను.

కాంతమ్మ యా మాత్రలను బుచ్చుకొని, కొంగున నొకటి ముడివేసి,

"గంగా! కొంచెం నీళ్ళు తే!" యని కూతుచు బిలచెను.

కంచుచెంబులో జలము సంగ్రహించి గంగ తల్లిని సమీపించెను.

వైద్యుం డా లావణ్యవతిసి దిలకించి పులకితగాత్రుండై పోయెను.
"ఈపిల్ల చేతచిక్కితే ఇంకేం కావాలి? ఓహో! ఎంతచక్కదనం!"

అని యనుకొనెను.

గంగ మాతృహస్తమున జలపాత్ర సమర్పించి, నడవలోనికి నడచి పోయెను.

కాంతమ్మ చాలసేపు మెల్లగా నావైద్యునితో నేమేమియో సంభాషించెను. అతఁడు చేతికఱ్ఱపై గడ్డమునుంచుకొని, కుడిచేతితో నభినయముఁ జేయుచు,

"మీదయ—నామాట మరిచిపోకండి. నన్ను నమ్మి ఎవ్వరూ చెడిపోలేదు. మనస్సు కలిస్తే ప్రాణమేనా ఇస్తాను!" అని పలికి యా వృద్ధురాలి చేతిలోఁ బదిరూపాయలు పెట్టెను.

వైద్యుఁడింకను తల్లితో మాటాడుచుండెనో, లేక వెడలిపోయెనో యని గంగ చావడిలోనికి దృష్టిఁ బఱపెను. అతఁడు తన మాతృదేవత కర్పించిన రూపాయలను జూచి యామె నిలువున నీరైపోయెను. నరక మధ్యమునఁ దాను జిక్కుకొనినట్లు తలంచెను.

## ౧౩

### ఉపదేశవాణి

పదిరూపాయలతో కాంతమ్మ శిరోవేదన యుపశమిల్లినది. ఆ చప్పిదవుడల ముసలిది తన నేర్పునకుఁ దానే మెచ్చుకొనుచు జగద్భాగ్య విధాతవలె నెగిరిపడసాగెను.

గంగ యా యున్మత్త వానరమును జూచి నవ్వుచు, "అమ్మా! వైద్యునివద్ద మందులేకాక దక్షిణకూడ స్వీకరించితివి! నీ యనుమాన పాండితీగరిమ నేమనుదాన!" అనియెను.

"గంగా! నాపక్క కూర్చో. నీతో ఎన్నో సంగతులు చెప్పాలి—

ఈ పది రూపాయిలు లెఖ్ఖానాకు! నా చిన్నతనం ముచ్చటలు వింటే నువ్వు మరీ ఆశ్చర్యం బడతావు:" అని వీధితలుపు తెఱచి, వీథి నిర్మానుష్యమై యుండుట కెంతయు సంతసించి, తలుపువేసి, స్వీయ పురాణమును జెప్పమొదలుపెట్టెను.

"నా చిన్నతనంలో నేను ఎంతో చక్కగా ఉండేదాన్ని. జటవేసుకొని, పూవులు పెట్టుకొని, గులాబీరంగుచీర కట్టుకొని, బైలుదేరే సరికి, ఆడవాళ్ళే నన్ను కౌగిలించుకొనేవాళ్ళు. 'కాంతమ్మా! నీ చక్కదనం చూసేందుకు ఈ రెండు కళ్ళూ చాలవే!' అనేవారు. పెద్ద పెద్ద జమీందార్లు నేను నవ్వితే చూడాలని ముసిరిపోతూ మన వీథిలో కాచుకుని ఉండేవారు.

"ఒకనాడు ఒక జమీందారు ఏది కోరితే అది ఇస్తానని రాయభారం పెట్టాడు. సిరి ఎదురైతే మోకాలు ఒడ్డరాదు. నేను ఒప్పుకున్నాను. వెంటనే ముత్యాలపల్లకీ పంపించాడు. రాత్రి రెండో కంటివాడికి తెలీకుండా, ఆ పల్లకిలో పట్టుపరుపుమీద కూర్చొని, మహలులోకి వెళ్ళాను. అయ్యో! ఆరోజులు పోయాయి. మళ్ళీ రావుకదా!" యని యామె దీర్ఘనిశ్వాస మొదలించెను.

ఆ యసభ్యవృత్తాంత మాలించి గంగ స్వర్ణలతవలెఁ గంపించి పోయెను. ఆమె గుండెలు దడదడ గొట్టుకొనసాగెను.

"అమ్మా! పాపకార్య శ్రవణమునఁ గంపించిపోవు స్త్రీజాతి పాపాచరణమున హస్తక్షేప మొనరింపఁగలదా?" యని యామె బాష్పరుద్ధకంఠము గాద్గద్య మొందఁబలికెను.

గంగాభాషణములు కాంతమ్మ కర్థవంతములు కాలేదు.

"ఓసీ వెఱ్ఱిదానా! మొగుడు సస్తే వాడితో మనం కూడా సస్తామా? ఏదో దారి చూసుకోకపోతే బతకడం ఎలాగ?" అని యామె, దీర్ఘోపన్యాసమునకుఁ గడంగెను; గాని గంగ కోపారుణిత లోచనయై

"అమ్మా! ఇంకెన్నఁడును నాతోడ నిట్టిమాటలు చెప్పవలదు. బ్రతుకుటకు మార్గాంతరము లేకుండిన మరణమే నాకు శరణ్యము!" అని పలికెను.

మధ్యాహ్నసమయమునఁ గాంతమ్మ మెల్లగా నడచుచు వేఱొక వీథిలోఁ గాపురమున్న తన మేనత్త యింటికిఁ బోయెను. ఆ భయంకరభూతము నిష్క్రమించిన తోడనే గంగ వీథితలుపునకుఁ దాళము వేసి, వడివడి శారదా మందిరమున కరిగెను.

శారద గ్రంథావలోకనమునఁ దత్పరయై యుండెను. గంగ యామె పదములపైఁ బడి,

"అమ్మా! అమ్మా! నాకేమిదారి; నేనిప్పుడు బలిపశువు నైతిని!" అని బిట్టు వగచెను.

కెందామరలఁబోలు నామె నేత్రములు, ధూమావృతజ్వాలాసదృశ ముఖమండలము, ప్రగాఢకంపిత సువర్ణగాత్రము, శారదా హృదయ విదారణ మొనరించెను.

"నా రత్నాలతల్లీ! నీకేమయ్యెనే?—నీ కన్నీరు నేఁ జూడలేను. చెప్పుము, తల్లీ! నిన్నెవ రేమనిరి? పవిత్రసుమరాజమును బదదళిత మొనరించిన దుర్మార్గు లెవరు? అమ్మా! భాగీరథీ స్వచ్ఛజలముల స్మరింపజేయు నీ కన్నీళ్ళు పరితప్తములైన నీ మృదుల గండభాగములను జ్వలింపఁజేయుచున్నవి! తల్లీ! మాటాడవేమి? మృదుమధుర ప్రసూనమున బాణప్రయోగ మూహించిన వారెవరు?" అని తత్తరపాటుతో శారద పలికెను.

హృదయావేగ మణచుకొని గంగ,

"మాతృదేవి!—నా యానందసద్మన మూహింపవలసిన మాతృదేవి!—" అని యెంతయో కష్టమున నుత్తర మొసంగెను.

"హా! విధాతా! ఎంతకష్ట మెంతకష్టము!—కంచెయే చేను మేసిన

దిక్కింకేమి కలదు?—అమ్మా! గంగా! నీకేమియును భయములేదు. ధైర్య మవలంబింపుము. నా కంఠమునఁ బ్రాణముండు నంతవఱకు నీ సుపవిత్ర చరిత్రమునఁ గళంకము కలుగనేరదు.'' అని యభయ ప్రదానముఁ గావించెను.

వైద్యుని యపూర్వచర్యలు, కాంతమ్మ స్వీయ చరిత్రమునుండి తనకు వినిపించిన శృంగార రసోద్దీపిత పాపభూయిష్ట కథాప్రణాళియు గంగ శారదాంబ కెఱింగించి, వడివడి గృహోన్ముఖురాలయ్యెను.

వీథిలో రఘురామమూర్తి యామె కెదురయ్యెను. వారిరువురొండొరులఁజూచి దరస్మితులైరి; కాని గంగాహృదయ పరితాపము స్పష్టముగా నామె ముఖమున గోచరించుచుండెను.

రఘురాముఁ డామెను,

"గంగా! రెండు దినములనుండి మాయింటికి రావైతివేల?'' అని ప్రశ్నించెను.

''ఇప్పుడే వచ్చెదను'' అని పలికి గంగ వడివడిపోయి స్వీయగృహ కవాటమును దెఱచి, లోనఁబ్రవేశించెను.

ప్రాస్వధవళకుంతల, ధూమ్రాక్షి, కాంతమ్మ నడుమునఁ జేయివేసి కొని, మెల్లగా నడచుచు, వీథి శుభ్రముగాఁ దుడువఁబడి యుండినను, పంచమ సోదరులను నోరారఁ దిట్టుచు,

"వెధవ ఎంగిలాకులు వీధిలోనే పడేస్తారు! కాస్తదూరం పోతే కాళ్లు విరిగిపోతాయా!" అని యగోచర వ్యక్తుల నిందించుచు, నిజ గృహద్వారమును సమీపించెను.

# ౧౪

## ప్రణయోపహారము

యశోదమ్మ పుణ్యతీర్థాభిలాష భద్రాచల యాత్రకుఁ బోయియుండెను. బజారువీధిలోఁ గల „రామ అయ్యర్ ఆధునిక భోజనశాల”లో రఘురామమూర్తి భోజనక్రియఁ గావించి యింటికి వచ్చెను. ఆతఁడు తలుపు తెఱచి, వీధిచావడిలో నొక రత్నకంబళముపై సుఖాసీనుఁడై, "లాన్సులాట్ అన్డు ఇలేఇన్" అను సుమధుర పదగుంభిత, సుకుమారభావపూరిత, ఆంగ్లపద్య కావ్యమును జదువుకొనుచుండెను: రాజేశ్వరుఁడగు ఆర్థర్ యొక్క సుప్రసన్న సుగుణసంపద, మహోదార స్వర్గీయనీతి, నిరంతరకరుణారసతరంగితహృదయనైర్మల్యము, పతితప్రాణోద్ధరణకామనాసక్తి, రఘురాముని హృదయమున సాత్త్విక భావమును బోషించుచుండెను.

రాజేశ్వరి "గినివియర్" యొక్క యనమాన సౌందర్య విభవము, నిరుపమానాభిమానము, మోహన మంత్రపఠనా చాతుర్యము, హాసోన్మత్తభావమునఁ గోపారుణ రేఖాదృశ్యము, ఆతని మనోధామమును శృంగారకరుణరసప్రవాహమున ముంచివేసెను.

నవమాలిక "ఇలేఇన్" యొక్క సాధుభావము, అప్రకటిత ప్రణయగాథ, అస్వార్థమధురసేవ, అకళంకతారాసదృశతనూవిలాసము, ప్రశాంతమరణాను భోగము, నిశ్శబ్దనౌకావిహారము, అతని నానందదుఃఖాశ్రుతరంగిణిలో ముంచివేసెను.

ఆ యపూర్వ గీతాగానము జేసిన కవి చక్రవర్తిని, రసజ్ఞపండితుని ధ్యానించి యాతఁడు హృదయవందన మాచరించెను.

పాలతోఁ జేసిన పూరీలును, పులిహోరయును నొక పళ్ళెరమున

నిడుకొని గంగ రఘురాముని నమీపించెను.

"గంగా! ఈ బహుమాన మేమి?" అని యాతఁడు నవ్వుచుఁ బ్రశ్నించెను.

"మా యమ్మ పంపించినది. నీవు తప్పక భుజింపవలెను." అని గంగ యా పళ్ళెరము నాతని యెదుటఁ బెట్టెను.

"గంగా! నే నొక్కఁడనే యున్నానని తెలిసియు, నిన్ని పూరీలను దెచ్చితివేల? ఇంత ఫలహార నా కొక్కనికిఁ జాలునా?"

"నే నిచ్చట నిలతునేని నీకు మొగమోటమి యగును. నీవు భుజింపుము. మంచినీళ్ళు దీసికొని నే నింతలో వచ్చెదను." అని గంగ వెడలిపోవ నుద్యమించెను.

"గంగా! ఇంటిలో మంచినీళ్ళు లేవనుకున్నావా? నీవు పోనక్కర లేదు. ఇది మన మిద్దరమును జెరిసగము తినవలయును."

"మా యింటిలోఁ జేసికొని మేము తినకపోవుదుమా? నే నింటి వద్దఁ దినెదను."

"నీవు తినకుండిన నేను దినను."

"ఇదేటి పంతము, రఘురామా!—నీవు తినుము."

"మీ యమ్మకు జబ్బుగా నున్నదని చెప్పియుంటివి. పిండివంటలు చేయుట కప్పుడే సామర్థ్య మలవడెనా?"

గంగ యించుక లజ్జితయై,

"ఎవరు చేసిననేమి? నీవు తినవలయునని నా ప్రార్థన," యనియెను.

"నీ వెంతటి చతురవు; గంగా! నీవే చేసితివా? చేసినదానవు ముందుగ నాకే యర్పింపవలయునా? నా యం దేమి ప్రాముఖ్య మున్నది?"

"రామా! నీవు తినుట మాని మాటలలోఁ బడితివి!" అని యామె ప్రసన్నురాలై నవ్వెను; ఆమె విశాలాక్షములు బాష్పరంజితము లయ్యెను.

"గంగా! శారదాంబవద్ద నీవు చదువను వ్రాయను నేర్చుకొనుచున్నావట. నిజమేనా?"

"నిజమే. ఆ దయామయి నా యందవ్యాజకరుణా ప్రసన్నయైనది. ఆ విదుషీమణీ సాంగత్యమున నేను జరితార్థురాలనయ్యెదనని యాశించుచున్నాను."

"గంగా! నీ పలుకులు నా కర్ణములకమృత పూరములైనవి నీవు శ్రద్ధాధీనవై చదువుకొనుము. శారదాంబ మహిళామండలికి నాయకమణి; సాధుచరిత్ర. ఆ యుదారహృదయ నిన్నుద్ధరింపఁగలదు. రాజమార్గమెఱుంగక ఎందఱెందఱో యువతీమణులు, కంటకమార్గగాములగుచున్నారు! నిన్ను రాజమార్గమున నడుపఁగల సమర్థురాలు శారదాంబ! ఆ శారదాపరావతారమును నిశ్చలభక్తితో నీవు సేవింపుము."

"రామా! నీ యకృత్రిమస్నేహమున కేనెంతయుఁ గృతజ్ఞురాలను. నీ సదుపదేశమును నా హృదయమంజూషమున భద్రపఱచి యుంచెదను."

"గంగా! మొన్న మీ యమ్మ నిన్నుఁ గూర్చి పరుషవాక్యము లాడుచున్నటు లుండెను; కారణమేమి?"

"ఆమె వయోధిక్యమున మంచిచెడ్డ లెఱుంగదు. పరుషవాక్ప్రలాప మామెకు వ్యసనప్రాయమై పోయెను."

"గంగా! నీవు మంచిదానవు. నీ హృదయము చాల మృదువైనది. నీ సహిష్ణుత నీ యాత్మోన్నతికిఁ గారణమగును.—నీ విప్పుడు నా యెదుటఁ బెట్టిన యీ పదార్థములను నేను దేవీప్రసాదమువలెఁ గన్నులకద్దుకొని భుజించెదను. నీ వానందించిన నేను దేవీప్రసన్నుఁడనయ్యెదను!"

"గంగా!" యని కాంతమ్మ కెవ్వున కేక వేసెను. ఆ వృద్ధ మఱు-

టమునకుఁ దేలుకుట్టుటవలన రోదనఁ జేయుచు, "నీ యిల్లు కాలిపోను ఒక్క నిమిషం ఇంట్లో కాలు నిలవదే నీకు!" అని యింకేమేమియో పలుకుచు నామె చావడిలో సివాలు వేయుచుండెను.

గంగ సత్వరగమనయై గృహమునఁ బ్రవేశించెను.

## ౧౫

### ఆ రా ధ న

"మాతృవదనమున మాధుర్యముండును. మాతృహృదయమున సుశీతల హిమజ్యోతి వెలుఁగుచుండును. మాతృపరిరంభణమున మహానందమున్నది. మాతృకటాక్షము దివ్యానురాగ రంజితము. మాతృదేవతాపాటలాధరమున వాగమృత మొలుకుచుండును. మాతృదేవతశక్తిస్వరూపిణి; ఆమెకంటెను దైవమితరము లేదు!

"ఆహా! అట్టి మాతృహృదయతృష్ణకు స్వసంతానమే యాహుతియయ్యెనా? మాతృదేవతా పూజా రహస్యమెఱిఁగిన పుణ్యభూమి భారతవర్షము. ఆకారణముననే పరకాంతలలో మాతృసందర్శనము పరమకర్తవ్యమని వైదికసిద్ధాంతము. మాతృస్తవము వేదముల శిరోభూషణమై, శ్రుతుల విశ్రుతమై, స్మృతులసంస్మృతమై, యలరారుచున్నది!— "అట్టి మాతృదేవత స్వసంతాన పీడనకార్యమున నిరంతర తత్పరయగునేని "మాతృ" శబ్దము, మధురభావ విరహితమై, నిస్తేజమై, నిష్ఠురకర్కశధ్వని మాత్రమగును! మాతృహృదయమార్దవ మంతరించినచో జగంబున మార్దవపదార్థ మింకేమి యుండును? మాతృనేత్రములు తృష్ణాపూర్ణములగునేని, యనురాగమునకుఁ జోటెందుఁగలదు? హతాశాహృదయమున కభయప్రదాన మెవరు చేయుదురు? సంతప్తభువనాలయ

మున శాంతి మహామంత్రము నెవరు పఠింతురు? స్వర్గీయస్వస్తిగానమిం కెవరు చేయుదురు?

“మాతృపదమను పరమ వాక్ప్రసంగ పరతయేని, సమాశ్వాసవాణి లోకలోకాంతరముల నవిశ్రుతమై పోవును. భూమాతహృదయమున మార్దవభావము లేకుండిన, సీతామహాసాధ్వి ప్రచండదుఃఖాగ్నిలో దగ్ధపటలము కాకుండునా? కౌశల్యాహృదయధామమున మధురాశీర్వాదపరన నిరంతర విశ్రుతము కాకుండిన శ్రీరామ చక్రవర్తి కంటకవనమార్గమునఁ బ్రఫుల్ల సుమసమాలంకృతస్వర్గ సోపానశ్రేణిఁ దిలకించియుండునా! భువనైక దుఃఖిని, మహాపతివ్రత, దేవకీహృదయమున వాత్సల్యభావామృతము లేకుండిన, శ్రీకృష్ణభగవానుని త్రిలోకాకర్షణ మురళీగానము సుశ్యామలసుప్రసన్న యమునా వీచికలతో మేళ మాడియుండునా?

“ఓ మాతృదేవీ! నీకు నమస్కారము! నీవు జీవన ప్రదాతవు; మానసిక శక్తిస్వరూపిణివి; వాగ్దేవతవు; కర్మ ప్రబోధితవు! తల్లీ నీసింహాసననిమ్న సోపానమున నేనువిన్యస్త మస్తకముతో, నిర్భరానందకలిత నేత్రములతో, ముకుళితహస్తములతో, నిరంతరధ్యాన నిమగ్నురాల నగుదునుగాక!” అని శారదాంబ పూజాగృహమున, శుచివస్త్రధారిణియై, యుషానసమయమున నేరిన తుషారబిందుమండిత, మకరందబంధుర పుష్పనికురంబముచే మాతృపటమును బూజించుచుండెను.

మాతృదేవీ పటమున కించుక నెడముగా నాయుభాగినీ హృదయనాథుని చిత్రపటమున్నది. ఆమె పుష్పాంజలియై, యశ్రుసిక్తనేత్రములతో, నాపటము నుద్దేశించి, యిట్లనియెను.—

“ఆర్యపుత్రా! చాలదినముల క్రిందటిముచ్చట!—హఠాత్తుగా నాహృదయమున ద్యోతకమైనది. దారుణనిదాఘసమయ పరితప్తమహీకళేబరమున సజలనీలమేఘచ్ఛాయపడినట్టుల, హఠాత్తాశన సమ

హృదయతాపమునఁ బ్రశాంతభావ ముదయించుచున్నది!

"ఒకనాఁడు ప్రేమోపహారరూపమున, నీ యభాగినీ క్షుద్రహృద యరంజన మభిలషించి, స్నేహాభరమున, స్నేహసంభాషణపూర్వకముగా నవమల్లికాహారము నాకొసంగితివి! ఆ నీపుణ్యస్నేహమును భక్తితో స్మరించి, సజలనయనములతో నీ దీనురాలు నీ శ్రీచరణముల నీపుష్పాంజలినర్పించుచున్నది!—నమస్కరించుచున్నది!—

"ఆహా! ఏకాంతమున, నీ పాదపద్మముల సమీపమున, సుఖనిద్రాముద్రిత నేత్రములతోఁ గూర్చుండు పుణ్యాధికారము జ్ఞప్తికి వచ్చుచున్నది. ఈ నిరాశా జీవనమునకు నోచుకొనిన నా కానుఖానభవము శాశ్వతమెట్లగును?—కాని విచ్ఛేదకాతర హృదయమున నా సుఖస్మృతి సుస్థిరముగా నిలచిపోయినది! మనోహరా! నిభృతప్రాణమున నాస్మృతి సమారాధన నా కామరణానందభోజ్యమగునుగాక!'

సంపూతచరిత సీతపరిత్యక్తయైనప్పుడు భూదేవి యామెను కౌఁగిటఁజేర్చి, యశ్రులు దుడిచెను. శ్రీరామచంద్రుఁ డేకాంతమున బాష్పవిసర్జనఁ గావించెను.

శారదాంబ మాతృహీన. భవసాగరతీరమున నాయబల మాతృసంశ్లేషణ భాగ్యమర్థించుచు, జీవితేశ్వరుని ప్రణయపరిసంగమును స్మరించుకొనుచు, నశ్రులు రాల్చుచుండెను.

## ౧౬

### భిక్షాపాత్రము

తేలుకాటువలనఁ గాంతమ్మ రోదన క్రియాపరిజ్ఞానముఁ బ్రకటించుచుండెను.

అంట్లు తోముకొనుచు దుర్భరజీవనయాత్ర మహోల్లాసమున నెఱవుచున్న "ఎంకి" వీధినిఁ బోవుచుండఁ జూచి, కాంతమ్మ యెలుగెత్తి,

"ఒసే వెంకీ! ఇల్లారా!" అని పిలచెను.

వెంకి వినవిన నడచి వచ్చి,

"ఏటమ్మా! ఏళా పాళా లేదు. ఎప్పుడూ పిలుత్తావు!" అని నవ్వుచుఁ బలికెను.

"గూట్లో చెయ్యి పెట్టానో లేదో, దాని ముఖుమీద్నా — వెధవ తేలు — నా కోసానికే గూట్లో కాపరం ఉంది కాబోలు — చిటికెన వేలుమీద కుట్టిందే! ఒక్కమారు ఆచార్లుగారిని పిలుచుకోరావే, తల్లీ!" అని కాంతమ్మ బ్రతిమాలుకొనునట్లు పలికెను.

"ఆ శార్లులేదు, గీశార్లులేదు — పదిళ్ళలో తలమున్కలున్న దాన్ని, నే నెల్ల లేనమ్మా! తేలు కుడితే పానం పోతాదేటి! ఘనం మంటెత్తాది అంతే — ఇదేటమ్మా! పానం మీద కొచ్చినట్టవుతావు!" అని వెంకి సత్వరగమనయై వేఱొక వీథిలోనికిఁ బోయెను.

"రెండు పూట్లా మేప బట్టి ముండ ఒళ్ళు తెలీకుండా ఉంది" అని కాంతమ్మ వీథిలోనికిఁ జూచుచు, రోదన చేయుచుండెను.

ఆ కర్కశభైరవరావమాలించి సోడాబుడ్లను గొనిపోవుచున్న బాలుఁడొకఁడు వీధిగుమ్మము దగ్గర నిలువఁబడియెను.

కాంతమ్మ వానితో,

"అబ్బాయీ! మంగళారంపేటలో ఉన్న వైద్యుడు — ఆచార్లుగారిని ఒక్కసారి పిలుచుకోవస్తావూ!" అని పలికెను.

ఆ పలుకు లాలింపకయే ఈల వేసి, బాలహరిణమువలె నా బాలుఁడు ఛంగున దాటిపోయెను.

"భాగోతం చూసినట్లు వెధవ లందరూ మూగడమే కాని ఒక్క-

డికీ దయాదాక్షిణ్యాలు లేవు. అందుకే లోకం ఇలాగ మండిపోతూఉంది! అని యామె విసుగుకొనియెను.

"అమ్మా! నీ సంపుక సైరింపుము; వైద్యుఁడు వచ్చువేళయైనది." అని గంగ యామెను సమాశ్వాసింపఁ బ్రయత్నించెను, గాని యావికృత దంష్ట్రి యామెపైఁ దీవదృష్టిపాతముఁ గావించి "

"ముద్దులాగు కూర్చొని శ్రీరంగనీతులు చెప్పకుంటే వెళ్లి వైద్యుణ్ణి పిలుచుకొని రాకూడదూ? నే నస్తే ఏ క్యాసిఁగు వెధవతోనో పారి పోదామని చూస్తూఉన్న నువ్వెందుకు వెళతావు?" అనియెను.

గంగా హృదయమున నగ్నిపర్వతము భేదించినట్లు తోఁచెను: ఆ పాదము స్తనము గాలాగ్నిలో దహించుకొని పోవుచున్నటు లుండెను; హృదంతరాళమునఁ బ్రచండవిషానలము జ్వలించి పోవుచుండెను.

"అమ్మా! నీకు నే నెంత భారమైతిని! పురిటిలో నన్నేల కడ మాట్టింపవైతివి?" అని యనివారితముగాఁ బ్రవహించు కన్నీళ్ళు దుడుచుకొనుచు వెక్కి వెక్కి యేడువఁ దొడఁగెను.

"ఈ సానిటక్కులు దాని దగ్గరే నేర్చుకొన్నావా ఏమిటి? ఆ పాడు శారదనీ కెక్కడ దాపరించిందే? ఎప్పుడూ ఏడుపే. అతగా నొచ్చే వేళైంది; ఒగాయిత్తంగా ఏడుస్తూ కూచో! బతికేదాన్ని బతకనియ్యవు, కలకల లాడుతూ అతనితో నవ్వుతూ మాటాడితే మన ఇల్లు పండదూ? మన కింత దరిద్రం ఉంటుందీ? కొంప కూలి పోయినట్లు ఏడుస్తావెందుకు?" అని యామె గంగతో ననునయవాక్యములు పలుకసాగెను.

గంగా నేత్రములు కెందామరలవలె నరుణరేఖాంచితములై యామె హృత్తాపమును బ్రకటించుచుండెను.

"అమ్మా! నీవు నన్ను నరకమునఁ ద్రోయ నూహించుచుంటివి. నీ భైరవవాణి నే నాలింపఁ జాలను. నేను జీవించి యుండుట నీకే

యసహ్యమైన నాకీ ప్రాణధారణ సుఖ మేమున్నది? నీవు నిరూపించు సుఖసామ్రాజ్యము నే నూహింపఁ జాలను; నా కది దుర్నిరీక్ష్యము. నా క్షుద్రహృదయము శతఘ్నిముఖముఁ బడిపోవుచున్నది! తల్లీ! ఇంటింట బిచ్చమెత్తుకొనినఁ బొట్ట గడవదా? భిక్షాపాత్రయక్షయసుఖ ప్రదాయని యని పెద్దలు వచింతురు. ఆ యక్షయ భిక్షాపాత్రధారణ మన కేల తగదు?'' అని గంగ ప్రకంపితగాత్రయై పలుకుచుండెను.

ఆ సమయమున సంఘభిక్షుకుఁడొకఁడు సర్వాంగసుందరి యగు తన భార్యకోమలభుజమున హస్తమిడి వైరాగ్యగీతమును బాడుచు వీథిలో నిలువఁబడియెను:

ఎందుండి వచ్చితో ఎందాఁక వచ్చితో
ఈ గూటిలో రామచిలకా?
ఎన్నాళ్ళు బ్రతికినా ఈ జైలులోపల
ఏమి సుఖమున్నదే చిలకా?
బంగారుగూటిలో పలవింతువే కాని,
బైట పడనేరవో చిలకా!
పాటపాడెదుగాని, పాటలోగలతీపి
భావింపగాలేవె చిలుకా!
వనవృక్షములమీద స్వైరవిహారంబు
వంశంబులోనిదే చిలుకా?
వంశమర్యాదల వరుసతప్పినజన్మ
వ్యర్థంబు వ్యర్థంబు చిలకా!
శుకయోగి మీయింటి చుట్టమంచెఱుగవా?
సుఖభోగి మొల్లయ్యో చిలకా?
వనలక్ష్మి యతిథివై, వనఫలభోక్తవై
వరలుటం జేసి యో చిలుకా!

బంగారుగూటిలో భ్రమణంబు నీ కేల?
ద్వారము ద్ఘాటింపు చిలకా!
ఎరకలల్లార్చి నీ వెగసిపోయెద వేని,
ఎనలేని సుఖమబ్బు చిలుకా!—"

కోకిల స్వరమున నా యంధుని భార్య పల్లవినిఁ బాడునపుడు అచేతన పదార్థవిచయము కూడ చేతనాసహిత మగుచుండెను!

గంగ వడివడి లోనికిఁబోయి పళ్లెరమున బియ్యముఁ గొని యీవలికివచ్చెను. భిక్షుకులా యభాగినీదత్త భిక్షాసంగ్రహణార్థము ముందునకు వచ్చెను; ప్రమాదవశమున నధుని పాదమున కామె పాదము తగిలెను. తత్క్షణమ యా సాధ్వి యాతని పాదములను కన్నుల నద్దుకొని, తరువాత భిక్షాగ్రహణ మొనరించెను.

"ఓ భిక్షుక దంపతులారా! మీ పవిత్ర జీవనము లోకమున కాదర్శమగునుగాక! మీబోటి యాత్మధర్మనిరతులు లేకుండిన నీ ప్రళయకాలమున భూతలము విచ్ఛిన్నము కాకుండునా? పవిత్ర ప్రేమానుబంధులగు మీ సందర్శనమున నేను బవిత్రురాల నైతిని!" అని గంగ యనుకొనియెను.

## ౧౭

### మో హ న వే ష ము

వేంకటాచార్యులు గౌడబ్రాహ్మణుఁడు; చైతన్యమతావలంబి. ప్రేమరాజ్యసంస్థాపకుఁడగు గౌరాంగదేవుని పవిత్రనామోచ్చారణఁ జేయుచు నపవిత్రకార్య తత్పరుఁడగు నాయాచార్యుని వర్తనము సమాజమునకు సహ్యమై, యాదర్శప్రాయముగా నుండెను. సుమవనమునఁ గాలనాగ

మువలె నాతని మందహాస విలసిత వదనమునఁ గఠోరభావ మదృశ్యమై యణఁగి యుండెను. తాంబూల రేఖోదంచితములైన యాతని పెదవులు ప్రవాళంబులై, యసితదంతశ్రేణి కొకవింత సోయగముఁ గల్పించుచుండెను. రోలంబ సదృశ శ్మశ్రురాజిమధ్యమున దరస్మిత కాంతియు, భయంకరకటాక్షకాంతియు సమ్మిళితము లగుచుండెను. శిరోన్యస్త కేశబంధమున మల్లికా సుమగుచ్ఛము తావులు వెదజల్లుచుండెను. సనాతన సభ్యత్వ నిరూపణములగు జలతారు కండువాయును, దంతపు చేతికఱ్ఱయుఁ, గిల్టుచెప్పులును నాతని సౌందర్యవేషమున గౌరవము దిద్దుచుండెను.

సంధ్యాంధకార మావరించినతోడనే యీగ విలాసపురుషుఁడు కాంతమ్మ యింటఁ బ్రవేశించెను

ఆతనిం గాంచిన యంతనే ముసలిది యానందపారవశ్యమున వృశ్చికాఘాతము మాటయే మఱచిపోయెను.

“ఆచార్లుగారా! ఇవాళ చూడవేడుగ్గా ఉన్నారు!” అని యామె బోసినోట పళ్లు నములుచు నాతని యపూర్వసౌందర్యవిభవమును బ్రస్తుతించెను.

“ఇదంతా మీ దయ” అని యాతఁడు మంచముపైఁ గూర్చుండి, “అమ్మా! నా చక్కదనం ఇప్పుడేం జూశారు; నేను నాటకంలో స్త్రీవేషం వేశేవాణ్ణి. రంగస్థలం మీద ప్రవేశించగానే నాటకం చూసేందుకు వచ్చిన ప్రతీ ఆడది నన్ను చూడడంతోనే నాటకం అయిపోయేది! నా మీద కంటేలు కానుకలు కురిపించని ఆడదే లేదు. అన్నిటికంటే ఉత్తరాలు, ఆ రోజుల్లో పెద్దింటి ఆడవాళ్ళు నాకు రాసిన ఉత్తరాలన్నీ కలిపి అచ్చువేస్తే భారతం కంటె పెద్దగ్రంథం అవుతుంది. అంత చక్కగా ఉండేవాణ్ణి; వేషం నాకలా అమిరేది!” అనియెను.

గంగ యీ యప్రస్తుతసంభాషణ నాలించుచు వంటయింటి

కుందేలు వలె వడవలో బంధితురాలాయెను.

ఆచార్యులు నా టిదానికి సంగణము వైపుఁ జూడ్కులు సారించుచుఁ, దన యప్రతిమానసౌందర్యసంపదఁ బ్రస్తుతించుకొనుచు, స్వర్ణాంగుళీయకముల కాంతిప్రసరింప నభినయించుచుఁ, గాంతమ్మతో భాషించుచుండెను.

"అన్నట్టు! చెప్పడం మరిచిపోయాను. ఇవాళ నాకు తేలుకుట్టింది; అబ్బా, యమబాధ పడిపోయాను!" అని కాంతమ్మ యాతనితో ననియెను.

"అన్నీ మీకే వస్తాయి. కిందటికి ఒక సామంతుని భార్యకు తేలు కుట్టింది. నాపేరు లోకవిఖ్యాతమే కదూ? నన్ను పిలిపించారు. ఆమె చెయ్యి పట్టుకున్నానో లేదో నొప్పి చటుక్కున కట్టింది. నేను మంత్ర వైద్యంలో కూడా గట్టివాణ్ణి. ఎంత విద్యా లేకపోతే నాపేరు దిగదిగంతాలికి వినిపిస్తుందీ?—ఇప్పుడేమేగా నొప్పి ఉందా; ఒక్క మంత్రం వేశానంటే చేత్తో తీసినట్టు నొప్పి మాయం ఐపోతుంది."

"మీ దయవల్ల నొప్పి తగ్గింది. మీరు ఇంట్లో కాలు పెట్టారో లేదో నొప్పి మాట మరిచిపోయాను. ఇదంతా మీ మంత్రబలమే అనుకుంటాను."

"నేను రోగాలకి ఎముడులాటివాణ్ణి. నేను నిలుచున్నచోట రోగంకే రోగం వచ్చి చచ్చిపోతుంది." అని యాచార్యులు తన వాక్చమత్కృతికి నవ్వుకొనియెను.

"నిజమే కాని, మా గంగ రోగం మాత్రం కుదుర్చలేక పోయారు!" అని కాంతమ్మ హాస్యపూర్వకముగా ననియెను.

గంగా నామశ్రవణమున నాచార్యుని నిలువెల్ల జల్లుమనియెను.

"ఆ రోగం కుదిర్చేదుంకే ఈ మోహన వేషం వేశాను." అని మెల్లగాఁ బలికి యాతఁడు వదంపడి,

“ఏమీ పిల్ల నడవలో ఎందుకున్నాది? మంచు పడుతుంది; లోపలికి పిలవండి,” అనియెను.

“గంగా! ఇల్లా రా, అమ్మా! ఆచార్లుగారు మనికి కొత్తవాళ్ళు కారు; మనం అంటే ఎంతో దయ. లోపలికి రా, అమ్మా!” అని కాంతమ్మ వాత్సల్యముప్పొంగునట్లు పిలచెను.

ఆ మోహినీ రూపమును కన్నులారఁ జూడవలయునని యాచార్యమహాశయుఁడు సహస్రాక్షుఁడై విలోకించుచుండెను. అతని హృదయమున నున్మత్తభావపరంపర వెల్లివిరియుచుండెను; మధుపానమత్తుని వలె నాతఁడు మైమఱచుచుండెను.

గంగ యా హృదయవిదారణకరంబగు కథోపకథన మాలించుచు రసాతలమునఁ గ్రుంకిపోవుచున్నట్లు దలంచెను. కావిరి-చీఁకటిలో నా యబలాహృదయము చూర్ణవిచూర్ణమై పోవుచున్నటు లుండెను. శత కోటిమేదినీఖండము లామె మస్తకము నణచివేయుచున్నట్లు లామె కు స్ఫురించెను. మాతృదేవి యాహ్వాన మామె శ్రుతిగోచరము కాలేదు. ఆ యంధకార బంధురాంగణప్రదేశమునఁ గరాళమృత్యుముఖ బిలం బామెకు దృగ్గోచరమగుచుండెను. ప్రచండ వాతాహతప్రసూన వల్లికవలె నా యనాథ బాలిక ప్రకంపితగాత్ర యయ్యెను.

కన్నుఁ గన్నుఁ గానఁబడని యా కటికి-చీఁకటిలో నా యువతీ నవమృణాల సదృశ బాహువును అవ్యక్తవజ్రహస్త మొకటి యాకర్షించెను.

## ౧౮

### ప్రణయక్రయము

"అయ్యా! నీకు నాతోఁ బని యేమియున్నది? నన్నంటకుమఁ." అని గంగ చకితయై యాచార్యునితో ననియెను.

"నీ కోసానికి బంగారం గాజులు చేయిస్తున్నాను. కాసులపేరు మొన్ననే కంసాలి వరహాలు తెచ్చి ఇచ్చాడు."

"నీ యాదరమునకు ధిక్కారము; నీ స్నేహమునకు ధిక్కారము! సంసార స్త్రీలతోఁడ నాయీయసభ్యభాషణములు? నే ననాథబాలిక నని నీ వెంత బలవంతుఁడ వైతివి? నాయింట నన్నుఁ బరిభవించుటకు నీ కెంత సాహసమున్నది!"

"మీ అమ్మ నీతో చెప్పలేదా? నీ చిరునవ్వు కోసానికి నా ప్రాణం కృశించిపోతూఉంది. నాకంటికి కునుకురాదు. నువ్విలా మాట్లాడితే నా ఆశలు అడుగంటిపోవా?"

"మహాగ్ని మధ్యమున హస్తక్షేపమూహింతువా? నిజహస్తములతో హాలాహలమును గ్రోల నెంచెదవా? కాతరస్త్రీ హృదయమున విష సాయకమును బ్రయోగింప నుద్యమింతువా? కఠినశిలాఖండములైనను నా దీనావస్థకు ద్రవీభూతములగును. నీ రాతి గుండె వజ్రముకంటెఁ గఠినతర మెట్లయ్యెను? నీవు మానవుఁడవు కావా? మానవహృదయమార్దవము నీ యందంతరించెనా? నీవు వివాహితుఁడవు కావా? నీ చరణదాసి, నీ సహధర్మచారిణి, నీ భార్య, నీ యీదురంతవర్తన మెఱింగిన నెంత దుఃఖించును? నీ వాసాధ్వీసమక్షమునఁ దలయెత్తి మెలఁగఁ గలవా? ఒక యబలా కన్యాత్వవిభ్రంశ మెంచితివే కాని, యాయకార్య దారుణపరిణామము నూహింపవైతివి! అయ్యా! సత్వరముగా నీవీస్థల

త్యాగ మొనరింపుము."

"ఈ ఉపన్యాసాల కేమిలే; బాగా ఆలోచించుకో. నామాటవింటే కనకవర్షం కురిపిస్తాను నీమీద నీయింట్లో బంగారంపండిస్తాను. నిన్ను తలమీద పెట్టుకుంటాను!"

"అయ్యా! నీ కక్క సెల్లెండ్రులేరా? మాతృగర్భమున నీ వుద్భవింప లేదా? మానవుఁడవు; రాక్షసుఁడ వెట్లయితివి? పాపభీతి లేని, నీజన్మము నిష్ప్రయోజనమని నీ వింకెన్నఁడు గ్రహించెదవు?—అనాథల రక్షణభారమంతయు నీ తలపైనున్నట్లు భావించుచున్నావు కాబోలు! నీ ధన మెవరికిఁ గావలయును? నీ సమాదరణ బహుమానము లెవ రికిఁ గావలయును?"

"నిన్ను నే నేం చేసినా నీతల్లి పల్లెత్తుమాటాడదు—తెలిసిందా? నేను నా చిన్నతనంలో మల్లయుద్ధాల్లో ఆరితేరిన వాణ్ణి!—బాగా ఆలోచించుకో."

"నీ యాడంబర వాక్యములకు జడియు వారిం దెవ్వరును లేరు. నీవు బాహుబలాధిక్యుఁడవగు మగవాఁడవే యగుదువుగాక! నేనబలను! అబలాశాపము దారుణాఖండల శస్త్రఘాతమువలె నీతల వేయి వ్రక్కలు గావించును. లోకమెవ్వాని నిష్ఠురాచరణమునఁ బరిపీడితమయ్యెనో, కరాళమృత్యు వెవ్వాని యిచ్ఛాధృతంబై యుండెనో, త్రిలోకకంటకుఁడని యెవ్వాని బిరుదాక్షరోచ్చారణమునఁ బరిధ్వనించుచుండెనో, యాదశకంఠుఁడే యబలాశాపమునకు వెఱచియుండెను; అశోకవనమున సీతాసాధ్వినిఁ గన్నెత్తి యాతఁడు చూడఁజాలక పోయెను. సామాన్యమానవుఁడవు నీవననెంత? స్త్రీ శాపము నిన్నే కాదు, నీవంశావళినిఁగూడ భస్మీపటలముఁ జేయును? వృథాదంభ ప్రలాపములు మాని వచ్చిన మార్గమున నడచిపొమ్ము."

"కలికాలంలో శాపా లేమిటి? నువ్వు సీతామ్మవారంత దాని

వా? నీ కెవరు నేర్పారు, ఈ పిచ్చిమాటలు? ఎందు కలా ఎగిరి పడతావు?—ఓహో, తెలిసింది! డబ్బు యిస్తాన్ని చెప్పి తీరా మోసం చేస్తాన్ని అనుకుంటున్నా వేమో! ఇదుగో, ఈ యాభై రూపాయలనోటు పుచ్చుకో. నే నంత లేనివాణ్ణి అనుకున్నావా?" అని యామోహాంధుఁడు జేబులోనుంచి నోటు దీసి యామె కందిచ్చెను.

గంగ యా నోటుఁ గైకొని సహస్రఖండములుగాఁ జించివైచెను. "నీ యైశ్వర్యమున నా పదాఘాతము!" అని యామె విద్యుల్లతవలె వీధియింటిలోనికిఁ బరుగెత్తి, తలుపు తెఱచి, నిమిషమాత్రమున శారదా గృహమునఁ బ్రవేశించెను.

నులకమంచముపైఁ గునికిపాట్లు పడుచున్న కాంతమ్మ త్రుళ్ళిపడి లేచెను. ఆచార్యుఁడు విఫలీకృత మనోరథుఁడై కాంతమ్మతో నేమియో చెప్పి వెడలిపోయెను.

## ౧౯

### అ భ య వా ణి

"అమ్మా! అమ్మా! నా ఘూర్ణితమస్తకము నొక్కసారి నీయమృతహస్తములతో స్పృశింపుము. అమ్మా! నా నిలువెల్ల వివశమగుచున్నది!" అని గంగ శారద కౌఁగిటలో మూర్ఛాధీనయయ్యెను.

ఆ యువతీ ఫాలభాగమున ఘర్మాంబుపూరము ప్రవహించుచుండెను; పాటలాధరము చలించుచుండెను; నేత్రములు నిమీలితములై యశ్రుధారాసిక్తములై యుండెను.

"తల్లీ! జగదేకసుందరీ! గంగా! ఏమయ్యెనమ్మా! శిరీషసుమకోమలంబగు నీ హృదయమును దహింపఁజేయు మహాగ్ని యెట్టిది? నిన్నె

వారేమనిరి? నీ ముఖావలోకమున రాక్షసులుగూడ రక్తకలుషిత వ్యాపారమును బరిత్యజింతురు; కరుణాప్రవసన్ను లయ్యెదరు!—

"తల్లీ! శాంతింపుము. అనాథవగు నిన్నుఁ దిరస్కరించి, యేపాపాత్ముఁడు నరకద్వారోద్ఘాటన మొనరించెను? లోకోత్తరమగు నీ దివ్య సౌందర్యరేఖఁ దిలకించి యే యున్మత్తుఁడు కన్నులలో నిప్పులుపోసి కొనియెను?

"అమ్మా! సౌందర్యసాగరమునఁ బాణప్రవహ్లాదినివి; విషాదిని వెట్లయితివి? జీవనముక్తి రహస్యము, స్వర్గవిజయ ఘోషణ, భూలోకమునఁ బ్రకటింప నరుదెంచిన దేవకన్యకవు; నీ వెట్లు పరాజయ మొందితివి? ఆనంద వీణామహాతానమునఁ బ్రగాఢశోకరవ మెట్లు విశ్రుతమయ్యెను? అమృతయోగమున విషపరిణామమునకు హేతువేమి?

"తల్లీ! గంగా! కన్నులువిచ్చి చూడవేమి? నీ కేమియును భయము లేదు! విపులావనీ క్షేత్రమున నిలచి, ప్రేమనేత్రములతో బ్రహ్మ విధానపుణ్యావతరణమును విలోకించు నిన్నేతుచ్ఛుఁడు, కులాంగారుఁడు, మహాపాపి, కలుషిత భీభత్సవికార చేష్టావిలోలుఁడై స్పృశింప సాహసించెను? సంధ్యాగగనమున సుందరపరిభ్రాంచిత, నీరవశోభాకీర్ణ సాంధ్యతారానదృశవగు నిన్నే నిష్ఠురజీమూత మాచ్ఛాదించెను? ఈ గభీర విషాదమునకుఁ గారణమేమి?" అని శారదాంబ బాలేందు నిభంబగు గంగాఫాలమును జెఱఁగుతో విసరుచుఁ బలికెను.

కాలప్రవాహమున సుడిగుండమునఁ బడినట్లు గంగఘూర్ణిల్లుచునే యుండెను. ఆమెకు జగద్భవనము మహాంధకారమున విలీనమైనట్లుండెను.

"అమ్మా! నేనింక బ్రతికియే యున్నానా? ఇదిస్వర్గమా? నరకమా?" యని యామె మంద్రస్వరమున ననియెను.

"గంగా! నేను జీవించియుండఁగనే నీవు నరకయాతన ననుభవించు

చుంటివా? అట్టులైన భగవంతుఁడు లేఁడనియే చెప్పవలయును. తల్లీ! హృదయావేగ ముపశమించు కొనుము. మానవుని దురంతహ స్త మిాస్థలమున విఖండితమైనది. ర క్తపానవిలోలునకీ మందిరము దు ర్నిరీక్ష్యము. అథ మపవిత్రదాత, లోకేశ్వరుని దివ్యాలయమున నీవు భయ పడుచుంటివేల? నీవంటి దీననారీరత్న దుఃఖమోచనుఁడు కాకుండిన నా త్రత్రాణపతాకభగవంతుని హ స్తములనుండి జారిపడదా? నీ కన్నీరు దుడుచుట కీశ్వరుని శ్రీహ స్తమువహర్షాత్సుక్య బంధురము కాకుండునేని ఆతనికి స్వర్గమునఁ గిరీటధారణ కధికారము లేదు. అనాథననాథుఁడు జగదీశ్వరుఁడు నిన్నుఁ బరిత్యజింపఁడు. ఆతని యమోఘసహాయమున నీ విప్పు డీమందిరమునఁ బ్రవేశింపఁ గలిగితివి. తల్లీ! ఏడువకుము! సం క్షుభితసాగర గర్భమువలె నీ హృదయము కొట్టుకొను చున్నది. నీ యుష్ణోశ్వాస సంస్పర్శనమున బాష్పప్రవాహము లింకి పోవుచున్నవి. నీహృదయమునఁ గాలాగ్నిరవులు కొలిపిన నిష్ఠుర కర్ముఁడెవఁడు?" అని శారద యా దీనురాలి శిరమును ముద్దాడుచుఁ, జేలాంచలమున విసరుచు, మృదులభుజప్రదేశమును సానురాగమునఁ దట్టుచుఁ బలికెను.

గంగయించుక సేదదేరి, కన్నులు విచ్చి, శారదాంబను దృష్టించి, "అమ్మా! నా మృతజీవనమున నమృతము వర్షించుచున్నావు. తల్లీ, నీ వమృతమయివి; దీనహీనజనతారిణివి; మంగళకారిణివి. నీ యా శ్రయమునఁ గ్లేశకలుషచ్ఛాయ పడనేరదు. భగవంతుని కల్యాణమూ ర్తి నీ యందు నాకు దృగ్గోచరమగుచున్నది. ఈశ్వరుని కరుణారసరం జితప్రేమ వాణి నీముఖమున విశ్రుత మగుచున్నది. మాతృహృదయ మున విలు ప్తమై, తల్లీ!—నీయొడిలో మాతృవాత్సల్యమాధుర్య మనుభ వించుచున్నాను!" అని యానాయాసభరమున నొకించుక యాగి, ధైర్య మవలంబించి, యిట్లనియెను.

"అమ్మా! నా దుఃఖగాధ నేనేమని చెప్పఁగలను? నేఁడొక యాత తాయి నా కన్యాత్వ విభ్రంశ మూహించి నన్నుఁ దూలనాడెను!"

శారదచకితయై, "శ్రీహరీ!" యని చెవులుమూసికొనియెను.

"అమ్మా! వాఁడెవఁడు? గుర్తింపఁ గలిగితివా?"

"వైద్యుఁడు, వేంకటాచార్యులు."

"మీతల్లి యింటలేదా?"

"ఉన్నది"

"ఆమె యేమియు ననలేదా? ఎట్లు సైచెను?"

"ఏమియు జరుగనట్లు మంచముపైఁ గునుకుచుండెను."

"నీ వెట్లు తప్పించుకొంటివి?"

గంగ యా మోహపరవశుని వృత్తాంత మంతయు నామె కెఱింగించెను.

శారద యాహృత్స్ఫుట భేదనదురంత వృత్తాంతశ్రవణమున సాంజనాశ్రునేత్రియై బిట్టునిట్టూర్పుఁ బుచ్చి,

"అమ్మా! నీవిప్పుడింటికి బోవలదు. నాప్రక్కనే పండుకొనుము." అనియెను.

## ౨౦

### కిశోరీ హృదయము

యశోదమ్మ భద్రాచలమునుండి మగుడివచ్చెను. రాత్రిం బగళ్లామె యా పుణ్యతీర్థమహిమలనే కొనియాడుచుండును. శ్రీరామచరణసాన్నిధ్య శాశ్వత నివాసమామె యభిలషించు చుండెను.

రఘురామమూర్తి మాతృదేవీ పాదధూళి శిరమున నిడుకొని,

"అమ్మా! నా కొక మనవి యున్నది." అనియెను.

కుమారునిఁ దన ప్రక్కనొక పీటపైఁ గూర్చుండఁ గోరి యామె, "నాయనా! నీ ఇష్టానికి అడ్డు చెప్తానా? అనియెను.

"మా మామగారు నా కొక లేఖ వ్రాసియున్నారు. వేసంగిసెలవులు గనుక పిలకునేనిఁ గొన్ని దినములు వారి యింట వద్దఁ గడప వలయునని యనురాగపూర్వకముగా లేఖాముఖమున వారు విశదీకరించిరి. నీ వాశీర్వదించి పంపుదువేని, వారి యభినుతాను సారముగాఁ గొన్ని దినము లచట గడపి వచ్చెదను." అని రఘురామమూర్తి మాతృదేవినిఁ బ్రార్థించెను.

ఆమె ప్రసన్నురాలై,

"నాయనా! తప్పకుండా వెళ్ళు. మీమామగారుబహుయోగ్యుడు. అతని మనస్సు చిన్నపుచ్చకూడదు," అనియెను.

ఆ మఱునాఁటి మధ్యాహ్నమున రఘురామమూర్తి మాతృదీవన వడసి, ధూమశకటమునఁ గూర్చుండి, రఘునాథపురమునఁ గల తన మామగారి యింటికిఁ బోయెను. అతఁ డాగ్రామమునఁ బ్రవేశించు సరికి సూర్యాస్తమయ మగుచుండెను.

అతఁడింటిలోఁ బ్రవేశించి, చావడిగుమ్మము దగ్గర నిలువఁబడియెను. అంగణ ప్రదేశమున బొమ్మరింటిలోఁ గిశోరీబాలిక యొకతె ముగ్గులు దిద్దుచుండెను. ఆ బాలికా కపోలప్రాంతములు కజ్జలకృష్ణ సూక్ష్మకేశమాలాశోభితములై యుండెను, కుందకుట్మలములవలె దంతపంక్తి సుందరముగా నుండెను. నిర్మలముఖపద్మము మనోహరముగా నుండెను. స్వర్ణమయ చంపకసదృశ నాశికా పార్శ్వద్వయ విస్తృతాపాంగస్పర్శి భ్రూలతాయుగళము, అపాంగవిస్తృత శోభాయమానస్వచ్ఛనీలేందీవరనయనయుగళము, మోహన ప్రదముగా నుండెను. కరచరణప్రాంత భాగములలక్తలిప్తలోహితవర్ణమయములై యుండెను.

శుభ్రధవళ శ్రీయంగము చంద్రికా సదృశమైయుండెను. ఆముద్దరాలి లీలావిభవము నిసర్గరామణీయక మొలుకుచుండెను.

రఘురాముఁ డాశ్రీముఖ సందర్శనమున, నానందలక్ష్మీసౌభాగ్యవిలోకనమున నిశ్చేష్టుఁడై పోయెను.

ప్రక్కగదిలో నాతని యత్తగారు దేవకి విరులసరములు, గట్టుచుండెను. కొంతవడికామె,

"జానకీ? జడవేసుకోవూ?" అని యీవలికి వచ్చెను.

రఘురాముఁ డామె పాదపద్మములను స్పృశించి, కన్నుల నద్దుకొనియెను.

ఆమె యానంద బాష్పసిక్త నేత్రములతో నాతని నాశీర్వదించి, "నాయనా! ఎంతసేవయింది వచ్చావో! పిలిచావుకావేమీ? ఇది నీ ఇల్లు కాదూ? నీకు ఇంత మొగమాటం ఎందుకు?" అనియెను.

"అత్తా! ఇప్పుడే వచ్చితిని." అని రఘురాముఁడు దరస్మితుఁడై తలవాల్చెను.

జానకి ముగ్గుగొట్టమును బారవైచి, వంటయింటిలోనికిఁ బరుగెత్తి పోయెను. ఆ యమాయిక లజ్జాతిరేకమున వివశయై పోవుచుండెను. ఆమె నేత్రము లప్రయత్నముగా నశ్రుపూరమున ధౌతములగుచుండెను. తనులతాంగము మంద మారుతచలిత మల్లికావల్లికవలె లేశమాత్రము కంపించుచుండెను.

వసంతరావు (రఘురాముని మామగారు) ఆ యూరఁ బేరుపొందిన న్యాయవాది. అతని యోగ్యత, పరోపకారదీక్ష, కార్యపరతంత్రత, మధుర ప్రసంగకౌశలము, అతని గౌరవ వర్ధన కారణము లయ్యెను.

రఘురాముఁడు గృహమునఁ బ్రవేశించి నపుడాతఁడింట లేడు; వాహ్యాళి వెడలియుండెను. అతఁడు తిరిగి వచ్చునపుడు మార్గమధ్యమున నాతని లేఖకుఁడెదురై,

"బాబూ! అల్లుడుగారువచ్చి ఉన్నారు," అని విన్నవించెను.

"ఆలాగా!" అని యాతఁడు సత్వరగమనుఁడై యింటి కరుదెంచి, "రఘురామా!" యని పిలచెను.

రఘురామమూర్తి యత్తగారితో నేమేమియో మాటాడుచుండెను. మామగారి పిలుపు వినిపించినంతనే యాతఁడు మహానంద భరితుఁడై యాతని కెదురేగి, వంగి నమస్కరించెను.

వసంతరావు అల్లుని దీవించి వాత్సల్యపూరితాంతః కరణుఁడై, "వస్తానని ఉత్తరమేనా రాశావు కావేమి? మీ అమ్మ క్షేమంగా ఉందా? భద్రాచలంనుంచి ఎప్పుడువచ్చింది?" అని యడిగెను.

రఘురాముఁ డాతని ప్రశ్నపరంపరకు సదుత్తరమొసఁగుచుండెను.

జానకి యంధకారమున నడవయరుపై జలపూరితపాత్రలనమర్చి, యా సమీపమున నొక పీటపైఁ దెల్లని యంగవస్త్రములు రెండు మడత పెట్టియుంచెను.

వంటలక్క జానకిని మాటిమాటికి హాస్యమాడుచు, నికనికనవ్వుచు వంటచేయుచుండెను.

భోజనశాలలో ముక్కాలి పీటపై దీపము నెలకొల్పి, జానకి యా దీపమున కించుక నెడముగా రెండు పీటలు వేసెను. అరటియాకుల మోద విప్పి చిగురుటాకులు రెండు పీటల కభిముఖముగా వేయుచుండెను.

"శ్రీరాముల వారి మీద సీతాదేవికి ఎంత ప్రేమ!" అని వంటలక్క పెద్ద నవ్వు నవ్వెను.

"మా యమ్మతోఁ జెప్పెదనులే." అని యభిమానాశ్రుపూరిత నేత్రయై జానకి యావలి కేగెను.

"రఘురామా! మడికట్టు కుందామా?" యని వసంతరావు వంట యింటి గుమ్మముదగ్గర కేగి,

"కామక్కా! వంట ఐందా" అని వంటలక్క నడిగెను.

"ఐంది, ఇప్పుడా? ఒహార్ఘూము కిందటే ఐపోయింది. అల్లుడుగారొచ్చారు. ఇంక వేళ తెలుస్తుందా?" అని వంటలక్క మునలినక్క వలె వినయ మభినయించుచుఁ బలికెను.

"నాన్నా! అరుగుమీద నీళ్ళచెంబు లున్నాయి!" అని జానకి కోకిల స్వరమునఁ బలికెను.

వసంతరావు జామాతానహితుఁడై పాదప్రక్షాళనక్రియఁ గావించి, భోజనమునకుఁ గూర్చుండెను. పొన్నకాయ వంటి నున్నని తలపై జారిపోవు మునుగును జిలుగ కొయ్యలవలె నున్న చెవులకుఁ దగిలించుకొనుచు, కామక్క వడ్డించుచుండెను.

దేవకి జానకీసహితయై రఘురామమూర్తి నిమిత్తమొక మంచము వేసి, శయ్యరచించెను. తరువాత నామె పుత్రికాసహాయమున, మంగళప్రదముగా వెలుఁగుచుండిన దీపముదగ్గర కూర్చుండి, లక్ష్మీప్రసన్నములైన లేఁత తములపాకుల చిలుకలు చుట్టుచుండెను.

భోజనానంతరము మామయు నల్లుఁడును ఉచితాసనము లలంకరించి తాంబూలము సేవించుచుండిరి.

జానకి మాతృదేవితో భోజనశాల కరిగెను.

## ౨౧

### ప్రేమరాణియెవరు?

బాలసూర్యుని కనకకిరణములు గవాక్షమార్గమున రఘురాముని తరుణమూర్ధమునఁ బడి నిద్రాముద్రితములైన యాతని విశాలనేత్రములను స్పృశించుచుండెను. ప్రాభాతమారుతస్పర్శనమున దోమతెర

చలించుచుండెను. రఘురాముఁడు మేలుకొని యున్నను నిమీలితా క్షుఁడై యట్లే పండుకొని యుండెను.

పాశ్చాత్యవాఙ్మయమున వర్ణితమైన "ఇనోసీ" దుఃఖగాథ నాతఁ డిప్పుడు స్మరించుచుండెనా? అపరక్రీస్తు ప్రభువు, ఆర్థర్‌ను గూర్చి యోజించుచుండెనా? ఇలేఇన్ మరణ వృత్తాంతమును' దలంచుచుం డెనా? పాశ్చాత్య నారీరూప మాతని హృత్పథమునఁ నా సమయము న విస్మృతమై పోయెను.

ఆదికవి వాల్మీకి విరచించిన రామాయణ ప్రపంచము నాతఁడు కేవలము ముగ్ధుఁడై విలోకించుచుండెను. ఆదిలక్ష్మి సీతాదేవి: ఆది నారాయణుఁడు శ్రీరామచంద్రుఁడు; భూలోకవైకుంఠము అయోధ్యా నగరము! ఆ సనాతన దంపతుల ప్రేమగాథ జగజ్జేగీయమానముగా గానముఁ జేసిన కవి సార్వభౌముని జన్మవాసన లోకలోకాంతరముల దుర్లభము. పుణ్యాయజ్ఞావనీ ప్రసూత, రామమయజీవిత, రఘువంశ పావని, ప్రియవాదిని, మితభాషిణి, మహాతపస్విని, జానకీ పుణ్యచరి త్రము నాతఁడు సాత్త్వికానందయోగ మనుభవింపుచు నేకాంత హృదయమున స్మరించుచుండెను. భావనాతీతమైన యా సుపవిత్రేతి హాసమును మర్త్యామర్త్యలోకములఁ బ్రచురించిన కవి శిరోమణి, వాల్మీకి మహర్షికి వందనముఁ గావించి, రఘురాముఁ డీ క్రింది గీత మును మధురముగాఁ బాడుకొనియెను;

"క్రౌంచమిథునము సుఖప్రపంచమునఁ
బ్రణయామృతముఁ గ్రోలు స్వర్ణకాలమున
కాలాంతకాకార కఠినాత్మకుండు,
క్రూరనిషాదుఁడు కూల్చె బాణమున!—
విషసాయకాఘాత వివశాత్మలగుచు,
విలపించి దివికేగు ప్రియవధూవరులఁ

గాంచి యేహృదయంబు కన్నీరు గార్చె,
నా మహాత్మకుఁ బూజలర్పింతు నెడఁద!
సౌందర్యప్రతిభలో శాశ్వతానంద
మమరించి, ప్రేమరాజ్యము నేలె నెవఁడు?
బాష్పస్రవంతిలో భవ్యానురాగ
కౌముదీ కాంతులు గల్పించె నెవఁడు?
మహనీయ లేఖనీ మంత్రదండమున,
నిహలోకమును స్వర్గ మెవఁ డొనరించె?
విమలాత్మ గాత్మక ప్రేమ మంత్రములు,
హృదయంబునకుఁ బేర్మి నెవఁడు బోధించె
ప్రేమమోహంబుల భేదతత్త్వమున,
స్వర్గంబు నరకంబు చాటించె నెవఁడు?
ఫలజలాహారియై పర్ణగేహమున,
భువనమోహనగానమును జేసె నెవఁడు?
ఆ మునిచంద్రున కాయాదికవికి,
ననవరతముఁ బూజ లర్పింతు నెడఁద!
కవిసార్వభౌమ, యో కమనీయకామ,
రామలీలాసుధారస మెంతవఱకు,
హృదయక్షేత్రంబున నింక దందాక,
నిష్కళంకంబునై నీ కీర్తి గరిమ,
శుక్రతారాశుభ్రశోభానుభూతిఁ
దలపించి వెలయు నిస్తంద్రమై జగతి!
భక్తియో, రక్తియో, పారవశ్యంబో,
యంగీకరింపు నా యాత్మ శుశ్రూష!-”

అభ్యాసవశమున జానకి యాతఁడు శయనించియున్న గృహమునఁ బ్రవేశించెను.

రఘురాముఁడు కన్నులు విప్పి యా కల్యాణరూపమును విలోకించి, లేచి, పర్యంకమునఁ గూర్చుండెను.

జానకి లజ్జాప్రకంపితగాత్రియై యావలి కరుదెంచి,

"అమ్మా! అధ్యాత్మరామాయణకీర్తనల పుస్తకమును దీసితివా;" యని దేవకి నడిగెను.

"మీ నాన్నగారి గదిలో ఉంది." అని దేవకి తొందరగా బదులు చెప్పి గృహకృత్యముల నిమగ్నురాలాయెను.

రఘురాముని హృత్ఫలకమునఁ జిత్రితమైన హాసమయి గంగా రూపమునఁ గ్లేశచ్ఛాయపడుచుండెను. ఆ యనాథయువతి తన హృదయరంగమున విరుల వానగురియించినది; మధుమయప్రేమగానముఁ గావించినది. త్రిసంధ్యల నాతఁడా మాధురీ విగ్రహమును నేకాంతమనస్కుఁడై పూజించుచుండెను. ఆ యువతీ సంస్మరణమున నాతని కొకానొక యవ్యక్త సుఖానుభవముద్యోతక మగుచుండెను. ఆగంగా పవిత్రమూర్తిని ఆదిభిక్షువు శంకరునివలె శిరోవతంసముగాఁబడయుటకే విధాత తన్ను సృజించెనని యాతఁడు భావించెను; గాని సృష్టిరచనా కౌశలము నాతఁడు క్రమముగా నన్వయింపఁ జాలక పోయెను. ఆతని హృత్ఫలకమున గంగామనోహర రూపము ఛాయావృతమగుచుండెను. ఆ స్వార్థస్నేహమయి జానకి యాతని హృదంతరాళమునఁ బ్రేమ దీపమును వెలిగించెను. కరుణరసము ప్రణయప్రవాహమున విలీనమగుచుండెను. ప్రేమసింహాసన సోపానమున గంగ ప్రకంపితయై నిలువఁ బడియెను; సింహాసనమున జానకి భాగ్యలక్ష్మి వలె విరాజమానమగుచుండెను.

రఘురాముఁడామహాపరివర్తనమును మనోనేత్రమునఁ గాంచుచు నిశ్చల యోగసమాధిలో నిమగ్నుఁడాయెను.

## ౨౨

### మాతృప్రేమ

శారద యస్వస్థురాలై యుండెను. మనోవిచారమున నామె లోలోనఁ గృశించిపోవుచుండెను. ఆమె కీలోకమున సుఖ మేమియున్నది! దేవ తాప్రీతికరముగ నా యబల పూజావిధానము లెన్నియో యాచరించి నది. తన యేకాంత జీవనమునఁ బాపచ్ఛాయ పడకుండునటులు పవి త్రమార్గమున వర్తించినది. అస్వార్థప్రేమ జీవనవ్రతమును బాలించి నది. ఇహమున స్వర్గసుఖానుభవ మూహించినది. కాని ప్రాణేశ్వరుని కృపాకటాక్ష మామెకు దుర్లభమై పోయెను.

కొన్ని దినములనుండి యామె గంగతో మృత్యునందేశ తత్త్వ మును గూర్చి ముచ్చటింపఁ గడంగెను.

"అమ్మా! అమంగళకరమగు నీ సంభాషణ మెందులకు? జీవన సుఖములను గుఱించి ప్రస్తావింపరాదా?" యని గంగ యామెతో ననియెను.

"గంగా! నీవు చిన్నదానవు; నే నేండ్లు గడచిన దానను. నీవు సుఖసముద్రమున నానందప్రభవు; నేను దుఃఖార్ణవమునఁ దామసిచ్ఛా యను. నీవు ప్రత్యూషప్రవుల్లనళినివి; నేను భూతలపతిత, మకరంద విహీన, సౌరభసౌందర్య రహితమల్లికను. నీ వానందమయివి; నేను దుఃఖినిని. నీవు జీవన సుఖప్రమోదినివి; నేను జీవన వ్రతోద్యాపన విధాన తత్పరను. తల్లీ! నీవు జీవింప నాశింతువు; నేను మరణింపఁ గోరుదును.

"అనంత మార్గమున నేను జాలదూరము నడచి పోయితిని. దుః ఖాశ్రుసిక్తమైన నా జీవనపథము నా కెంతయు విసుగుఁ గొలుపు

చున్నది. నీ కోమలహృదయమున నాశాలత పల్లవితమై యున్నది; నా విశీర్ణహృదయమున నెట్టి యాశయును లేదు. హతాశజీవనధారణ నిష్ప్రయోజనము. గంగా! నా హృదయానంద సంహరణ సమయము ననే నేను సంహరింపఁ బడితిని. నా బ్రతుకు నాకే బరువై పోయినది. నా నిర్యాణమునకు దుఃఖించు వారెవ్వరును లేరు. గంగా! ఇంక ప్రాణధారణ వలన నేమి ప్రయోజన మున్నది?" అని శారద కన్నీ రొత్తుకొనుచు గద్గదస్వరమునఁ బలికెను.

"అమ్మా! నా క్షుద్రహృదయమున నాశాదేవివలె వెలుగుచున్న నీవు మరణింతు వేని నే నెట్లు జీవింపఁగలను? తల్లి యుండియుఁ దల్లి లేనిదానను; దిక్కులేనిదానను. నన్ను సుశీతలపరిష్వంగమున నల రించుదానవు; భయంకరకాలాగ్నిలోఁ ద్రోయుదువా? నీవు లేకుండిన నా కన్నీరు దుడుచు వారెవరు? అమ్మా! మృత్యుసంవాదము నే వినఁ జాలను!"

"బాలికా! నా యవలంబనమున నీకు సన్మార్గముదృగ్గోచరమైనది. నా సాంగత్యమున నీవు స్వర్గనరక ప్రభేదము నెఱింగితివి. సమాజ సూత్రమున బంధింపఁబడినను, స్వేచ్ఛావిహారమున కధికారిణివి. నీ యధికారమును నీవు స్వర్గరాజ్యానుభోగమునకై వినియోగింతువో, లేక నరకప్రపంచప్రవేశమునకై పాలింతువో, నీ యాత్మనిశ్చయమున నాధారపడి యున్నది. అబలా! ఇహలోకసుఖములు క్షణభంగుర ములు; నేనా సుఖసమార్జనకార్యమున విఫలీకృతమనోరథురాల నైతిని. శాశ్వత సుఖభోగ మాకాంక్షారహితము; అది ప్రశాంతభావపూర్ణము. జీవనద్వారమున నీ పూర్వపుణ్యావశమున నీ వీ నిగూఢరహస్యము నెఱింగితివి. ఆచార్యుని పాపవాణి నిన్ను నరకమున కాహ్వానించెను. ఆ విషపూరిత మధురామంత్రణము నీకుఁ గర్ణకఠోరమై నీ హృదయ మును బ్రకంపిత మొనరించినది. నీకు పాపభీతి కలదు. పాపభీతియే

ధైర్యకవచము. గంగా! నీ హృదయమునఁ బాపభీతి చిరస్థాయి యగును గాక! పాపభీతి లేని హృదయము పరమేశ్వరుని కరుణార్ద్రకు సంసిక్తము కానేరదు. నిన్నుఁ బరమేశ్వరుఁడు రక్షించును గాక!"

"అమ్మా! నీ యమృత వాక్పూరము నా హృదయమున దివ్య భావాంకురములను బోషించుచున్నది. నీ సాంగత్య లాభము నా కీశ్వరదత్తమైనది. నీ ప్రబోధవాణి నా శ్రుతిగోచరము కాకుండిన నేను పతితనారీశ్రేణికిఁ జెందినదాననై యుండుదును. అంధకారావృతమైన నా జీవనపథమును జ్యోతిర్మయ మొనరించితివి. తల్లీ! నీ యకృత్రిమ స్నేహ బహుమానమునకు నేను జిరకృతజ్ఞురాలను!"

"గంగా! నిన్ను నే నొకమాట అడుగ నెంచితిని; నీవు సదుత్తర మొసఁగవలయును."

"అమ్మా! నన్నేటికి పరీక్షించెదవు? నీకుఁ దెలియని విషయము లేమి కలవు?"

"అట్టి విషయ మొకటి యున్నది—దయామయుఁడగు పరమేశ్వరుఁడు ప్రాణిశ్రేణీ రక్షణ వర్ధన సాధనార్థము స్త్రీ హృదయమున కనివార్యమగు నపత్యస్నేహ వాత్సల్యమును గావించి యున్నాఁడు. నేనపత్య విహీనను. ఆ యంతర్నిహిత, నిసర్గదత్తస్నేహవృత్తి నీ లాలనపాలనమునఁ జరితార్థమైనది. నీ యపూర్వశ్రీమండితరూపలావణ్య సందర్శమున నా హృదయనిహితనమ స్తస్నేహము, నమస్తప్రేమ, తొలఁకాడుచుండును. తల్లీ! నీవు నా యొడిలోఁ బసిపిల్లవలెఁ దోఁచుచుందువు. నీ సువర్ణ ప్రతిమారూపమును మేలుకువతో నున్న యపుడు స్మరించుచు, నిద్రావస్థలో స్వప్నమునఁ గాంచుచు, మురిసిపోవుచుందును; గాని యిట్టి దట్టిదని చెప్పరాని యొక భయభ్రాంతభావము నా హృదయమును బీడించుచున్నది. ప్రేమతరంగములలోఁ గొట్టుకొనిపోయి నీ వేభయంకరతీరమునఁ బడిపోయెదవో యని నేను

జడియుచున్నాను!’’

‘‘అమ్మా! పాము పడగలో మణివలె శాంతాత్మకప్రేమానుభోగము నాకు దుర్లభమైనది!’’

“నీ జీవనవసంతము ప్రాప్తించినది. వికసితపుష్పముల రామణీయకము, కోకిలలమృదుమధురగానము, నీ హృదయమున స్ఫురింపలేదా? ఆత్మచింతారహితవై నీవు ప్రేమరాజ్యమునఁ గాలుపెట్టితివి!”

“అమ్మా! నా హృదయమేరికిని దత్తము కాలేదు.”

‘‘నీ ప్రేమికహృదయమును నీవు పరీక్షించుకొనుము. అది యన్యాయత్తమై పోయినది.’’

‘‘అమ్మా! నేను వ్యాకులాకులితను. అవ్యక్తచింతాభరమునన్నణచివేయుచున్నది. నాహృదయముసంపూర్ణముగానన్యాక్రాంతము కాలేదు.”

‘‘కూతురా! నీ వెవరిని ప్రేమించుచుంటివి? నీ హృదయ విహంగమేశాఖాద్రుమమున వ్రాలనెంచి శూన్యపథమున నెగురుచున్నది?’’

‘‘అమ్మా! నేను భాగ్యవిహీనను. నా యాశ నాలోనే యడుగంటును గాక! అతఁడు వివాహితుఁడు!’’

“తల్లీ! నీ యానందలతను నీవే త్రెంపివేయుచున్నావు. సకలచరాచరకోటికాదికారణమగు సహస్రాక్షి ప్రేమ నీ యందెట్లు దర్శనశక్తిఁ గోల్పోయెను?”

‘‘అమ్మా! నా ప్రేమ హేతువిహీనము. అప్రయత్న పాశోన్మత్తనగు నే నిప్పుడు ప్రయత్నపూర్వకముగా నైనను నవ్వఁజాలకున్నాను!’’

శారద కనుగొలంకుల నీరు గ్రమ్మెను. గంగను ముద్దాడి, వినీల కుంతలములు నిమురుచు నామె,

‘‘తల్లీ! నీ విప్పుడు నిజముగా ననాథవైతివి! నేను బహుళరోగార్తనైతిని! గంగా! దీనత్రాణుఁడు పరమేశ్వరుఁడే నిన్ను రక్షించును గాక!’’ అనియెను.

# ౧

## అల్లుని ప్రశంస

న్యాయస్థానములు, వేసంగి సెలవులగుట మూయఁబడియెను. వసంత రావు జామాతాసహితుఁడై యొక మిత్రుని గృహమున కరిగెను. కతి పయ నిమిషములలోఁ మఱికొందఱు మిత్రులచట సమావేశమైరి.

"పేకదస్తా ఇలావడీ," అని వసంతరావు గృహయజమానునితోఁ ననియెను.

తాంబూలసేవనము తరువాత చీట్లాట ప్రారంభమయ్యెను.

"రఘురామా! నీ కాటవచ్చునా?" యని మామగారడిగిరి.

"రాదు, నే నెన్నఁడును ఆడి యెఱుంగను. ఆటక్రమము నాకుఁ దెలియదు." అని రఘురామమూర్తి వినయవినమితుఁడై పలికెను.

"ముక్కలేనా పోల్చగలరా?" అని యొక యాగంతకుఁడు అప హాస్యపూర్వకముగా నడిగెను.

"ఆ కౌశలముకూడ నాకు లేదు." అని రఘు రాముఁ డనియెను.

"ఈరోజుల్లో చీట్లాట తెలీని విద్యార్థే లేడు." అని యింకొక పెద్ద మనుష్యుఁడు పేకదస్తా కలుపుచుఁ బలికెను.

రఘురామమూర్తి యా యసంగత నిందావాక్య మాలించియు నాలింపనివాని వలెనే యా సమీపమునఁ బడియున్న "కృష్ణాపత్రిక"ను జదువు కొనుచుండెను.

దేవకి జానకిని యొడిలోఁ గూర్చుండబెట్టుకొని మల్లెపూవుల జడ వేసెను; తడి గుడ్డతో ముఖమును దుడిచి, నీటుకాటుక రేఖదిద్ది, బొట్టు పెట్టి, స్వర్ణాభరణభూషితను జేసి, క్రొత్తపరికిణీ కట్టించి, క్రొత్తజాకెట్టు దొడిగించెను. ఆ బాలిక రూపమున నానందమయి; చదువుల సరస్వతీ

యనుగృహీత; గుణమున దేవకన్య. దేవకి యాకల్యాణరూపరా
శిని మనసార ముద్దాడి,

"అమ్మా! చూడకళ్ళులేకుండా ఉన్నావే! దిష్టితగులుతుంది. అందు
కే నీకు నగలు పెట్టను." అనియెను.

ఇరుగుఁబొరుగు అమ్మలక్కలు గృహాంగణమున సమావేశమైరి.
దేవకి వారి నందఱి నాదరపూర్వకముగా నొక తివాసీపైఁ గూర్చుండఁ
జేసి, వివిధసల్లాపముల నవసరసముయమును గడపుచుండెను.

"మీఅల్లుడు వచ్చాడట, దేవకమ్మా! చెప్పివేకావు!" అని యొక
వృద్ధనువాసిని యాశ్చర్యము ముడుతల ముఖమునఁ దొలకాడఁ
బలికెను.

"తగిన అల్లుడు దొరికాడని దేవకమ్మ పొంగి పోతూఉంది. వెనక
టలాగు మాటాడుతుందీ?" అని మఱియొక ముత్తైదువ సహాస్యవదన
యై పలికెను.

"ఎంత చక్కనివాడో! ముత్యంలాంటి అల్లుడు.—పొద్దున వీధి
అరుగుమీద మొగం కడుక్కుంటూ ఉంటే చూశాను."

"కళ్ళు మణిగిపోయాయి!" అని వేఱొకపుణ్యాంగన హర్షపులకితయై
యనెను.

జానకి వంటయింటి ద్వారబంధనమీపమున నొకకృష్ణమార్జాలపుత్రిక
ను బట్టుకొని యవ్యాజముగా దాని కర్ణమర్దనముఁ జేయుచుండెను.
పద్మనమసుందరకోమలహస్తమున మాటి మాటికి దాని లెంపలు
వేయుచుండెను. బహుకాలపూర్వకృతాపరాధాభియోగమున నామా
ర్జాలకన్యశిక్షిత యగుచుండెను. కామక్క పచ్చడి రుబ్బుచున్నపుడు
వంటయింట ననధికార ప్రవేశ మొనరించి యాపిల్లి కూన పాలకుండ
దొరలించియుండెను. అభియోగ మెఱింగించి రెండుదెబ్బలు. రాత్రి
ఫలహారమునకై కామక్క పోలిరొట్టె కాల్చుకొని పొయ్యిదగ్గర

భద్రపఱచియుంచుకొనెను. 'నీవారొట్టెను ముందుగా రుచిచూడనేల!' అని వీపుమీఁద రెండుదెబ్బలు. 'గురువారమున సూర్యారాధనానంతరము పరమాన్న భోగమున భాగమేల చూడ వైతివి?' అని గండద్వయమునఁ బ్రహారద్వయము.

ప్రత్యేకాభియోగమున కాపిల్లికూన 'మ్యావు' మని యుత్తర మొసఁగుచుండెను. ముక్తి మార్గాన్వేషణమున యథాయోగ్యచేష్టాతిరస్కృతయై 'మ్యావు' మని యరచుచుండెను. కౌతుకకోపాకులితప్రేమపూర్ణప్రహారమర్యాదమాధురి యాక్షుద్రపశుహృదయమున కెట్లు సుబోధితమగును?

"ఈ ఏడు ఎప్ఫ్ఏ పరీక్షఇచ్చాడా? ఐతే మీఁదటికి బియ్యే చదువుతాడు." అని యాపుణ్యాంగనా బృందమున నొకవృద్ధనారి యనియెను.

"మామగార్లాగే పట్టాపుచ్చుకుంటాడు. అమ్మా! సహజంగా తెలివైనవాడు, కావలసినంత ధనం ఉంది ఏం కాదవ?" అని మఱియొకతె యనెను.

దేవకి యా సువాసినీసుభాషితము లాలించుచు నానందపరవశురాలగుచుండెను.

"అమ్మా! మీ అందరి ఆశీర్వాదం వల్ల మాకు మంచి అల్లుడు దొరికాడు." అని యామె సానందాశ్రు నేత్రయై పలికెను.

రఘురామమూర్తి మామగారి యనుమతి వడసి గృహమునకు మరలి వచ్చెను. చీట్లాటలోఁగల ఆమోదప్రమోద మాతఁడనుభవింపఁ జాలకపోయెను.

ఆతఁడు గృహమునఁ బ్రవేశించిన తోడనే స్త్రీ మండలి విచ్ఛిన్నమై యెవరియింటికి వారు దారిబట్టిరి.

జానకి వంటయింటి తలుపువెనుక దాగుకొనియెను.

మార్జాలకన్య పుచ్ఛమెత్తి చంగునదాటి పెరటిలో జామిచెట్టుక్రిం

దఁగూర్చుండి, నాలుకతో నోడలెల్ల నాకుకొనెను. తరువాత దేహమును జాడించి, పెంకిజానకి మరల తన్నుఁ బట్టుకొన వచ్చుచున్న దేమో యనునట్లు నాల్గుదిక్కులు కలయఁజూచి, ప్రాంతమునఁ గలమట్టి గోడపై కురికి, యోగనిద్రాముద్రితుఁడగు మునీశ్వరునివలె నిశ్చలయై, ముకుళిత నేత్రములతోఁ గూర్చుండెను.

౨

హారికథ

రఘునాథపురమున రఘునాథస్వామి యాలయము కలదు. పూర్వకాలమున నొక జమీందారుఁడు పుత్రభిక్షగోరి శ్రీరామచరణారవిందములను భజించెనట. సీతాసమేతుఁడై రామచంద్రుఁ డాయాగర్భశ్రీమంతుని స్వప్నరంగమునఁ బ్రత్యక్షమై, "నాపూజావిధాన సౌలభ్యమునకై యొకమఠము నిర్మింపుము; నీ యభీష్టము నెరవేరును." అని యానతిచ్చెనట.

ఆ జమీందారుఁడు స్వప్నవృత్తాంతమును విప్రోత్తముల కెఱింగించి, వారి యభిమతానుసారముగా నాయాలయవినిర్మాణకార్యమునఁ దత్పరుఁడయ్యెను. అచిరకాలములో నాలయమున దేవతాప్రతిష్ఠ జరిగెను. జమీందారుఁడు పుత్రపౌత్రాభివృద్ధి ప్రాప్తివడసి యెనలేని సంపదల నోలలాడెనట.

శిల్పకళావిజ్ఞుల హస్తకౌశల మాదేవాలయమున విద్యమానమగుచుండెను. అది నిర్మించి రెండుమూఁడు శతాబ్దములైనను చెక్కుచెదరలేదు; వినూత్న నిర్మాణమువలెఁ జూపట్టుచుండెను. ప్రాకారభిత్తికలపై రామాయణపుణ్యగాథ చిత్రకారుని సునిపుణతూలికా ప్రచార

మునఁ జిత్రితమైయుండెను ముఖమంటపమున జీవకళారంజితములైన శిలావిగ్రహములు యథాస్థానమునలంకరించియుండెను. ఉత్తరకోణమున గరుడవిగ్రహము గంభీరభావముద్రితమైయుండెను. దక్షిణపార్శ్వమున మర్దళములు రెండు వ్రేలాడగట్టఁబడియుండెను క్షుద్రఘంటికా విలసిత గరుడస్తంభమున కించుక నెడముగాఁ బుష్పితవకుళవృక్షమొకటి సువాసనలు వెద జల్లుచుండెను. గర్భగుడిలో సీతారాముల యొక్క జగన్మోహన విగ్రహములు భక్తులదృష్టి నాకర్షించుచుండెను.

“రఘురామా! ఇవాళకోవిల్లో హరికథా కాలక్షేపమట, వెళదామా?” అని వసంతరావు భోజనసమయమున నల్లుని నడిగెను.

“తప్పక వెళ్ళుదము—అత్తా! మీరు కూడ రావలయును.” అని రఘురామమూర్తి యత్తగారి వైపుదిరిగి సవినయప్రార్థనపూర్వకముగా ననియెను.

“నాయనా! అందరం వెళదాము.” అని దేవకి సానందయై పలికెను.

ఆ కథోపకథన శ్రవణమున జానకీ కోమల కపోలములు లజ్జారుణితము లగుచుండెను.

దేవాలయ ప్రాంగణమునఁ బురాంగనలును, పూర్వ సువాసినులును పుష్పవనమునఁ దుమ్మెదలవలె మూగియుండిరి. ద్వార ప్రదేశమున విలాస పురుషులు కొందఱు హాస్యసంభాషణావినోదులై శాఖామృగములవలె కిచకిచలాడుచుండిరి. అనతిదూరమునఁ గల పెంటకుప్పపై శునక మొకటి సుఖాధిష్టాత్రి దేవతవలె నిద్రావివశయైయుండెను.

గాయకశిఖామణి హరిదాసు పుష్పమాలా శోభిత సుగ్రీవుఁడై, పీతాంబర వసన ధారియై, కాళ్ళకు గజ్జెలు కట్టుకొనుచుండెను. మర్దళవాద్య నిపుణుఁడు సంచలిత మస్తకుఁడై, రాగమాల వాయించువానిని, విస్ఫారిత నేత్రములతోఁ గబళించునట్లు, ముందునకు వంగుచుండెను. సభ్యులు వలయాకారమున ముఖమంటప మలంకరించిరి,

11

హరిదాసు గజ్జెలు కట్టుకొని హరిసంకీర్తనముఁ జేయ నారంభించెను.

వసంతరావు సపరివారుఁడై యాలయమునఁ బ్రవేశించెను. ఆతఁడు మార్గాంతరమున గర్భగుడిలోఁ బ్రవేశించి, వినయవినమితోత్తమాంగుఁడై శ్రీరాముని దివ్యచరణములకు నమస్కరించెను.

దేవకి సీతారాముల చరణ సమీపమున మంగళవస్తు ప్రచయమర్పించి, యర్చకుని వణకుచేతులలో దక్షిణ పూర్వకముగా రెండు రూపాయలు వేసెను.

రఘురాముఁడు, రఘువంశపావనుని, జానకీరాముని నాత్మలో సంస్మరించి, యా విగ్రహమునకు సాష్టాంగ దండ ప్రణామము లాచరించెను.

జానకి లజ్జాతిరేకమున రఘురామునిఁ దప్పించుకొని మాతృదేవి సమీపమున కరుగునపుడు, ఆ యమాయిక బుజ మాతని జలతారు కండువాకు తగిలెను. ఆమె లజ్జాప్రకంపితయై సీతాదేవి చరణ సాన్నిధ్యమున మస్తకము వాల్చెను.

"ఓ సీతారామా! సీతాదేవి నిన్ను చేపట్టి సుఖించినట్లు మాజానకి రఘురామునితో సుఖించుగాక! అని దేవకి తన హృదంతరాళమున నిశ్శబ్దప్రార్థన గావించెను.

పూజారి హారతి విధానము ముగించి, నస్యమలిననాసికాపుటములు దుడుచుకొనుచు

"అమ్మా! సీతారాములవారి దయవల్ల మీకు ఆయురారోగ్యసర్వైశ్వర్యాలు కలుగుగాక!" అనియాశీర్వదించెను. కర్పూర దీపకళికను హస్తాంగుళులతో స్పృశించి యా హరి సేవా పరతంత్రులు కన్నుల నద్దుకొనిరి.

హరిదాసు పంచమతానమున రుక్మిణీకల్యాణ గీతమును బాడుచుండెను. ముఖమంటపమున నాసీనులైన ప్రేక్షకులు వసంతరావును జా

చినతోడనే, "దయచేయ్యండి, ఇలాగ, ఇలాగ" అని స్థలసి ర్దేశపూర్వ కముగాఁ బలికిరి. ఆతఁడల్లునితో నా మంటపమున సుఖాసీనుఁ డయ్యెను. హరిదాసు మందహాస విలసితవదనుఁడై యాతనికి నమస్క రించి, కథా ప్రవచనమునకుఁ గడంగెను. దేవకి జానకీసహితయై మహిళామండలి మధ్య సుచితాసనాసీన యయ్యెను.

రుక్మిణీ మధురప్రణయ వృత్తాంతమును హరిదాసు వాగ్విలాసము తోలకాడ, హృదయరంజనకరముగా వినిపించెను. ప్రేక్షక స్త్రీ మండ లిలో నొక వృద్ధనారి నిద్రాధీనయై బోసినోట ముకుళితహాసము స్ఫురింప హరిదాసుని ప్రజ్ఞావిశేషమును బ్రశంసించుచున్నటులు తల పంకించుచుండెను. ఆ కౌతుకవేషమును దిలకించి వికట బ్రహ్మచారు లు కొందఱు నవ్వులలోఁ గూలిపోవుచుండిరి.

హరికథానంతరము దేవాలయము క్రమముగా నిర్జనమైపోయెను. రఘురామమూర్తి శయ్యాగతుఁడై రుక్మిణీ మధుర భక్తి విశ్వాస ములను, స్వార్థరాహిత్య ప్రణయప్రవృత్తియుఁ దలంచుకొనుచు స్వాత్మికానంద మనుభవించెను.

"భారతీ! నీవు ధన్యురాలవు! నీ యనంతకల్యాణ స్వరూపమునకుఁ ధన్యవాదము. హృదయోదయాచలమున నుషారాణివి; ఓ అమృత మయి వాగీశ్వరీ! వాణీ! నీకు నమస్కారము! నీ లలాటమునఁ జిన్మ యజ్యోతి కిరీటము గలదు; నీ నయనములఁ బ్రాభాతతారాప్రభ ఖేల నాలోలయగుచుండును; నీ యధరపల్లవమునుండి పీయూషధారకోటి బ్రహ్మాండ పిపాస హరించుచు స్రవించుచుండును; సుమంగళకరముగా విశ్వవీణ నీ శ్రీహస్తమున ఝంకార మొనరించుచుండును! అమృత సంగీతమయీ! విశ్వవిమోహినీ! బ్రహ్మాండతారిణీ! విశ్వప్రసవినీ! నీ శ్రీ పాదపద్మములు జీవన కుసుమాంజలి విశ్వానందకరముగా నర్పించిన బమ్మెర పోతరాజు, భక్తకవికుల పతంసుఁడు, ధన్యుఁడు! "అంబా!

భారతీ!" అని నిన్ను నోరారఁ బిలచి యాతఁడు జన్మసాఫల్యముఁ గావించుకొనియెను. రఘురాముఁడు భక్త్యావేశమునఁ బ్రశాంత నిశాంతమునఁ గన్నులు మోడ్చి నిదురించెను.

## 3

## శారదానిర్యాణము

గంభీరశరత్కాలానన్నమున ధరణీరాణి శోభాప్రకాశిత హాసోల్లాసిని యయ్యెను. విసీల సముద్రమున నౌకాశ్రేణివలె ధవళమేఘ ఖండములు సునీలగగన ప్రాంగణమున భాసిల్లుచుండెను. రజనీకాంతుఁడు సుధాకరుఁడు, నీలాకాశమున విరాజిల్లి దశదిక్కుల ధవళకిరణప్రసారముఁ గావించుచుండెను. ప్రఫుల్ల పుష్పప్రచయమువలె సముజ్జ్వల నక్షత్రమాల యంబరభాగమున శోభావికీర్ణమయ్యెను. కృషికహృదయానందకరముగా ధాన్యలక్ష్మి సహాస్యవదనయై, సుశ్యామల కేదారముల మంగళప్రదముగా నుండెను. వనభూముల నాట్యసుందరి యువ రాజితో సుమము సుకుమారహాసవిలసిత మగుచుండెను. అగస్త్రిద్రుమము కుసుమమంజరి ధరించి మనోహరముగా నుండెను. బాలేందుసుందరంబగు బంకిమ నేత్రోత్సవ మొనఁగూర్చుచుండెను. గృహాంగణంబుల, గృహోపరిభాగముల, గృహపరిసరముల, పచ్చని బీరపువ్వులు సీతాకోక చిలుకలవలె ముద్దులొలుకుచుండెను. ప్రఫుల్లపుష్పవనమునఁ బుష్పగంధము హరించి, శీతలపద్మవనసంచారంబుఁ గావించి, ప్రసన్ననదీ తరంగముల స్వచ్ఛసరోవర నీరముల నాట్యమాడి, సస్యవీచికలఁ దాటి సమీరకుమారుఁడు హృత్తాపశమనుఁడగుచుండెను.

"గంగా! జగన్మోహనాకరంబగు నీ శరత్కాలమున విపులావనీతలంబున సౌందర్యపూజ జరుగుచుండును. యువతీమణులు విశుభ్రకుసుమ విమండిత నీలకేశబంధములతో, నక్షత్రఖచిత నీలాకాశమును విలోకించుచుఁ బ్రేమగానమును వినుచుందురు. నేఁడు నా కామధురగానము వినఁబడుచున్నది. విశీర్ణమగు నా సంకీర్ణహృదయమున మహానంద జ్యోతి వెలుగుచున్నది! మహానందప్రవాహమును నేనరికట్టఁ జాలకున్నాను. నిర్ఝరానంద స్రవంతిలోఁ గొట్టుకొని నే నేతీరమును జేరుకొందునో యూహింపఁ జాలకున్నాను! తల్లీ! నావంటి భాగ్యవిహీనకీ యానంద మొకశాపమేయగును!" అని శారద రజనీముఖమున నొక చాపపైఁ బండుకొని తన పాదసమీపమునఁ గూర్చుండిన గంగతో ననియెను.

"అమ్మా! నీ యానందానుభవము నా హృదయమును విచూర్ణ మొనరించుచున్నది. నన్ను దుఃఖార్ణవమునఁ ద్రోసి నీ వానందతరంగిణిలో మునిఁగిపోయెదవా!" యని గంగసాశ్రునేత్రయై పలికెను.

"గంగా! చెప్పుచుంటిని: నిన్న నే నొక కలగంటిని; పతితపావని జగదంబా మందిరమున నిలువఁబడి యుంటినట. పాపపంకిలమునఁ బడిన యొక సుకుమారి యశ్రుకలుషిత నేత్రయై యాదేవీచరణసన్నిధానమున నిలువఁబడి యుండెనట."

"తల్లీ! నారీకులకళంకిని నగు నావంటి దుఃఖిని సంసారమునఁ గలదా? పుణ్యప్రేమమణి నా హృదయమునుండి జారిపడియెను. పాప విఫణిలోఁ బణ్యాంగననైతిని. పాప కుటిలచక్రమున ఘూర్ణితనై పాప కింకరీ రూపమున నరకద్వారమున హతాశనై పడిపోయితిని; నిజహస్తమున నిజకంఠమును గోసికొంటిని. ఆకుటిలహాస్యము, ఆ మాయా విభ్రమము, నా హృదయమును గాల్చివేయుచున్నవి. దేవీ! నీ పుత్రినయ్యు నేను రాక్షసినైతిని. నా శుభ్రప్రాణము పాపకలుషితమై పో

యినది!" అని యాయబల వెక్కి వెక్కి యేడ్చుచుండెనఁట.

"విశ్వ జనని యామెను గౌఁగిలించుకొని, సమాశ్వాసించి యని యెను:—

"కూతురా! నీవు పతితవైనను, నాతనయవు. ముక్తిమణి ప్రసాద మున నిన్ను నే నుద్ధరింపఁగలను. నా దయాలాభమున నా కన్యనాది యగును! తల్లీ! నీ లలాటఫలకమున సతీత్వము, దేవీత్వము సువర్ణా క్షరసంకలితము. ని న్నేగర్వాంధుఁడు, అవజ్ఞహృదయుఁడు వంచింపఁ గలఁడు?"

"ఆ యభయవాణీ శ్రవణమున నే నానందపులకితనై దేవీ పాదపద్మ ముల వ్రాలితిని. గంగా! స్వప్నరంగమున నాకు దర్శన మొసంగిన జగ దంబ నాహృదయమున జ్ఞానదీపమును వెలిగించినది. నే నీభవంబున వంచితురాలనైనను, దయామయి, యా మాతృదేవి నన్ను 'కూతు రా!' యని యాదరించును. నే నిప్పుడు భయభ్రాంతివివర్జితనైతిని!"

"అమ్మా! నీ యీస్వప్నసందేశము నారీకులోద్ధరణ కారణ మగును! లలనాహృదయము కోమలము, లలితము, స్నిగ్ధము. భగవతీ దయలేకుండినఁ గఠోరపరుషరుద్రపురుష హృదయము స్త్రీమండలినిఁ గబళించియుండదా?"

"గంగా! నిశాంతమున నీ వెన్నఁ డేనిఁ దుషారధౌతకుసుమంబులను జూచి యుంటివా? రజనీముఖమునఁ బ్రశాంతోజ్జ్వలతారకాశ్రేణిఁ దిల కించియుంటివా? సంపూర్ణ పూర్ణిమాశరచ్చంద్రమండలమును విలోకిం చితివా? మృదుకలనాదమునఁ బ్రవహించు తరంగిణీ సంగీతము నాలిం చితివా? మధుమయసృష్టిసౌందర్యమున విలీనమగుటకు మృత్యుదేవ తాహస్తమునఁ దరళించు స్పర్శమణి నాకర్షింపవలయును. మృత్యులో కమున నాకు రెక్కలు లభించును. నేను విరిసిన విరులలోఁ బవ్వళిం తును; సంధ్యాసమయమునఁ దారామండలమున నధివసించి విశ్వగాన

శ్రవణ మొనరింతుం; చంద్రికాస్నాతనై పూర్ణచంద్రుని యమృతకరముల నిశ్చలానంద యోగ మనుభవింతును. స్రోతస్వినీ స్వచ్ఛజలములఁ దేలియాడుదును. మృత్యుద్వార ముద్ఘాటించినచో మహానందలోకము దృగ్గోచరమగును — హా! తల్లీ! మృత్యుదేవతా!" యని యామె నిమీలితనేత్రయై మధురామంత్రణ పూర్వకముగా నీక్రింది గీతమును బాడెను:

"ఓసుఖదాయినీ! యోమృత్యురాణి!
జగదేకసుందరీ! జగదేకమాత!
సోఁగలై, మెత్తనై, సుకుమారమైన
కలువలఁబోలు నీ కనుఁదోయి యందు
సాంధ్యతారాశోభ, చంద్రికాస్ఫురణ,
నటియించుచున్న వానందదీపములు!—
కారుమబ్బులలోనఁ గాఱుచీఁకటులు,
కడుమనోహరలీలఁ గలసె నీమేన!—
కాలస్వరూపిణీ! కాళికాదేవి!
భవకర్ణధారిణీ! పరమకల్యాణి!
కోటిలోకంబులఁ గూల్చుదుఃఖములు,
నీవు చూచినతోడనే తూలిపోవు!
పాటలాధర సుధావర్షంబుఁ గురిసి,
యార్తులహృత్తాప మపనయించెదవు!
ప్రేమభూషితహస్త విక్షేపణమున,
మద్వైరివీరుల సంహారించెదవు!
నీ నిరంకుశశక్తి నెఱిఁగినమ్మి నెవఁడు,
తగులునే వాని యాత్మకుఁ బేదతనము?
భోగుల జోగుల మున్గాడెదీవు,

కలిమిలేములు నీకుఁ గలుగ వెయ్యెడను!
చిన్నలఁ బెద్దలఁ జేరదీసెదవు,
కాలప్రభేదంబు గమనింపవెపుడు!
త్రిభువన మోహినీ! త్రిగుణైకనిలయ!
సర్వశక్తులు నీకుఁ జాలవించుకయు!
వినవేఁడుకైన నీ వేణునిస్వనము,—
ఆనందమయ మధురామంత్రణంబు,—
వినవచ్చినంతనే వెంబడించెదను,
నవసుఖావాసితానంత మార్గమున!"

గంగ యీ హృత్కంపితగాన మాలించి వణికి పోయెను.

"అమ్మా! అనాథనగు నే నిప్పుడు మాతృవిహీనసైనై పోయితిని!" అని యామె యేడ్చెను.

* * * * *

శారద నిద్రాధీనయై దరస్మితవదనమున నిశ్చలానందరేఖ స్ఫురింప, దివ్యాంగనవలె నుండెను. ఆత్తుత్పిపాసాకులితహృదయము మెల్లనఁ గొట్టుకొనుచుండెను.

"అమ్మా! అమ్మా!" అని గంగ రెండుమూఁడు సారులు పిలచెను.

శారదకు నిద్రాభంగము కలుగ లేదు!

గంగ యేడ్చుచునే యుండెను.

౪

శృంగభంగము

ఒక నాఁటిరాత్రి యేడుగంటల సమయమున వేంకటాచార్యులు కాంతమ్మ గృహమునఁ బ్రవేశించెను.

కాంతమ్మ యాతనిం జూచి,

"ఆచార్లుగారా! నా మీద కోపం వచ్చింది కాబోలు! పది రోజులైంది కనిపించే లేదు." అనియెను.

వైద్యుఁ డుచితాసనమునఁ గూర్చుండి,

"కోపం మీమీదనా! సరిసరి! దగ్గర బంధువులకంటె దగ్గరవారు మీరు. మీ మీద కోపం రమ్మన్నా రాదు.—కాని, మీ గంగ మతం ఏమైనా మారిందా? లేక తలతిక్క రోగం అలాగే ఉందా?" అని యాతురతతో నడిగెను.

"ఆపిశాచం వచ్చింది కదా!—"

అర్ధోక్తిలో నాచార్యుఁడు "ఏ పిశాచం?" అని ప్రశ్నించెను.

"ఇంకెవరు? దీన్ని ఇన్నాళ్ళు బజారులో అమ్మేందుకి ప్రయత్నాలు చేసిన పాడుముండ శారద. మొగుళ్ళకోసానికి దేవులాడి దేవులాడి వచ్చింది. దీన్ని పెట్టి ఒక నాటకం ఆడనాలనుకుంది. దీని కేమైనా బుద్ధి ఉందా? అది ఎలా ఆడిస్తే అలా ఆడింది. అది మొన్ననే వచ్చి పోయింది. సిగ్గూలజ్జా లేని మొగుడు ముండాకొడుకు దానిని దహన సంస్కారాలు జరిపించాడు.—ఆ దేవత బాధ తప్పింది అనుకుంటూ ఉంటే మరో పిడుగుపడింది! ఇసికూలు మేష్టరట!—అది ఎవరో కిరస్తానీముండ ఈ ఊరొచ్చింది. పునిస్త్రీ దానిల్లాగ గాజులు, బొట్టు, రవిక, చీర—వీటికేమీ లోపం లేదు. ఒక రంభ వేషం వేసుకొని

తన అందం—మండినట్టుఉంది—దిబ్బలాగ మొగం ఇదీనూ-వీధిలో వస్తూ పోతూ ఉన్న వాళ్ళు చూసి ఆనందిస్తున్నారో లేదో అని ఇటూఅటూ చూస్తూ—అదేమి నడకో—ఇప్పటి వాళ్ళు కిందూ మీాదూ చూడకు—ఇసికూలికి వెళుతుంది! మా గంగకి దానికి స్నేహం అయిపోయింది. దాని వలలోంచి తప్పించిందికి ప్రయత్నం చేస్తూ ఉన్నాను!"

"మీా ప్రయత్నాలు ఏమైనా కొనసాగినట్టున్నాయా?"

"మీారు కూడా సాయం చేస్తే కొనసాగ కేమౌతాయి?

"నే నెలా సాయం చెయ్యను?"

"ఆ ముండకీ దీనికి దెబ్బలాట పెట్టాలి." ఆ సమయమున గంగ గృహమునఁ బ్రవేశించెను.

"అమ్మాయీ! నాతో ఆ నాడు అన్ని శ్రీరంగనీతులు చెప్పావే? ఇప్పుడెలా దాని ఇంటికి వెళ్ళావు?" అని యాచార్యుఁడు గంగ నడిగెను.

"ఎవరి యింటికి?"

"ఆ ఇస్కూలు మేస్టరు ఇంటికి."

"వెళ్ళఁగూడదా? మీా యాజ్ఞ యేమి?"

"నా ఆజ్ఞ మీాద ఉన్నావని కాదు—అలా ఉంటే నీ సంగతి బాగానే ఉండును!—అది తార్పుకత్తె!"

"అయ్యా! ఆమె యెట్టిదైనను నీ వామె వర్తనమును విమర్శింప నర్హుఁడవు కావు నే నామెగృహమున నీచ కార్యకలాపమున నిమగ్నురాలనగుచుంటినని నీవు తలంచుచుంటివి కాబోలు! నే నట్టి దాననే యగుదును గాక! నా శౌశీల్యమును బరీక్షించుటకు నీ కేమి యధికారమున్నది?"

"సమాజం సమిష్టి కుటుంబం వంటిది. నేను సమాజం తరఫున

నిన్ను విమర్శించవచ్చును. సమాజం కంట్లో నవ్వు దుమ్ము కొట్ట
లేవు."

"సామాజిక శాసనముల నుద్ధరించుటకు నీ కధికారమే యున్న
యెడల నీవు బహిరంగముగా నన్ను రచ్చ కీడ్వవచ్చును. దవడలు
నొక్కుకొని యీ రహస్య సంభాషణలకుఁ గడంగుట యెందులకు?"

"నిన్ను రచ్చ కీడ్వడం ఒక గొప్ప పనికాదు. నిన్ను నిమిషంలో
పాడుచెయ్యగలను. గంగా! నీకు లోకజ్ఞానం లేదు నా మాట విను-
నిన్ను బంగారం కొండమీద ఎక్కిస్తాను."

"నీ మాఢ్యము-కాదు- మొండితనము-నీకే తగును. నాతో నీ విం
కెన్నఁడును మాటాడవలదు!" అని గంగ వంటయింటిలోని కరిగి
తలుపు గడియవేసి, కటికినేలపైఁ గొంగుపఱచుకొని, మృదుల బాహు
వుపధానముగాఁ బండుకొనియెను.

ఆచార్యుఁడు పెదవి విరచి,

"అమ్మా! కార్యం లేదు. మీ మొగం చూసి ఊరుకొన్నాను;
లేకపోతే నా మాట ఎలాగు వినదో చూసి ఉందును." అని
యుత్తరప్రజ్ఞలు పలికి యావలికిఁ బోయెను.

కాంతమ్మ గుడ్లగూబవలె నులకమంచమున కంటుకొని పోయెను.

## ౫

## శేషమ్మ

శారదా నిర్యాణము గంగా హృదయమున వజ్రాఘాతప్రాయ
మయ్యెను. ఆ చిరదుఃఖిని కాలప్రవాహమున నశ్రులు రాల్చుచు
నదృశ్యమై పోయెను. గంగా హృదయమున సుశీతల చందనచర్చఁ

గావించిన యమృతహస్తము, ఆ యమృతరూపము విలుప్తమై పోయెను. భవభవన పరిత్యాగముఁ గావించి యా యభాగిని భస్మవిలాసినియై పోయెను. అపత్యస్నేహపూరితోత్సంగమునఁ దనకుఁ బ్రేమాస్తరణ రచించు దయామయి, భస్మాస్తరణమున విలీనమై పోయెను. ఆ మాతృవాణి, యా దివ్యస్వరూపము, గంగానయనకర్ణేంద్రియములకు స్పష్టముగా గోచరించుచుండెను.

"గంగా! నీ చేతులతో నీ గళమును గోసికొనవలను!" అని యంత్యసందేశపూర్వకముగా నామె పలికి యుండెను. ఆ సందేశవాణి గంగాహృదయకుహరమునఁ బ్రతిధ్వనించుచునే యుండెను. ఆమెకు జగమంతయు శూన్యప్రదేశమువలెఁ జూపట్టెను. నయనచకోరచంద్రుఁడు రఘురాముఁడు కూడ గ్రామమున లేడు. ఆతని నామోచ్చారణకైనఁ దన కధికార మున్నదా? "నీ ప్రేమదర్శనశక్తిఁ గోల్పోయినది!" అని శారద వచించి యుండెను. రఘురాముఁడు వివాహితుఁడు. ఆతని హృదయప్రదేశ మొనరించుట కామె కెట్టి యధికారమును లేదు అట్టి ప్రయత్నమున, నామె తిరస్కృతురాలగును —

"కాని నా హృదయమేటికి దురాశాధీనమైపోవుచున్నది! ఆశాంకురము నిస్తేజమైనను బ్రాణావశిష్టమై యున్నదేమి? ఏ దుర్ముహూర్తమున నే నాతని ముఖారవిందమును జూచితినో, నా హృదయము నాకుఁ దక్కదయ్యెను! హా! సోన్మాదినినై నేను భృగుపతన మొందితిని!-జీవించి యేమి ప్రయోజనము!" అని యామె కన్నీరుఁ గార్చెను.

శారదాముఖమున నామె విపులవిజ్ఞానమార్జించి యుండెను; పెక్కుగ్రంథములను స్వయముగాఁ జదివియుండెను.

ఆ గ్రామమునఁ గల బాలికాపాఠశాలలోఁ బ్రధానోపాధ్యాయినిగా నియమింపఁబడిన "శేషమ్మ" గంగా చారిత్ర మాలించి, యామెను స్వీయగృహమున కాహ్వానించెను. విదుషీమణి సాంగత్య

ము౯ దన జ్ఞానోపార్జన క్రియ నిర్విఘ్నముగాఁ గొనసాగించుకొనవచ్చునని గంగ విశ్వసించెను. ఆ కారణమున నామె యా ప్రౌఢాంగన మధురాహ్వానమును కృతజ్ఞతా పూర్వకముగా స్వీకరించెను.

"అమ్మా! నీ దుఃఖగాథ నే నాలించియుంటిని. శారదాంబ నిన్ను సన్మార్గమున నడిపింప నెంచి, నీ లాలనపాలన భారము వహించి యుండెనట. ఆ దుఃఖిని నిన్నుఁ గాలసింధుతీరమున విసర్జించి, పరలోక మలంకరించెను. నీ వనాథ బాలికవు. నిన్నుఁ జూచిన నా హృదయ మేటికో ద్రవీభూతమగుచున్నది." అని శేషమ్మ కన్నీరు నించెను.

"తల్లీ! శారదాంబ మృత్యుకరగృహీత యైనప్పుడే నేను మాతృవిహీన నైతి ననుకొంటిని. నావంటి పతితనారీరక్షణార్థము పరమేశ్వరుఁడు నిన్ను సృజించెనని నేఁ దెలియలేనైతిని. అమ్మా! నీవు భగవత్ప్రేరణవలన నాయందుఁ గృపావర్షిష్ఠ వైతివి!"

"గంగా! నీ కేమియును భయములేదు నీ యభ్యుదయ సంపాదన కార్యమున నేను నిరంతర నిమగ్నను. మీ తల్లి నిన్నుఁ జాల బాధించుచున్నదట!"

"ఆమె నన్నేమి చేయఁగలదు? పాపమైనను బుణ్యమైనను నేను జేయవలయును."

"నిజము, పాప పుణ్య ప్రభేద మెఱింగితివి కావున, నీవు ధన్యురాలవు!"

"అమ్మా! నిన్న మనము స్త్రీ పునర్వివాహమునుగూర్చి మహామహోపాధ్యాయ కందుకూరి వీరేశలింగము పంతులుగారి గంభీరోపన్యాసమును జదువుచుంటిమి. ఆ యుపన్యాస శ్రవణమున నాహృదయము మ్రుశుసి క్తమై పోయినది."

"స్త్రీ పునర్వివాహము సనాతన సంఘాచారవిరుద్ధ కార్యమని నే నిప్పటికిని నమ్ముచున్నాను. పురుషుఁడు జన్మగ్రహణ మొనరించినప్పు

డై స్వాతంత్ర్య ప్రీతియుక్తుఁడై భువనాలయమునఁ బ్రవేశించెను. ప్రకృతిదేవి నిజహస్తములతో స్త్రీ లలాటమున సస్వాతంత్ర్య లాంఛనము ప్రస్ఫుటముఁ గావించినది. పురుషుఁడు స్వేచ్ఛావిహారి; స్త్రీ యనుగత. పురుషుఁడు విలాసలోలుఁడు; స్త్రీ విలాసవస్తువు. పురుషుఁడు శాసనకర్త. స్త్రీ యనుచరి. పురుషుఁడు వివాహ పరంపరల కర్తృఁడు. స్త్రీ భర్తృవిహీన యగునేని, ఆనంద వ్రతోద్యాపన మొనరింప వలయును.”

“అమ్మా! నీ వాగర్థము సత్యదూరము కానేరదు- కాని నాకొక సంశయమున్నది. పురుషుల యధికారము, స్త్రీల యనుచరత్వము విధాతశాసన ప్రణాళి కనుకూలముగునా? సృష్టికర్త స్త్రీ పురుష హృదయమునకు స్వాతంత్ర్యాభిలాష సమానముగాఁ బ్రదాన మొనరించి యుండలేదా? స్త్రీ పురుష సమాజమున భిన్నప్రవృత్తి స్థూలచక్షుగోచరమైనను, సార్వభౌమిక దృష్టి కెట్టి ప్రభేదమును స్ఫురింపదు. పురుషున కాత్మ యున్నటులనే స్త్రీకిఁగూడ నాత్మ యున్నది. ఈ సామాన్య ధర్మపరిశీలనమున నాకొక విశ్వాస ముదయించినది. స్త్రీలను శాసింపఁ బురుషున కధికారము లేదు. స్త్రీజాతి విలుప్తమేనిఁ బురుషుఁడు కఠోరభావ కలుషితుఁడైపోవును. అనంత జీవన సోపానమున స్వర్గీయ ప్రతిభ విలోకింపనేరఁడు. స్త్రీ సృష్టిసౌందర్యకారిణి; పురుషుఁడు సౌందర్యపూజారతుఁడు. స్త్రీ వాగ్దేవి; పురుషుఁడు భక్తుఁడు. స్త్రీ విశ్వప్రసూత; పురుషుఁడు విశ్వానందభోగి.”

“గంగా! నీ పలుకులు భయంకరార్థ ధ్వనితములై నా హృదయమును భయోత్కంపిత మొనరించుచున్నవి. నీవు తెలివైనదానవు. శారదా సాంగత్యమున నీ మనోనేత్రము దివ్యదృష్టి ప్రదీప్తమైనది. నీవు స్వర్గారోహణ క్రమము నెఱింగితివి కాని,నీ కనుభవము లేదు. లోక మర్యాద, లోక ప్రవృత్తి, నీ యాలోకన పథమున కెడమైనట్లు

నాకుఁ దోఁచుచున్నది. భగవంతుని సృష్టి నిర్మాణమున లేని భేదము సమాజము నిర్మించినది. సమాజ బంధనమున మన మున్నంతవఱకు సమాజ నిర్మిత భేదములను బాటింపవలయును.

"మహాదాదర్శనిరోధకారణమగు సామాజిక శాసనములను నేను మన్నింపఁజాలను!"

"నీ వెట్టి యాదర్శమును స్మరించుచుంటివి!"

"ఆత్మ స్వాతంత్ర్యమును."

"అది యెట్లు సాధింపగలవు!"

"ఆత్మబలము వలన,"

"నీవు అబలవు; సమాజము బలవంతమైనది."

"నేను సమాజముపై దండెత్తుట కూహింపలేదు; సమరతృష్ణ నా హృదయమున కపరిచితము."

"నీవు డీకొనకుండినను, నిన్ను సమాజము బాధించును."

"సమాజము బలాత్కారముగా నన్నగ్నికుండమునఁ బడఁద్రోసినను, నేను స్వాతంత్ర్యగీతమునే పాడెదను. నా యాత్మస్వాతంత్ర్యమును సమాజము నిరోధింపఁ జాలదు. సమాజమున కదియగమ్యగోచరము; స్పృశింపరానిది."

"గంగా! నీ మహిమాస్పదహృదయమునకు నమస్కారము. కాని నీయాత్మబల మచిరకాలములో నగ్నిపరీక్షాధీనమగును. స్వాతంత్ర్యగీతమును బాడెదవో, సంఘముయొక్క నిరంకుశాధికారము నంగీకరింతువో, చూచెదను. నేను నీతోడఁ బంతము లాడుచున్నానని తలంపకుము; సమాజమునుల్లంఘు నీయమని నా విశ్వాసము."

"అమ్మా! నే నభిమానపూరితనై మాటాడుచుంటినని యనుకొనవలదు. పురుషుఁడు విధాతకాఁడని చెప్పుచుంటిని. విధాతశాసనములు సృష్టిరాజ్య మంగికరమునకై నిర్దేశింపఁబడినవి; మానవనిర్మితశాసన

ములు మానవుని యహంకార పరిష్కృతకనుకూలములై యున్నవి; కావుననే సృష్టిమాంగల్యమునకుఁ బ్రతికూలములు."

ఆ ప్రౌఢాంగనయు నా యువతియు స్త్రీమహత్త్వవిషయచర్చఁ గావించుచుండిరి. వీథితలుపు చేరవేయఁబడి యుండెను. సీమకుక్క యొకటి ముకుళితాంగియై మెత్తని కుచ్చుతోఁకపై శిరమునుఁగొని వీథి గడపలోఁ బండుకొనియుండెను

మెల్లగాఁ దలుపు తెరవఁబడియెను. నిద్రాభంగమున ధవళశునక కిశోరము, 'భౌ' 'భౌ' మని యరచి, యుత్తరక్షణముననే కన్నులుమోడ్చి నిదురించెను.

ఆ యాగంతకుని మందహాస విలసితముఖారవిందమును గంగమున్నెన్నఁడును జూచియుండలేదు. ఆ కారణమున నామె లజ్జాభరమున నించుక కంపించి పోయెను.

"అమ్మా! పోయివచ్చెదను." అని మధురమంద్రస్వరమున శేషమ్మతోఁ బలికి యాతఁడు వెడలిపోయెను.

## ౬

### రాక్షసవిలాసము

"వేణూ విశేషములేమి? ఆ యాసనమునఁ గూర్చుండుము" అని శేషమ్మ యాసుపరిచిత వ్యక్తితో సహోదరపూర్వకముగాఁ బలికెను.

వేణుగోపాలరావు నియోగి బ్రాహ్మణ కుమారుఁడు. ఉగ్గుపాలతోఁ లౌకిక వ్యాపారమర్యాదలు గ్రోలినవాఁడు. చక్కనివాఁడు. అతని తండ్రి డెప్యూటీ తహసీల్దార్ ఉద్యోగమునఁ జాలధనమార్జించి యుండెను. జనకుని హస్తమున లేఖినియు, మాతృహస్తమున రాజ

ముద్రియు నుండెడివి. ఆతని తల్లి సుందరమ్మ యరచేతిలో స్వర్గప్రదర్శనముఁ జేయఁగల నిరుపమాన కౌశలధురీణ.

"తలపాగా పెట్టుకొని సింహాసనంమీద కూర్చుండుకే మావారికి అధికారముంది. ప్రజలభాగ్యచక్రం త్రిప్పేందుకు అధికారం నాకుంది!" అని యామె గర్వమున నిర్వహించు చుండెడిది.

భర్తృమరణానంతరము సుందరమ్మ ధనవర్షిత విభేదనమునకుఁ గడంగెను. అచిరకాలములో నా కామినీ వజ్రహస్తఘాతమున నా పాప పర్వతము చూర్ణవిచూర్ణమైపోయెను! ఆ కారణమున నామె స్వగ్రామమును బరిత్యజించి శంకరపురం ప్రవేశ మొనరించెను. నూతన స్థలమున నూతనవ్యక్తులతో వినూతన పరిచయ భాగ్యమామెకు లభించెను.

'కాఫీహోటేలు'లోఁ జాలకాలము సవ్యసాచియై పనిచేసిన వన్నె వేంకటేశమును పాకశాస్త్రపారంగతుఁ డామె దృష్టి నాకర్షించెను. ఆతని యవలంబనమున నామెయొక సామాన్య గృహమును సద్దెకుఁ దీసికొని భోజనాలయ మొకటి స్థాపించెను. నలభీమ పాకములను విమర్శింప శక్తిగల వేంకటేశము పాకశాలలో నిరంకుశాధికారము ననుభవించుచుండెను. సుందరమ్మ పుణ్యాంగనవలె నలంకృతయై భోజనార్థమరుదెంచు పాంథులను దరహాసకటాక్షములనే బంధింపఁ బ్రయత్నములు చేయుచుండెను. అచిరకాలములో "సుందరమ్మ హోటేలు" సుప్రసిద్ధమైపోయెను. వేంకటేశము దరిద్ర బ్రాహ్మణ వేషమును విడచి మన్మథావతారమును బడసెను.

వేణుగోపాలరావు టవున్ స్కూలులో మూడవ ఫారము జదువుచుండెను. ఆతఁడు మూడుసంవత్సరములనుండి యా శ్రేణీ సోపానముననే నిలచిపోయెను. హిందూదేశమున నెన్ని విధముల సిగరెట్లు ప్రచారమున నున్నవో యాతఁడు నిముషమాత్రమున వల్లింపఁగలఁడు; అశోకచక్రవర్తి యే దేశము బాలించెనో యను ప్రశ్నకాతఁడు

శతాబ్ద మాలోచించి నైనను దగినసమాధాన మొసంగఁజాలఁడు; విద్యావిషయమున నాతని కెట్టి యాసక్తియును లేదు; పరిహాసము యమున దనకు శృంగభంగమైనను, విలాసతాండవమున నాతఁడు వంచితుఁడు కాలేదు.

“పరీక్షలు గిరీక్షలు నాకెందుకోయి? అందఱూ పాస్సై తలపాగాలు పెట్టుకుంటే కాళ్ళుదాచుకొని కూర్చుండే వాళ్లెవరు?” అని యాతఁడు తన నల్లని గిరజాలు స్పృశించుచు సహాధ్యాయులతోఁ బలుకు చుండును.

“నీకు తెలీని విశేషాలు ఏమున్నాయి?” అని వేణుగోపాలరావు కుర్చీలోఁ గూలఁబడి శేషమ్మ ప్రశ్నకుఁ బ్రత్యుత్తరపూర్వకముగా నసియెను.

“వలవేయుట యైనది”

“పిట్ట పడిందా?”

“వలసమీపముననే మెలఁగుచున్నది—అంత తొందరయేల?”

“సొమ్ముజాగ్రత్త చేస్తూ ఉన్నాను”

“ఎంత శీఘ్రముగా సమకూర్పఁగలవో యంతశీఘ్రముగా నీకోరిక నెరవేరఁగలదు”

“పిట్టని పట్టేందికి చాలామంది ప్రయత్నాలు చేస్తూఉన్నారట! మనకు దక్కుతుందో లేదో?”

“నీకా సంశయ మెందుకు? అదియింకొరిక గుమ్మమునఁ గాలు పెట్టదు. నామాట జవదాటదు. కాని, వేణూ! నిన్నొకటి యడుగవలయును. అది యిష్టపడిన యెడల నీవు పెండ్లి చేసికొనెదవా?”

“పెళ్ళా! పెళ్ళిచేసుకుంటే తిరిగియింట్లో కాలుపెట్ట నిస్తుందీ మా అమ్మ?”

“వివాహముఁ జేసికొనకపోయిన నామె యంగీకరింపదేమో?”

వేణుగోపాలరావు మోమెత్తి యించుకసేపు సవితర్కముగా మౌనము వహించెను.

"ఆలోచనకేమున్నది; వివాహము నిన్నేమి బంధింపఁగలదా? ఏదో, ఔననదంటే ఔననిపించుకొనుము."

"సరే—నన్నెప్పుడు రమ్మంటావు?"

"సొమ్ము జతపఱచుకొనగానే"

వేణుగోపాలము వెడలిపోయెను. శేషమ్మ యాతనిని వీథిద్వారము వఱకు సాగనంపి, చెఱఁగు మఱుఁగున గట్టిగా నవ్వుకొనియెను.

## ౭

### వార్తాపత్రిక

అనిర్వచనీయభారమొకటి గంగా హృదయము నణచివేయుచుండెను. మాతృప్రేమాశూన్యమగు కాంతమ్మ హృదయము ధనాశాపూరితమై యున్నది. ఆచార్యుఁడు తోఁకత్రొక్కిన పామువలె నా యువతీచరిత్రమునఁ గళంక మారోపింప రంధ్రాన్వేషణ మొనరించుచుండెను. శారద యిహలోకమున జీవనలీల నుపసంహరించినది. శేషమ్మ హృదయ మింకను ఆమెకుఁ బూర్ణముగా దృగ్గోచరము కాలేదు. రఘురామమూర్తి భార్యాముఖావలోకనతత్పరుఁడై గ్రామాంతరమున నిలచిపోయెను. గంగ కేవైపుఁ జూచినను, శూన్యముగా నుండెను; శూన్యప్రదేశమున విహ్వలచిత్తయై యామె తన శూన్యజీవనమున శూన్యత్వమును విలోకించుచుండెను.

"గంగా! నీ ముఖపద్మమేటికి వాడిపోయినది? నీ జగన్మోహనరూపమున విషాదచ్ఛాయ పడినదేమి? యువతీజీవనము నిత్యానంద

భోగమున కేర్పఱుపఁబడినది. భువనానంద కారిణివి; నీ వేటి కానంద రహితవైతివి!" అని శేషమ్మ గంగను జూచినతోడనే తాను జదువు చున్న వార్తాపత్రికను మేజాబల్లపై విడిచి, ప్రగాఢస్నేహప్రదర్శన పూర్వకముగాఁ బలికెను;

"అమ్మా! నేను దుఃఖ మనుభవించుటకే జన్మించితిని. నా జీవన మున నానందము లేదు; ఆనంద మూరీచి నా హృదయమును బ్రజ్వలిత మొనరింపఁ జాలదు. దుఃఖమున నానందము గలదేని నే నానంద మయిని."

"బాలికా! నా యెడల నీ కింత సంశయ మెందులకు? నీ దుఃఖా నందమునకు గారణమేమి? రాధిక శ్రీకృష్ణ భగవానుని విర హమున స్వర్గీయానంద మనుభవించెను. సీతాదేవి శ్రీరాముని వియోగమున నశోకవనభూమిలోఁ బరమసుఖానుభోగమునఁ బ్రాణ ధారణఁ గావించెను. ప్రబలవిరహమున ననంతసుఖమున్నది. దుఃఖ మున నానందమున్నది.—నీ హృదయనాథుఁ డెవఁడు? నీ లోకాతీత సౌందర్యము ననుభవించుట కేపుణ్యవ్రతుఁడు జన్మగ్రహణ మొన రించెను!"

"అమ్మా! నన్నేటికి హాస్యమాడెదవు? నేను ప్రేమభిక్షుకర్త్రా రాలనా?"

"నీవు ప్రేమింపఁబడినను, ప్రేమింపఁబడకుండినను, నీవు ప్రేమింపఁ గలవు—నీ హృదయ మెరికి దత్తమైనది?"

గంగయవనత వదనయై దీర్ఘనిశ్వాసపురస్సరముగాఁ గన్నుల నీరు నించెను. శేషమ్మ యామెను గౌఁగిలించుకొని,

"తల్లీ! నీ వేటికి దుఃఖాశ్రులు రాల్తువు? నీకు నేను సహాయ మొన రింపఁగలను. నీ ప్రణయచరిత్రమును నాకు వినిపింపుము. నీ కెట్టి భయమును లేదు." అనియెను.

"అమ్మా! నాహృదయ చోరుఁడు వివాహితుఁడు. నే నంధురాల నైతిని—" గంగ వెక్కి వెక్కి యేడ్చెను.

"నామనోరథము విచ్ఛిన్నమై పోయినది; జీర్ణహృదయమునఁ బిశాచమువలె నా యాత్మ ఘోషించుచున్నది! నాకుఁ బలాయన మార్గము స్ఫురింపలేదు. నా జీవనపథము కంటకమయమై పోయినది. ఆ యమృతమూర్తి, యా యమృతానందవిధాత నాదృష్టిపథమున కెడమై పోయెను. జగమంతయు నా కిప్పుడు మరుభూమివలెఁ దోఁచు చున్నది. నే జీవించి ప్రయోజనమేమి?" యని యా కాతరమృగాక్షి కన్నులు తుడుచుకొనియెను.

"గంగా! నీ వింకను జీవనద్వారమున నడుగిడుచున్నావు. భవి ష్యత్కాలగర్భమున సుఖించుట కెన్నియో విపులావకాశములు నీ కొఱకు నిగూఢములై యున్నవి. ఆశామయజీవనమున నిరాశయేటికి? వివాహితుఁడంటివి; ఆతఁడెవఁడు?"

"మా గృహసమీపమునఁ గాపురమున్న యశోదమ్మ నెఱుంగు దువా?"

"ఔను, తెలియును—ఆ పుణ్యతీర్థగాత్రపావనోదిని నెఱుంగని వారెవరు?"

"ఆమె కుమారుఁడు—" గంగ యొడలు వాల్చెను. ఆమె యేదియో మహాపరాధమును జేసినటుల లజ్జితపడియెను. ఆమె నిమీలితాక్షియై పల్లవాధరము చలింప, "జగదంబా! కీర్తికిరీటధారిణీ! దీనపాలినీ! దీక్షాదాయినీ! ధర్మవిధాయినీ! కల్యాణరూపిణీ! అమృతభాషిణీ! నన్ను క్షమింపుము!" అని యేకాంత ప్రార్థనముఁ గావించెను.

"గంగా! నీహృదయ రహస్యమును వెల్లడించినందులకుఁ బశ్చాత్తా పము నొందుచుంటివా? నేను దల్లివంటిదానను. నాయందు నీకు దాప రికమేమి? నీ మేలుకోరుదానను; నాయందు నీ కనుమానమేల?

అమ్మా! రఘురామమూర్తి యిప్పుడూర లేడనివింటిని. ఆతఁడు ధర్మవీరుఁడు, కర్మవీరుఁడు; యువజన నాయకమణి. నీవు జగన్మోహినివి; కల్యాణమయివి; యువతీ జనశిరోమణివి. మీ యిరువుర సమ్మేళనము మణికాంచన సంయోగమువలె జగదానందకరముగానుండును!"

"ఆ యఖండపుణ్యము జన్మాంతరముననైన నే నాచరింపఁగలనా?"

"గంగా! నీ యందు నాకు జాలికలుగుచున్నది. ఈ పత్రికను దిలకించితివా?" యని యామె మేజాబల్లపైఁగల వార్తాపత్రికను దీసి "సతీమణి" యను శీర్షికక్రింద నిల్చి చదివెను—

"మా యూర మార్చినెల మూఁడవతారీఖు రాత్రి పదిగంటల సమయమున భయంకరమగు నొక యాత్మహత్యజరిగినది. శంకరరావు సత్కులసంజాతుఁడు; విద్యాసంపన్నుఁడు. ఇచ్ఛావినోదము భవసంకటహారణౌషధమని యాతని యాత్మవిశ్వాసము: మానవున కేసమయమున నెట్టి యాకాంక్షవొడమునట్టి సమయమున నా యాకాంక్ష పూర్ణముఁ గావించుకొనవలయును; లేనియెడల నాత్మసంతుష్టి లేదు; ఆత్మసంతుష్టి లేకుండిన జీవనమశాంతపూర్ణమై దుఃఖప్రదమైపోవును.

ఆతఁడొకనాఁడు విధిచోదితుఁడై గ్రామాంతరమరిగి యుండెను. ఆ గ్రామమున నొక యపూర్వవిలాసిని యాతని దృష్టి నాకర్షించెను. ఆమెను బరిణయమాడవలయునని యాతని కాకాంక్షవొడమెను; కాని వివాహితుఁడు. ఆ లావణ్యమయి విగ్రహమును జేఁబట్టకున్నఁ దన యాత్మవిశ్వాసము నిస్తేజితమై పోవును. ఆతఁడామెను రహస్యముగాఁ బెండ్లియాడెను.

అగ్నిసాక్షిగా నాతఁడు పెండ్లియాడిన సతీమణి, పుణ్యశ్రీవిమండిత, పార్వతమ్మ యచిరకాలములో నాతని రహస్యప్రణయక్రీడల జాడఁబట్టెను. ఆమె స్వీయనాథుని పరితోషన సంవర్ధన మభిలషించి, నూతిలోఁబడి తారుణ్యవిలసితదేహమును విసర్జించి, పరమేశ్వరుని

యంక దేశమున నాశ్రయము వడసెను. ప్రాణకాంతుని సంతోష సంపాదనకార్యమున నాత్మజీవన ప్రదానమునఁ గావించిన పార్వతమ్మ 'సతీమణి' ఐహికభోగములకు జలాంజలి సమర్పించి, పుణ్యలోకమున కరిగిన యాముగ్ధనారీ యాత్మకు భగవంతుఁడు శాంతిఁ బ్రసాదించు గాక!

"విలేఖరి."

గంగ యా వృత్తాంత మాలించి గడగడ వణకిపోయెను.

"అమ్మా! పార్వతమ్మ యాత్మహత్య చేసికొనలేదు. రహస్యప్రణయమున శంకరరావును బంధించిన యాగ్రామ్యయువతియే హంతకురాలు!—ఆహా! సతీజీవన విధ్వంసకారిణి, యా యువతి యింకెట్లు తలయెత్తఁగలదు?" అని యామె భయాకులితయై శేషమ్మయొడిలోఁ బడిపోయెను.

ప్రచండ గ్రీష్మాతపతప్తమేదినీఖండమువలె నాయభాగినీ లలాటము జ్వలించి పోవుచుండెను; తృషాభ్రాంతనయనము లుష్ణాశ్రుప్రవాహమున మునిఁగిపోయెను; స్వర్ణలతాంగము ప్రచలితమై పోవుచుండెను.

"అమ్మా! నే నపరాధ మొనరించితిని. రఘురాముని భార్య జానకి కిశోరీ బాలిక. ఆముద్దరాలి జీవన సుఖమున నేఁబదాఘాత మూహించితిని. ఆయానందమయ స్వరూపమును దుఃఖాశ్రుకళంకిత మొనరింప సాహసించితిని. ఆముగ్ధహృదయమున విరాజిల్లు ప్రణయప్రతిమను హరింప సంకల్పించితిని. ఆ బాలికాలలాటసింధూరతిలకమును జెఱపి వేయనమ కట్టితిని! అనింద్యచరిత్రమున నిందారోపణమునకుఁ గడంగితిని. అమ్మా! నాపాపమునకుఁ బ్రాయశ్చిత్తమున్నదా?" యని గంగకషాయరాగకలిత నేత్రములను గప్పుకొని యేడ్చెను.

శేషమ్మ పైశాచికానంద మణచుకొనుచు,

"గంగా! నీ వేమి చేయఁగలవు? ప్రేమావలోకమునఁ దారతమ్య

ము విలుప్తము; యుక్తాయుక్తవివర్తన శక్తిశూన్యము. అమ్మా! ఇప్పుడేమైనది. లోకులేమనుకొనిన నేమి? నీవు పాపమొనరింపలేదు. నీ మనశ్శుద్ధి నీకుఁ దెలియదా?"

"లోకమేమనుకొనుచున్నది? అమ్మా! నామూలమున రఘురాముఁడు నిందితుఁడై పోయెనా? ఆ నిష్కళంక చరిత్రునిపై నీలాపనిందలు మోప లోకమున కుద్వేగ మేలకు?" అని సీత దీర్ఘనిశ్వాస మెడలించి యడిగెను.

"అమ్మా! 'లోకులా కాకులో?' యను లోకోక్తి వినలేదా? వారి నోటికిఁ దలుపును ద్వారబంధము ను విధాత కల్పింపలేదు."

"లోక మేమనుకొనుచున్నది?"

"రఘురాముఁడు జానకినిఁ బరిత్యజించి, నిన్ను వివాహమాడునని"

"అమ్మా! ఇదినిజమా? ఈ వాగ్వజ్రాఘాతము నే నెట్లు సహింపఁగలను? నా కేమిదిక్కు! తల్లీ! నీ చరణాశ్రయమును జేరితిని. నన్నేమి చేయుమందువు? పుణ్యమూర్తి రఘురాముఁడు నాకారణమునఁ గళంకితుఁడు కాఁగూడదు"

"నీ వాతని దృష్టి పథమున కెడముగా నుండవలయును."

సీత సవిత్కారముగా,

"ఆహా! నందనవనవిహారమును, సురభిళ పారిజాత సుమాపచయమును, వియద్గంగా తీరనివాసమును, సువర్ణనళినీ వనవిలోకనభాగ్యమును, నే నెట్లు త్రుటిలో మఱవఁగలను? త్రికరణసాక్షిగా నేనెట్టిపాపకార్యము నాచరించి యెఱుంగను. నా కన్నీటి వెల్లువ దేవతలకేల దర్శనీయమైనది? సదానందు లనిమిషులు; ఒక్క యనాథయువతీయానందమును జూడఁ జాలకపోయిరా?" అని యామె శేమమ్మముఖము నట్టెచూచి,

"అమ్మా! నే నాతని దృష్టిపథమున కెట్లెడమయ్యెదను?"

"స్థలాంతరమున కేగిన.—

"అమ్మా! నీ వనన్యపుణ్యశీలవు. నీ వాత్సల్యమునకు శతకోటి వందనములు. నన్ను నవమాసములు మోసి, కని, పెంచిన తల్లి నా జీవనమున మరణ యాతన గలిగింపఁ బ్రయత్నించినది. నీవు మరణమున జీవనసుఖము నిరూపించితివి. కన్నతల్లికంటెను శతగుణములు నధికురాలవు. నీ యుపదేశ మనుసరించి నేను స్థలాంతరమున కేగెదను.—అమ్మా! పరలోకమున దుఃఖము లేదందురు, నిజమేనా?— ఆ లోకమున మేరుపర్వతమున్నదట; ఆ పర్వతపాదప్రక్షాళన మొనరించుచు నాకాశగంగ దివ్యానందస్రవంతి పారుచుండునట. ఆ యానందప్రవాహమునఁ బరమహంసలు వివిధవిలాసవిరచనావినోదమునఁ దేలియాడుదురట! నే నా పర్వతశిఖర మారోహింపఁగలనా ? ఆ హేమపర్వతశృంగమున మేఘచ్ఛాయలోఁ గూర్చుండి రఘురామస్మరణ—"

ఆనందపారవశ్యమున గంగ మతి మాటాడఁజాలక పోయెను. ఆమె నేత్రములు దివ్యకాంత్యుజ్జ్వలములై, యుషానమయనక్షత్రములవలె మెఱయుచుండెను.

"అమ్మా! మృత్యుసంస్మరణమున నా హృదయము సుశీతలమై పోయినది. ఆ దేవీ సుశీతల హస్తస్పర్శనమున నే ననంతసుఖ మనుభవింపఁగలను. మృత్యుదేవత యమృతస్వరూపిణి: జీవనపథము సంకుచితము; కంటకమయము. మృత్యుపథ మనంతము; పుష్పాలంకృతము. శారదాంబ మరణానంతర సుఖములను గుఱించి యెన్నిమారులు నాతోడ ముచ్చటించి యుండెను. ఆ సమయమందు నా హృదయము భయాకులితమగుచుండెడిది. నేఁ డేటికో మరణస్మరణ మహానందదాయకముగా నున్నది. మృత్యురాణి దుఃఖయామినీ నివారిణి." అని గంగ యున్మాదినివలె నవ్వెను.

"అమ్మా! నన్ను నవ్వుల బండియని మా యిరుగుఁ బొరుగువారు

పిలుచుచుండిరి. నా శైశవమున నేను నవ్వనిక్షణము లేదు. ఆహా! ఎన్నాళ్ళకు నా రల నవ్వఁగలిగితిని! నా ముఖమున నవ్వు ముకుళింపకపూర్వమే నేను మృత్యుప్రాప్త నగుదునుగాక!" అని యామె హాసోల్లాసినియై పోయెను.

"గంగా! నీ హృదయమిప్పుడు నిలకడగా లేదు! స్థలాంతరమున కనిన లోకాంతరమున కని నీ వేటి కన్వయించితివి?" అని శేషమ్మ యించుక గంభీరముగా ననియెను.

గంగ భ్రూభంగపూర్వకముగా,

"స్థలాంతరమునకు,—లోకాంతరమునకు,—రఘురాముని దృష్టిపథమున కెడముగా,—అమ్మా! ఏమంటివి?—నాయన్వయక్రమము సరిగా లేదనియా?—రఘురాముఁడు లేని స్థలమెచ్చట కలదు? నా దృష్టిపథమున కాతఁ డెడమగునా!" యనియెను.

## ౮

### నిరాఘాటకవితాధోరణి

ఫోర్టు సెయిన్టు జార్జిగజిట్ లోఁ బరీక్షాఫలితములు ప్రకటింపఁబడెను. ఉత్తీర్ణవిద్యార్థుల నామావళీశిరోభూషణముగా రఘురామమూర్తి పేరు ముద్రితమై యుండెను.

విజయవార్తాశ్రవణమున వసంతరావు పరమానందభరితుఁడై,

"రఘురామా! నువ్వింక బి. ఏ తరగతిలో చేరవాలి. విజయనగరం మహారాజావారి కాలేజీలో హిస్టరీ బాగా చెప్తారట; నీది ఆ గ్రూపే కదూ?" అనియెను.

"నేను మద్రాసునగరమున కరుగ సంకల్పించితిని. బి. ఎ. ఆనర్సు

పరీక్షకుఁ జదువవలయునని నా యాశయము ప్రెసిడెన్సీ కాలేజీలోఁ జేరుటకు నేఁ బ్రయత్నించెదను." అని రఘురామమూర్తి పలికెను.

"అంతదూరంలో ఒంటరిగా ఉండగలవా? నీ ఇష్టానికి ఎదురు చెప్పను; కాని రాకపోకలకు చాలా వ్యయప్రయాసాలు అవుతాయి." అని వసంతరావు సాలోచనపూర్వకముగా ననియెను.

జానకి ప్రక్కగదిలోఁ జందనపు బొమ్మను నలంకరించుచు వారి కథోపకథన మాలించుచుండెను. ఆ బాలికాహృదయ మనిర్వచ నీయ భయావహమై పోయెను.

మధ్యాహ్నభోజనానంతరము కామక్క వంట యింటి యరుగుపై జంతికలు చేయుచుండెను. జానకి దేవకిననుతిమున నాసీనయై జడ వేయించుకొనుచుండెను.

"రాజుగారు మెడ్రాను వెళతారు,
రాణి కోసం సిల్కుచీర తెస్తారు!"

అని కామక్క వికటస్వరమున సంగీత మారంభించెను.

"నీ కవిత్వం బంగారం కాను-పసిపిల్లని ఎందు కేడిపిస్తావే!" అని దేవకి దరహాసితవదనయై కామక్కను మందలించెను.

"అమ్మా! కామక్క మంచిది కాదు. నన్నేడిపించుటకే ప్రయత్నము చేయుచుండును."

"జానకీ!" యని కామక్క యేది యోపనియున్నటులఁ బిలచెను. అమాయిక జానకి,

"ఎందుకు?" అనియెను.

"దేవకమ్మా! జానకికి నామీద కోపంలేదు. చూడు, నేను పిలవ గానే పలికింది." అని కామక్క తన నిరంకుశకవితాధోరణి నారం భించెను.

"రాజుగారొక్కరే కారు కారు,

రాణిగారి సహితం వెళతారు."

"అమ్మా! చూడే!" అని జానకి తల్లియొడిలో శిరమిడి యేడువసాగెను.

"కామక్కా! ఊరుకో నే! దాన్ని ఏడిపిస్తేగాని నీకడుపు నిండదు."

"నే నేడువ మన్నానా? నే పాడుతూ ఉంటే సంతోషంగా చిందులు తొక్కకూడదూ? జానకీ! పాటలంటే నీ కెంతో సరదా అంటావు; సాయంత్రం వెండిగిన్నెలో పాలు అన్నం కలిపి, చంద్రుణ్ణి పిలుస్తూ నీకు తినిపించేదాన్ని, గ్యాపకం ఉందా? కడికో పాటపాడే దాన్ని కానూ? బొజ్జనిండా బువ్వతినిపించి ఉయ్యాల్లో పడుకో పెట్టే దాన్ని. అప్పుడు పాడిన జోలపాట గ్యాపకం ఉందా?

"నాకు జ్ఞాపకము లేదు." అని జానకి మధురాశ్రుకలిత నేత్రములతో నా నృగాలమును ఒలకించుచుం బలికెను.

"పాటలు వినడమే కాని గ్యాపకం ఉండదు నీకు-" అని మఱిగిన నూనెలో జంతికలు వేయించుచు కామక్క పాడనారంభించెను:

"ఏడవకు ఏడవకు వెఱ్ఱినాగమ్మ,
ఏడిస్తే నీకళ్ళు నీలాలు గారు,
నీలాలు గారితే నే జూడలేను
పాలైన గారవే బంగారు కళ్ళు ॥జోజో॥
"జోలల్లు పాడితే బాలులకు నిద్ర,
నాగసరం పాడితే నాగులకు ఆట,
జోలమామిడి పళ్ళు దూరానగలవు,
జోడించి తెస్తాడు అమ్మాయి మామ ॥జోజో॥
"సీతపెళ్ళికి రాజు చేసేయుత్నాలు
అందఱు రాజులు అరుదెంచినారు,
కౌశికమునివెంట కమనీయకీర్తి,
సీతపెళ్ళికి వచ్చె శ్రీరామమూర్తి ॥జోజో॥

"ఈ పాట నా కక్కఱలేదు అమ్మా! చూడవే!" యని జానకి తల్లి పైటకొంగుతోఁ గన్నులొత్తుకొనియెను.

కామక్క భయదాట్టహాసపూర్వకముగా,

"నువ్వు పాడమన్నా పాడను. జంతిక మాడిపోయింది!" అని తొందరగాఁ దన కార్యమున నిమగ్న రాలాయెను.

## ౬

### శేష సమ్మిళనము

రఘురామమూర్తి శ్వశురగృహమునుండి బయలుదేరి నిజగ్రామమునకు మరలివచ్చెను. యశోదమ్మ యా కమనీయమూర్తినిఁ జూచి,

"నాయనా! అందఱూ క్షేమంగా ఉన్నారా?" అని యడిగెను.

ఆతఁడు మాతృపదములను గన్నుల నద్దుకొని,

"అమ్మా! అందఱును క్షేమముగా నున్నారు." అని యుత్తరమొసఁగెను.

సాయంసమయమున నాతఁడు వీథియరుగుపై నిలువఁబడి యుండెను. శారదా నిర్యాణమును గూర్చి యాతని హృదయము దుఃఖించుచుండెను. ఆ జన్మాంతము దుఃఖానుభవమున కవతరించిన యానిష్కళంకచరిత్రను దలంచి ప్రగాఢచింతాభరమున నాతఁడు సాశ్రునేత్రుఁడై పోయెను. ఆ విదుషీసాంగత్యమున గంగ మహాంధకారమున వెలుగుఁ జూడఁగలిగెను. ఆమె పదచిహ్నముల ననుసరించి గంగ జీవన మార్గమున నగ్రసురాలగుచుండెను. గంగాదృష్టిపథమున నామె మహాదాదర్శస్వరూపమున విరాజిల్లుచుండెను. ఆదర్శవిహీన జీవన మధఃపతన మొందును. గంగాపతనమాతఁ డనివారితముగా భావించు

చుండెను.

ఆ సమయమున నీలాకాశతలమున నల్లకొండలవలె రెండుమూఁడు మేఘము లుదయమయ్యెను. సంజచీఁకటిలో మేఘచ్ఛాయలీనమయ్యెను. గంగ విషాదమలినస్వరూపిణి యాచీఁకటిలో గృహోన్ముఖురాలై వచ్చుచుండెను.

రఘురాముఁ డామెను ప్రేమావలోకమునఁ దిలకించి, "గంగా! గంగా!" యని పిలచెను.

గంగ యా మధురవాణి నాలించి చకితయై మార్గమధ్యమున నిలువఁబడి పోయెను.

రఘురామమూర్తి యామెను సమీపించెను. గంగ నిలువున వణకి పోవుచుండెను.

"గంగా! నీ హాసమయస్వరూపము నుపసంహరించితివా? సుఖశ్రీ మండితముఖమున విషాదలాంఛన మేమి?" యని రఘురాముఁ డడిగెను.

"రామా! శారదాంబ పరలోక మలంకరించినది!—" అని యామె కన్నులఁ జేలాంచలముఁ జేరిచి యేడ్చెను.

"వినియుంటిని.—ఆ పుణ్యశీల మఱి యీ లోకమునకు రాదు—నీ విప్పు డెందుండి వచ్చుచున్నావు?"

"శేషమ్మ గృహమునుండి."

"ఆమె యెవరు?"

"బాలికా పాఠశాలలోఁ బ్రధానోపాధ్యాయిని."

"ఆమెతో నీ కెట్లు పరిచయ లాభము కలిగెను?"

"నన్నామె పిలచి యుండెను."

"ఉద్దేశమేమి?"

"చదువుకొనుటకు."

"గంగా! నే నీ మాసాంతమున మదరాసు నగరమునకుఁ బోయెదను." గంగాహృదయము వ్యాకులపూర్ణమై పోయెను.

"రామా! తిరిగి యెప్పుడు వచ్చెదవు?"

"ఇంతలో రాఁ జాలను"

"భేరీ మీద జోకొట్టినట్లు నడివీథిలో సరససల్లాపాలేమిటి?" అని వికవిక నవ్వుచు వేంకటాచార్యులు వారిని సమీపించెను.

గంగామస్తకమున నశనిపాతమయ్యెను. ఆమె వడివడి నడచి పోయెను.

"అయ్యా! నీ వెవరు? అసభ్యునివలె మాటాడుచుంటివేమి?" అని రఘురాముఁ డావైద్యునితో ననియెను. ఆతని హృదయమునఁ గోపాగ్ని రవులుకొనుచుండెను.

"నే నెవ్వరైతే మీ కెందుకు? ఆ కులటతో సభ్యత్వ మెరిగే వాళ్లు మాట్లాడరాదని విన్నవిస్తూ ఉన్నాను." అని యాచార్యుఁడు సవినయముగా ననియెను.

"కులట యెవరు? గంగ కులటయా! అయ్యా! నీవు మహాపాతక మొనరించితివి. నీ యపరాధము క్షమింపరానిది."

"సత్పురుషులకు ఉపకారం చెయ్యడం అపరాధం ఐతే నేను క్షమాప్రార్థన గావిస్తూ ఉన్నాను."

"నీ పలుకులు నా కర్థము కాలేదు నీ యుద్దేశమేమి?"

"గంగ చరిత్రం నాకు ఆమూలాగ్రం తెలుసును. శారదాంబ జీవించి ఉన్నదినాల్లో గంగ సన్మార్గంలో వర్తిస్తూ ఉండేది. శేషమ్మ గుమ్మంలో కాలు పెట్టి చెడిపోయింది."

"ఎట్లు?"

"శేషమ్మ గంగను అమ్మిందికి ప్రయత్నం చేస్తూఉంది"

"గంగ కీ మాత్రము మాయ తెలియదా?"

„తెలీకేమి? తెలిసే అంగీకరించింది."

„అంగీకారము దేనికి?"

„పెళ్ళికి. పెళ్ళిఅంటే తుళ్లిపడేది. ఒళ్ళు తెలీక ఒప్పుకుంది."

„ఎవనితోఁ బరిణయము?"

„తెలుసుసిన వెధవ వేణుగోపాలంతో. హరోంటేలు ముండాకొడుకు దాని కంటికి మన్మథుడువలె పోయాడు."

„అమ్మా! నీమాటలు నీహృదయమాలిన్యము ను బ్రకటించుచున్నవి. గంగా చరిత్రను నీ వెఱుంగవు. ఆకోమల హృదయమునఁ బైశాచిక భావములు కలుగనేరవు. నిందారోపణ రతుండవు. నీతోడ మాటాడ రాదు" అని రఘురాముఁడు నడచిపోయెను.

వేంకటచార్యుఁడు సవితర్కముగాఁ దలవంకించి,

„నాకును గంగకును మధ్యపెద్దగోడలాగ ఉన్నాడువీడు. వీడి పని పట్టించకుంటే నాకోరిక నెరవేరదు." అని యనుకొని రజనీభూతము వలె నడచిపోయెను.

# ౧౦

## లోకాపవాదము

యథాకాలమున రఘురామమూర్తి గృహాభ్యంతరమున నమ్మలక్కలు సమావేశమైరి.

„యశోదమ్మా! నువ్వేమన్నా అనుగాని గంగ మంచిదికాదు. నీకొడుకు మెత్తనివాడు. దాని వల్లోపడితే మరి అడుగుతావా?" అని వెంకమ్మ మెల్లఁగు వంచిపలికెను.

„అమ్మా! నీ కెందుకీ అనుమానం? గంగకూ మావాడికీ ఎట్టి

సంబంధంలేదు. వాడిది జాలిగుండె. దాని అవస్థకి చాలాజాలిపడుతూ ఉంటాడు.—అమ్మా! అంతచక్కనిపిల్ల ఏడుస్తూఉంటే జాలిపడని వాళ్లు ఎవరు?" అని యశోదమ్మ యనెను.

"బాగుంది! దానిగోటు, దానిసీటుచూస్తే మీఅందరికి జాలి కలుగుతూఉంది. దాన్ని చీరీవాలని నాకు కోపంకలుగుతూఉంది. ముసిలిముండ కాంతంమ్మ దాడలు నొక్కుకొని మూల కూర్చుందిగాని నావంటి దైతేనా, కాళ్ళువిరక్కొట్టి ఇంట్లోకట్టిపెట్టి ఉంచనూ?" అని రంగక్క తల ముసుగు సరదుకొనుచుఁ బలికెను.

"ఏమో, నాకిన్ని తెలీవమ్మా! మొన్న రాత్రి వైద్దుడు—ఆచార్లు మాఇంటి కొచ్చాడు. మాటమీదమాట వచ్చి దాని సంగతంతా చెప్పాడు. దాన్ని లేవతీసుకొని మీ రఘురామమూర్తి చెన్నపట్నం వెళతాడట. అమ్మా! నువ్వుమంచిదానివి. నీ చెవులో ఈ సంగతి వెయ్యకపోతే, ఉత్తరోత్తరా నువ్వే మమ్మల్ని నిందిస్తావు." అని సుబ్బమ్మ నిగూఢ రహస్యభేదన మొనరించిన దానివలె గంభీర ముద్రాంకితయై పలికెను.

సాయంసమయమున రఘురామమూర్తి కందుక క్రీడారంగమునుండి మరలి వచ్చెను. యశోదమ్మ వెనకింటిలో వంటచేయుచుండెను. రఘురాముఁడు ఘుర్మాంబుసిక్త వస్త్రము లెడలించి, చంగావిపంచ కట్టుకొని స్నానముఁ జేయ పెరటిలోని కరిగెను. మజ్జనానంతరమాతఁడు భోజనమునకుఁ గూర్చుండెను. యశోదమ్మ రుచ్యపదార్థము లొకపళ్లెరమున వడ్డించెను. రఘురాముఁడు భోజన మొనరించుచు,

"అమ్మా! నీ యమృతహస్తదత్తమగు మహాప్రసాదము తిరిగి యెన్నిదినములకు లభించునో? వాత్సల్యానురాగ పూరిత హృదయముతో, "రఘూ!" యని నన్నుఁ బిలుచుచుందువు. తల్లీ! ఆ మధుర స్వరము మఱల నే నెన్నటికి వినఁ జాలుదునో? తేఁపే ప్రయాణ

ముహూర్తము నిశ్చితమైనది. అమ్మా! నిన్ను విడిచిపోవుటకు నా హృదయ మొప్పకున్నది." అని యనియెను.

"రఘూ!—" అని యామె యశ్రులు రాల్చెను.

"అమ్మా! నీ విట్లేడ్చిన నేనెట్లు ప్రయాణోన్ముఖుఁడను కాఁగలను? నీవు నాకు ధైర్యము చెప్పవలయునుగదా? నీవే యిట్లుదుఃఖతురాలవై పోయిన నేను నాప్రయత్నమున హృదయార్పణ మెట్లు కావింపఁగలను?"

"నాయనా! నువ్వు ఒంటిరిగా వెళతావా?"

"అమ్మా! నీవు నావెంట రాఁగలవా? ఆ మహానగరమున నీ సుఖజీవనమున కంతరాయములు గలుగునేమో?"

"నేను రాలేను—రానుకూడాను.—కాని, రఘూ, నొవ్వొక్కడవే వెళతావా?"

"మరి యెవ్వరున్నారు నాతోడ వచ్చుటకు?"

"ఇంకెవ్వరూ లేరా? నీ ప్రయాణంగూర్చి లోకు లేమనుకుంటున్నారో విన్నావా?"

"లేదు—"జాజిపూవుల ప్రోవువలెనున్న యన్నముపై వేసినచేయి కదల్పక రఘురాముఁడు, "నేను వినలేదు. లోక మేమనుకొనుచున్నది?" అని యాతురతతో నడిగెను.

"తండ్రీ! నీ పెళ్ళాము చిన్నపిల్ల. దానికి ఏలోకం తెలీదు. వెట్టి బాగులది. అది యేడ్చిందంటే మన వంశం అంతరిస్తుంది. మనకిక గతులుండవు. కులకాంత కన్నీళ్ళుపడేచోట లక్ష్మి నిలవడలేదు."

"అమ్మా! నీవేమనుకొనుచున్నావు? నేను కఠోరకర్ముఁడనైతిననియా తలంచు చుంటివి? కులసతీ నయనముల బాష్పకలుషిత మొనరింప నేనెట్టియపచార మొనరించి యుండలేదు."

"నాయనా! నీ మంచి చెడ్డలు నాకు తెలీవా? నువ్వు ఇంతవఱకు

ఏ అకార్యమున్నూ చెయ్యలేదు.—కాని, ఈ ప్రయాణంలో—” యశోదమ్మ సంశయ డోలాయమానహృదయయై యూరకుండెను.

“ఈ ప్రయాణములో నేమి?” అని రఘురామమూర్తి యుద్వేగ హృదయుఁడై యడిగెను.

“నాకు నమ్మకంలేదు. కాని శోకం అనుకుంటూ ఉంది”

“అమ్మా! నాయందు నీకింత దాపరికమేమి? శోక మేమనుకొను చున్నది? నా వర్తనమున వక్రత్వముండిన దిద్దుటకు నీకు సంపూర్ణాధి కారమున్నది. నా జీవనప్రదాయినివి; నా భావికల్యాణ విరచనా నిర తవు. తల్లీ! నా జీవనమును గళంకిత మొనరించి నీ యవ్యాజ్యవాత్స ల్యమును బోఁగొట్టుకొనసాహసింతునా? నాయపరాధమేమి?”

“గంగను తీసుకొని చెన్నపట్నం వెళతావని నీతలమీద నీలాప నింద పడింది.”

రఘురాముఁడు ప్రకంపితగాత్రుఁ డాయెను. ఆతని కాగనబంధుర పదార్థనిచయ మరుచికరమయ్యెను. భయంకరలోకాపవాద మాతని మస్తకము నణచివేయుచుండెను. ఆతఁడు మాతృదేవి ముఖమును మఱి చూడఁజాలకపోయెను

“అమ్మా! లోకులే మనుకొనినను నిజము చెప్పెదను. వినుము. నేను గిరాతుఁడనుగాను; కులసతీకోమలహృదయమున విషబాణప్ర యోగము నే నూహింపఁజాలను. అనాథబాలికా జీవన లతికను ద్రెంపి వేయఁజాలను—లోకాపవాదమున నెట్టి సత్యమును లేదు. భగవతీ స్వరూపిణివి; నీ దివ్యసముఖమున నే నన్నృతమాడిన నా మస్తకము సహస్రఖండములై పోవునుగాక!” అని యాతఁడశ్రుప్రవాహమును దుడుచుకొనుచు సంతప్తుఁడై పోయెను.

“రఘూ! నువ్వేడిస్తే నేను చూడలేను. ఊరుకో, నాయనా!” యని యశోదమ్మ చేలాంచలమున నాతని ముఖమును దుడిచి,

«దానితో నీకున్న చనువును పట్టి లోకమట్లా అనుకున్నది. గంగ మీద నీకు ఎంతో దయ. ఆ అమాయికురాలి మీద ఎవరికి దయ కలగకుండా ఉంటుంది? ” అనియెను.

౧౧

పునర్వివాహ ప్రసంగము

“రఘురామమూర్తిని నీ పెదినమునఁ జూచితివా?” యని శేషమ్మ గంగ నడిగెను.

«లేదు—ఆతని ముఖారవిందమును జూడవలయునని యాశకలిగెను; గాని నితాంతభయవిహ్వలనై గృహాంతరమునఁ దలదాచుకొంటిని. అమ్మా! నీవు నిర్వచించినటులు నే నిప్పు డగ్నిపరీక్షకు లోనైతిని. నా యేకాంత హృదయమున నే నేమధురమూర్తినిఁ బూజించుచుంటినో యాసుఖస్వరూపమును నేను గన్నెత్తి చూడఁజాలకున్నాను!”

«నీ యాత్మ దౌర్బల్యమువలననే యా పుణ్యకీర్తి నిందితుఁడై పోయెను.”

«అమ్మా! నీ మాట నిజముగునా? ఎవ్వని యభ్యుదయావాప్తికై కోటిదేవతలను నిరంతరము మ్రొక్కుచుందునో, యా మహాత్ముఁడు నా కారణమున నిందాపాత్రుఁడై పోయెనా? నిశ్చలప్రార్థనా బలమున మానవునకు సాధ్యముకాని దేదియు లేదందురు; నా ప్రార్థనలలో విపరీతార్థము, భయంకరానుభవము, విదితమయ్యేనేమి?— అమ్మా! నీ పదముల వ్రాలి నిన్నొకటి యర్థించెదను; అనుగ్రహింపవా? ”

“తల్లీ! నీ యానంద కామనాలోలనగు నే నెట్లు నీ యభీష్టమును నిరాకరింతును? ”

„అమ్మా! నీయమృతహ_స్తములతో నాకు విషప్రదానముఁ గా వింపుము.

„గంగా! నీవు మరణానుభోగమూహింపరాదు. నీవు విషపాన మొనరించిన మహావిషమపరిణామ మగును."

„ఎట్లు? "

"నిన్నుఁ దీసికొని రఘురామమూర్తి మద రానుపోవునని జనరవము లోకమున నిండిపోయినది. నీ విప్పు డాత్మహత్య కావించుకొందు వేని లోకనింద స్థిరపడి పోవును. ప్రణయ పరిత్యక్త గంగ యాత్మ హత్య కావించుకొనియెనని లోకము రఘురాముని యందుఁ గఠోర భావమారోపించును."

„అమ్మా! నీ మాట నిజము! నేనింకేమి చేయుదును? నాకుగత్యం తరమున్నదా? — నేను నా యింటిలో నిలచిపోయిన! "

„రఘురాముని విరహమున నే కాంతవిహార మభిలషించితివని లోకమనదా ?"

„అవును. మఱియేమి చేయుదును? అమ్మా! స్థలాంతర నివాస ముచితమని నీవొకప్పుడు నా కుద్బోధించితివి. నేనీ నగరపరిత్యాగముఁ గావించిన? "

"రఘురాముని ప్రణయ మర్థించి మదరాను పోయియుండునని లోకము విశ్వసించును. "

"నన్నేమి చేయుమందువు? నేనిపుడు పంచాగ్నిమధ్యమున దగ్ధమై పోవుచున్నాను!"

"గంగా! విషపాత్ర నర్థించితివి; నీ హ_స్తమున నమృతకలశము పెట్టెదను."

"అమ్మా! నీ యభిప్రాయమును నేను గ్రహింపఁజాల కున్నాను."

"రఘురామమూర్తికి నీవలనఁ గలిగిననింద తొలఁగింప వలయునని

నీకు సంపూర్ణాభిలాష యున్నయెడల నీవు నేను జెప్పినటు లొనరింప వలయును."

"ఎట్లు?"

"నీవు పునర్వివాహమును జేసికొనవలయును."

గంగాహృదయము విదీర్ణమైపోయెను; భూతలమునఁ గ్రుంగిపోవు చున్నటు లామె భయభ్రాంత యగుచుండెను.

"గంగా! నీవేటికి భయపడియెదవు? ఆత్మస్వాతంత్ర్య ప్రయోజనమును, ఆత్మబలప్రయోగము వలన సాధింతునని కదా నీవు వక్కాణించి యుంటివి?—సమాజమునకు భయపడుచుంటివా?"

"అమ్మా! నా భయ మదికాదు. నిందితురాలనగు నన్నెవరు వివాహమగుదురు?"

"ఓహో! అదియా నీ భయము?—నీ యంధవిశ్వాసమును నేనభినందింపఁజాలను!" అని శేషమ్మ యాత్మోల్లాసమణచుకొనుచు,

"గంగా! పాలలోఁ దోడు వేయుట మఱచితిని. ఇప్పుడే వచ్చెదను. ఇచ్చటనే కూర్చుండుము." అని పలికి వంటయింటివైపుఁబోయెను.

## ౧౨

### పెండ్లికుమారుడు

గంగ యేకాంతమనస్కయై యటులనే కూర్చుండి యుండెను. తన మూలమున రఘురాముని స్వచ్ఛచారిత్రము కళంకిత మైపోయినది. ఆ కళంకమును దుడిచివేయుట కామె బాధ్యురాలు.

"రామా! నీవు నిజముగా శ్రీరామచక్రవర్తివి; పరమోత్కృష్ట వేద మంత్ర పూర్వకముగా, త్రిజగత్పూజనీయుఁడగు నగ్ని దేవుని సాక్షిగా

నీవు వివాహమాడిన జానకి సీతామహాసాధ్వి. మీ ప్రణయ ప్రపంచమున నేను రాక్షసినై యవతరించితిని. నా యపరాధమును స్వీకరించి నే నిప్పుడు తిరోహితురాల నయ్యెదను—ఆహా! ఒక్కసారి నందనవన భూమినుండి తామిస్రమునఁ బడిపోవుచుంటిని! సముద్ర గర్భమునఁ దరంగములు విజృంభించి తమ్ముఁదామే మ్రింగుకొనునటుల నా హృదయదుఃఖము నా హృదయమునే మ్రింగివేయుచున్నది—రామా! నీ యకళంకగౌరవవర్ధనార్థము, నీ యభిమాన రక్షణార్థము, నీ యభ్యుదయ శ్రీవిడంబన కొఱకు, నీ జీవనమార్గమున నే నిప్పుడ స్తమింప సంకల్పించితిని. నీపైఁగల యకృత్రిమస్నేహప్రేమ ప్రదర్శనపూర్వకముగా నేనిప్పుడు పునర్వివాహమును జేసికొందును!" అని యామె నిర్విణ్ణహృదయమున ననంతయాతన ననుభవించుచుండెను.

వీధితలుపు మెల్లగాఁ దెఱచి విలాసపురుషుఁడు వేణుగోపాలము లోనఁ బ్రవేశించెను.

గంగ యా యువకుని ముఖమునుజూచి పాపస్వరూపమును జూచి నటుల భయపడియెను.

„శేషమ్మ యింట్లో లేదా!" అని వేణుగోపాలరావు మందస్మితుఁడై యడిగెను.

„లోపలి కేగినది.

„గంగా! నీతో మాట్లాడాలని ఎంతో ప్రయత్నం చేస్తూ ఉన్నాను."

„నాతోడ నీ కేమి పనియున్నది?"

„పనిలేకపోతే ప్రయత్నం ఎందుకు?"

„ఏమిపని?"

„నా మనస్సులోమాట నీచెవిని వేదామని."

గంగ బాలహరిణమువలెఁ జకితయై యాతని ముఖమును బరిశీలన పూర్వకముగా నుపలక్షించి,

"ఏమందువు?" అనియెను.

"నీ కటాక్షంకోసానికి ఎదురుచూస్తూ ఉన్నాను—నేను ఇంకా పెళ్ళిచేసుకోలేదు."

"నీ వివాహకార్యమున నా యాటంకమేమి?"

"నువ్వు తిరస్కరించకపోతే నీ ఆటంకం ఏమీ ఉండదు."

"నిన్ను నేనేల దిరస్కరింతును?"

"నీనోట చల్లనిమాట విన్నాను; నేను చాలా భాగ్యవంతుణ్ణి. నువ్వు తిరస్కరించకపోతే నేను వివాహితుణ్ణి."

"నీ యుద్దేశమేమి?"

"నిన్ను పెళ్ళాడవలెనని."

"నే ననాథను- నీవు బంధుసమాజమున మెలఁగవలసినవాఁడవు."

"నువ్వు అనుమతిస్తే, అనుగ్రహిస్తే, సమాజం గిమాజం నా కెందుకు? నన్నెవరు అడ్డుతారు?"

ఆ సమయమున శేషమ్మ యటకు మరలివచ్చెను.

"వేణూ! ఎప్పుడు వచ్చితివి? అచ్చటఁ గూర్చుండుము." అని యామె యాతని కాసనముఁ జూపెను.

వేణుగోపాలము ఉచితాసన మలంకరించి,

"అమ్మా! ఈ సొమ్ము నీదగ్గరఉంచు." అని జేబులోనుంచి యైదు వందల రూపాయలనోట్లు తీసి, యామె కందిచ్చెను.

శేషమ్మ యాధనమును గైకొని,

"వేణూ! నీ వివాహదినమున నీప్రేమభాగిని కీధనము సమర్పించెదను." అని నవ్వుచుఁ బలికెను.

"నేను కోరిన భాగ్యలక్ష్మి నాకు సంప్రాప్తిస్తే ఈ ధనమేనా?— దాని మీద కనకవర్షం కురిపించనూ? నాకు మొన్ననే కలకత్తా బ్యాంకులో మేనేజరీ ఉద్యోగమైంది. నెలకు మూడువందల రూపాయలు

జీతంఇస్తారు. పెళ్లి చేసుకొని, ఉద్యోగంలో చేరదామనుకుంటూ ఉన్నాను."

"పిల్ల నిశ్చయమైనదా?"

"నువ్వే నిశ్చయపరచాలి."

"నీవు చాల తెలివైనవాడవు వేణూ! రాజమహేంద్రవరములో మీ నాన్నగారు ఉద్యోగముచేయుచున్న దినములందు నీవు చాల చిన్నవాడవు; నేను ట్రయినింగు పాఠశాలలో జమవు కొనుచుండెడి దానను. మీనాన్నగారికి నాయందు పుత్రికావాత్సల్యము. నీ కక్షరాభ్యాసము నేనే చేయించితిని. నాటినుండి నేటివఱకు నీ విద్యావిషయమున నేను పొందిన పరిశ్రమకు నాకేమి పురస్కారము లభించినది?- పెండ్లి విషయమునం గూడ నేనే తలపెట్ట వలయునా?"

"అమ్మా! నువ్విలా అనకూడదు. నేను పనిలో ప్రవేశించగానే నిన్ను ఉద్యోగం చేయనిస్తానా? నాకు విద్యాబుద్ధులునేర్పి, ఇంతవాణ్ణి చేసినందుకు, నిన్ను మరచిపోతానా! కలకత్తాలో పెద్ద రెండుభవంతుల మేడ అద్దెకు పుచ్చుకొని, వాకిట యెండ నీతలమీద పడకుండా నీకు సేవ చెయ్యనూ!"

"వేణూ! పిల్లను స్థిరపఱచు భార మెవ్వరిదైననేమి? నీవు యువకుండవు; చిన్నపిల్లను చేసికొనరాదు."

"ఎదిగినపిల్ల మనకులంలో దొరుకుతుందా? బాల్యవివాహాలు మన దేశంలో పెచ్చుపెరిగిపోయాయి. చదువుకున్న వాళ్ళు ముసిలిముండల ముసుగు కదిలితే జడుస్తారు. వాళ్ళకి స్వతంత్రం లేదు. ఎమ్మేలు బియ్యేలు ప్యాసైనవాళ్ళు బాల్య వివాహాలంటే పడి నస్తారు. ముక్కుపచ్చలారని పసిపిల్లలికి పెళ్ళేమిటి? అందుచేతనే అనాధలకు పుట్టిల్లుఐపోయింది ఈ హిందూదేశం."

"సమాజగౌరవమును నీవు మన్నించవా?"

„సమాజం గిమాజం నాకు తెలీదు. అనాథబాలికలసంఖ్య తగ్గించిందికు ప్రయత్నం చెయ్యాలి అనుకుంటూ ఉన్నాను.”

„అది యెట్లు నీకు సాధ్యమగును?”

„స్త్రీ పునర్వివాహాలవల్ల.”

„వేణూ! ఈ యాడంబరములు కెక్కడికి? చేయుటకంటె చెప్పుట సులభతరము: అస్పృశ్యత మాడరాదని ఘోషింపవచ్చును; అవకాశ మొదవిన వాచావిశుద్ధి కంజలిప్రదానము!”

„నేను అందరిలాగా నిలకడలేని వాణ్ణికాను. అన్నమాట తప్పను. చెయ్యలేనిమాటలు చెప్పనే చెప్పను.”

„అటులైన నీవిప్పు డవివాహితుఁడవుకదా? అనాథబాలికను బెండ్లియాడరాదా? అది లోకమున కాదర్శప్రాయముగా నుండును.”

„అమ్మా! ఈమాట నువ్వు చెప్పాలా? తగినపిల్ల దొరికితే బహిరంగంగా పెళ్ళిచేసుకుంటాను.”

„స్థిరసంకల్పమే నీకుఁ గలదేని, యుక్తవధూప్రాప్తి కేమియభ్యంతరముండును? నీవంటిసద్గుణాలంకృతుఁడు, ఆగర్భశ్రీమంతుఁడు, ప్రయోజనకారిపురుషుఁడు సజ్జనసంకల్పనిరతుఁడేని, మా గంగయే యాభాగ్యభోగమున కనుమతించును!”

„ఆ బంగారం కొండ నాకు లభిస్తుందా?”

శేషమ్మ గంగాహస్తమును నిజకరమునఁ గీలించి,

„అమ్మా! నీ యిష్టమేమి?” యని యడిగెను.

గంగ మానవతియై, యెంత యణచుకొనినను దుర్నివారమగుచు దుఃఖము పొంగ, నశ్రువర్షమునఁ దడిసిపోయి, వెక్కి వెక్కి యేడ్చెను.

# ౧౩

## సముద్రఘోష

తిరువల్లిక్కేణిలో శ్రీపార్థసారథిస్వామి దేవాలయ సమీపమున నొక మేడ నద్దెకుఁ దీసికొని, రఘురాముఁడందు నివాస మేర్పఱచుకొని యెను. అతఁడు ప్రెసిడెన్సీ కాలేజీలో, బి. ఎ. (ఆనర్సు) తరగతిలోఁ జదువుచుండెను.

ఒక నాఁటి సాయంసమయమున నాతఁడు సముద్రతీరమున సైకత వేదికపైఁ గూర్చుండి యుండెను. శీతలవాయు సేవనార్థము నగర వాసు లాతీరభూమి నాశ్రయించి యుండిరి. మధురహాసవిలసిత యువతి మండలి, దైనిక పరిశ్రమానంతరము విశ్రాంతిఁగోరు ఉద్యోగ జన మండలి, జల సిక్తసైకతమును ప్రోగుచేసి లీలాగృహనిర్మాణ వినోదు లగు బాలికా బాలకమండలి, యాపుణ్యవేలాభూమి నలంకరించి యుండిరి. బెస్తవారు క్షుద్రనౌకానివిష్టులై తరంగశ్రేణిలో నుయ్యాల లూఁగుచుండిరి.

రఘురాముఁ డాయానందదృశ్యమును దిలకింపలేదు వినీలతరంగ మాలా శోభితసముద్రగర్భమును విలోకించుచుండెను. సువిమల, సింధుసమీరణ మనుక్షణము దశదిశల నిరుద్దేశ—విభ్రమణ— మొన రించుచుండెను. రఘురాముఁ డాపవనప్రమోదమునఁ బాల్గొనలేదు. ఆతఁడు మహోర్మిఘోషణార్థమును హృదయంగమముఁ గావించు కొనుచుండెను. ఈ నిరంతరఘోషకుఁ గారణమేమి? విపులమేదినీముఖ మవలోకించి సముద్రలక్ష్మి యేమనుచున్నది?

„ఓ మహీ! నీవు నా కరమునఁనిమిడియున్నావు! నీయుత్థాన పతన నే ననిమిషనేత్రనై విలోకించు చున్నాను. ధరణీ! నీవు నాతనయవు. ధనధాన్యసమృద్ధి, సువర్ణమణిముక్తాయోగము, నీకెవరివలన లభ్యము?

నా యనుగ్రహమున నీవు విభవోపేతవు! మహాపర్వతములు నా యం దుద్భవించి, చూర్ణరేణుప్రాయములై నా యందాశ్రయ స్థానము వడ యుచున్నవి. నా కారణమున ప్రాణికోటికిఁ బ్రాణధారణ యోగ్యత లభించినది; నేను లేకుండిన నీవు మృత్యుభీమిగాచ్ఛాదితవై యుం దువు. నా యీ వాహనమున సంచరించు మేఘములను నేను సజల మొనరింతును. నా కృపావర్షమున నీవు సస్యశ్యామలవు; సత్రభావ ఫలపుష్పిందితవు!" అని రత్నాకరశ్రీ యుద్ఘోషించుచున్నదా? లేక,

"ఓ ధరణీరాణీ! మాయనిద్రాముద్రితవై యుంటి వేల? యుగయు గాంతరములు గడచిపోయినవి. అనాదినుండి నీ నేత్రములకు మోహా సమంత్ర మాకర్షించినది. లెమ్ము, తనయా! అనాథనాథుఁడు భగవం తుఁడు, భవాలయమున గాతవి మహిమా స్తవ మొనరింపుము; జయ జయనవమునఁ బాడుము. తల్లీ! ప్రేమానందమయుడై యా సృష్టిస్థితి లయకారణుని యభయపదప్రాంతమున జీవన బలి యొనంగుము. సర్వపాపతాపభయ హారణుఁడు నీ యెదుట ననంతలీలావతారధారణ గావించుచున్నవాఁడు. కనులు తెఱచి చూడుము!" అని యుద్బోధిం చుచున్నదా? లేక,

"భారతీ! గౌరవశాలినీ! కీర్తిమాలినీ! సంతానపాలినీ! నీ వేటికి దుఃఖించుచున్నావు? జడతానాగపాశమున నీ సంతతి బంధింపఁబడి నిగాశార్వరీగర్భమున ఖలీనమై పోవుచున్నదని విచారించుచుంటివా? తల్లీ! నీ మధుగాహ్వానమున భిన్నభిన్న దేహధారులు నవప్రాణపోషి తులై, యనస్వార్థభావోల్లసితులై, యేకకళేబరులై నీ విజయపతాక చ్ఛాయలో దండాయమాన మగుదురు. త్రింశత్కోటికంఠరవము లేక తానమున నీ జయగీతమును బాడును. తల్లీ! పుణ్యమయి మందాకినీ! వీరప్రసవినీ! నవయుగోదయమున నైరాశ్యభావ మేటికి!" అని యుప లాలించుచున్నదా?

తనయుపంతి స్వరూపప్రదర్శనమున శోకమును కనంత మిాళనసుఖమును ప్రకటించుచున్నదా?

రఘురాముఁ డానముద్రగర్భమును ఏకమాత్రలక్ష్యమున విలోకించుచుండెను. దూరమున నీలాకాశపటమున వినీలజలపటము విలీనమై శాంతిమయమహాప్రస్థానమున ననంతమార్గములు నిరూపించుచుండెను.

“ఆహా! విధాతా! నీ సృష్టి సౌందర్యమును దర్శించుట కనంతశక్తి కావలయును. మానవుఁ డాద్యంతరహిత జీవనధారియైని, నీ యనంత సౌందర్యామృతమును గ్రోలి యానందింపఁగలఁడు!” అని యాతఁ డనుకొనియెను.

ఆనాఁటి రాత్రి యాతనిదైనిక చర్యపుస్తకమున నీ క్రిందిగీతము వ్రాయఁబడి యుండెను:

«ప్రణయరాజ్యమనంతము! భావనా ప్ర
పంచభాగ్యమనంతము! పరమశాంత
భరిత గగన మనంతము! గిరగిరమని
తిరుగు కాలమనంతము! దివ్యమైన
యా యనంత మిాళనమాత్మ కబ్బుటెపుడో!»

## ౧౪

### «ఘోరకరాయమహాత్ములు!»

వేంకటాచార్యులు రఘునాథపుర వీథులలోఁ బ్రత్యక్షమయ్యెను. సాయం సమయమున నాతఁడు వసంతరావును సందర్శించెను. వసంతరా వాతనిని సత్కరించి యుచితాసన మొసంగెను.

« నేను వైద్యం చేస్తాను. నాడీ పరీక్షలో ఆరితేరినవాణ్ణి. ఈఊళ్లో

పని ఉండివచ్చాను. తమకీర్తి దిగదిగంతాలా మోగుతూంది. తమ వంటి మహాత్ములదర్శనం అంటే నాకు ఎంతో ప్రీతి.”

“మీది ఏ ఊరు?”

“శంకరపురం! తమ అల్లుడిగారి ఊరే.”

“మా రఘురామమూర్తిని మీరు ఎఱుగుదురా?

“తెలియకేమి! చాలా తెలివైనవాడు; యోగ్యుడు కూడాను—గాని,—”

వసంతరావు శ్రద్ధాధికుండై యాతని నాలింప సాగెను.

“అనుమానించకండి; అతని వర్తనలో హెచ్చు తక్కువలుంటే చెప్పవచ్చును. చిన్నవాడు; లోకజ్ఞానం లేదు.”

“ఇప్పటి యువకులకి భావోద్రేకమే కాని, యుక్తాయుక్తం అక్కర్లేదు. రఘురామమూర్తి చాలాదయగలవాడు. తనకేదేనాకష్టం వస్తే సహిస్తాడుగాని, ఇతరుల కష్టం చూడలేడు.”

“ఔను.”

“కాని దయకుకూడా దానధర్మాలకివలె పాత్రాపాత్రతఉండాలా”

“నిజం; అపాత్రదానం నిషేధం.”

“అతని దయకు పాత్రాపాత్రతలేదు.”

“ఎలాగ?”

“మా ఊళ్లో కాంతమ్మ అని ఒకబ్రాహ్మణ మునలిదిఉంది. దానికో కూతురుంది. ఆ పిల్ల పేరు గంగ; అది చక్కదనాలకుప్ప. తల్లీ కూతురు మనవాళ్ళ వీథిలోనే కాపరం ఉన్నారు — వేంకటాచార్యులొక్కింత ఆగి,

“బాబూ! తమదర్శనం చేసిపోదామనివచ్చాను; ఈ అప్రస్తుతవిషయం ఎందుకు? పాపం పుణ్యం భగవంతుడు చూడాలి; మనుష్యులు చూడగలరా?” అనియెను.

"మీకు ఆ అభ్యంతరం ఏమీ లేదు. మీకు తెలిసిందే చెప్పండి. నిజా నిజాలు పెద్దవాళ్ళకి తెలుస్తే, చిన్నవాళ్ళని దిద్దిందికి వీలు ఉంటుంది."

"చెప్పిందికి నా కేమీ ఇష్టంలేదు.—కాని పెద్దలు; సర్వం తెలిసినవాళ్ళు. తమ మాట త్రోసివేయకూడదు. రఘురామమూర్తి పెళ్ళాని విడిచి పెట్టి, సాన్ని చేసుకుందికి నిశ్చయించుకున్నాడట. మొన్న రాత్రి—ఇదే వేళ—వసివీధిలో వాళ్ళిద్దరూ మాటాడుతూ ఉంటే ఆదారిని నా పనిమీద పోతూ విన్నాను: "రామూ! తిరిగి ఎప్పుడు వస్తావు?" అని గంగ అడిగింది. "ఇంతలో రాలేను" అని అతనన్నాడు. నే విన్నదానికి ఈ సంభాషణ వ్యాఖ్యాన రూపంగా ఉంది. బాబూ! నన్ను క్షమించండి. ఈ సంగతి నామనస్సులో దాచుకుందామని అనుకున్నాను. పెద్దింటి గుట్టుబైట వెయ్యకూడదు. చెప్పక తప్పిందికాదు మీ రన్నట్లు అతను చిన్నవాడు; లోకగ్న్యానం లేదు. క్రమేణా అనుభవంలో దారిలో పడతాడు. ఊళ్లో ఒక కేసు ఉంది! కాకరపర్తి రామయ్యగారి పెద్దకూతురికి—బీరకాయలవారికోడలు—దెయ్యం పట్టిందట! దెయ్యాన్ని విడిపించిందికి నన్ను పిలిపించారు. మంత్రవైద్యం కూడా నాకు తెలుసును. నా చేతిమాత్ర పుచ్చుకుంటే ఈ జన్మంలో మరి రోగాలు రావు!" అని పలికి సవినయముగా లేచి యాతఁడా న్యాయవాదికి నమస్కరించి వెడలి పోయెను.

పరమప్రయోజనసాధనమునఁ దిరస్కృతుఁడైనట్లు, మహాలోకారసుఖప్రపంచమున వంచితుఁడైనట్లు, హస్తగతమగు చింతామణిఁ గోల్పోయినట్లు, వసంతరావు నితాంత దుఃఖితుఁడై పోయెను. తన యేక పుత్త్రి జానకికి భవమున నింకేమి సుఖమున్నది? వివర్జితయగు కులకాంత కిహపరసాధన కేదిమార్గము? భవిష్యచ్ఛుభమాశించి మురిసి వధు జానకి ముఖము నింకెట్లు చూడఁగలడు? మధురహాస విలసితమగు

నా బాలికాముఖ మశ్రుకణాంకితమగునేని, దాని కీభవమున నింకేమి యాశయున్నది? రఘురాముండు విద్యాధికుండు; సత్కులసంజాతుండు; వంశమర్యాద లెఱింగినవాండు. ఆతని సాత్త్వికప్రణయమున దురంతతమోభాన మెట్లుదితమయ్యెను?—వసంతరావు మహాభయంకర యాతన ననుభవించుచుండెను.

జానకి యాతని సమీపమునకుం బరుగెత్తి వచ్చి,

“నాన్నా! పలకంగాజులు నా కెప్పుడు చేయించెదవు?” అని యాతని యొడిలోం గూర్చుండెను.

వసంతరావా బాలికను గౌంగిలించుకొని, శిరము మూర్కొని, లోలోన నుప్పొంగు దుఃఖము నణచుకొనుచు,

“అమ్మా! తేపు చేయిస్తాను!” అనియెను.

## ౧౫

### కడపటి వీడుకోలు

“గంగా! నీ విట్లు కన్నీరుగం గార్చిన లాభము లేదు. నీ కన్నియుం దెలియును. రఘురాముని యందు నీకుం గల నిరుపమానాభిమానము నే నెఱుంగనా? ఆ యభిమాన ప్రదర్శనమున కింతకంటె మహత్తరావకాశము నీ కీ జన్మమధ్యమునం గలుగ నేరదు. నీ యదృష్టము వలన నే వేణుగోపాలుఁడు నిన్నుం బెండ్లియాడుట కంగీకరించెను. నీయందుం గల పుత్రికావాత్సల్యమున, నే నింతపలుకుం జెప్పుచున్నాను. నీ యిష్ట మెట్లో యట్లొనరింపుము.” అని శేషమ్మ గంగతో ననియెను.

“అమ్మా! ప్రమాణ మెప్పుడు స్థిరపఱచితివి? మన మెచ్చటి కరుగవలయును?”

"రాజమహేంద్రవరమున కేగిన మన ప్రయత్నము సుకరముగా సఫలమగును. ఈ రాత్రియే ప్రయాణము నిశ్చయించితిమి."

"అమ్మా! నన్నాతఁడు నిశ్చయముగాఁ బెండ్లియాడునా?"

"నీ కట్టి యనుమాన మవసరములేదు. ఆఁతడు మాటతప్పఁడు."

"రాత్రి యేడుగంటలకు వచ్చెదను."

గంగ వెడలిపోయెను. నిజగృహాభ్యంతరమున నామె యొక చాప పైఁ గూర్చుండి దర్పణములో ముఖమును జూచుకొనుచుఁ దలపోయఁ దొడంగెను.—ఎన్ని దినములకు మరల కుంతల నంస్కారము?—"నా ముఖము నాకే దుర్నిరీక్ష్యమై పోయినది! పాపకలుషితమగు నా ముఖమును నేఁ జూడఁ జాలను. అమ్మా! శారదా! నీవు జీవించియుండిన నాకీ యనుభవము లేకుండును గదా? నే నేల జన్మించితిని?— నే నేల జీవించియుంటిని!—నా ప్రాణములను హరింప నాకధికారము లేదు! నా కంటెపాపిని మఱి జన్మించునా? అహా! రామా! నీ ముఖమును జూచు భాగ్యము నాకీ భవంబున దుర్లభమైనను, నీ గృహ సమీపమున నీ కంటఁ బడక మెలఁగుటకైన నోచుకొననైతిని; మహాంధకారమున మునిఁగిపోవుచుంటిని. నా కింక విచారమేల? హతాశనగు నాకుఁ నశ్రువినర్జనవ్యాపారమేమి? రామా! రామా! రామా! నీ నామోచ్చారణ మెంత మధురము! నీ నామామృతరము (నుఁ) జపించుటకైన నా హృదయమున శక్తిలేదు. నా దౌర్బల్యము నన్నేల జంపివేయదు? ఆ నాఁడు కౌతుకమనస్కనై నీ పరిరక్షిత మార్జాల కన్యకను మా యింటఁ గట్టిపెట్టితిని. నీ వప్పుడు సంభాషణవశమున నే మంటివి?

'కారులిచ్చు వసంతలక్ష్మినిఁ గాల్చివేయునపుడు ఏ రాతి గుండె కరుగకుండును?' అని కదా? రామా! నీ వాగమృతముఁ గ్రోలు భాగ్యము నా వంటి దుర్జాతి స్త్రీ కెట్లు లభ్యంబగును?" అని యామె

లోలోనఁ గుములిపోవుచుండెను.

"ఐతే గంగా! నీకు ఇంత పోయికాల మెందుకే?" అని కాంతమ్మ మండిపడుచు నామెను సమీపించెను.

"ఇప్పు డేమైనది?" అని గంగ శాంతభావమున నడిగెను.

"ఏమైందా? ఎంత నంగనాచివే? దానింటికి వెళ్ళవద్దని ఎంతపోరినా విన్నావా. మొగుడు వచ్చిన ముండవి. ఓ మూలకూర్చోకుండా ఈ వేషం ఎందుకు? మందులముండ శేషమ్మ నీ కెక్కడ దాపరించిందే? ఆ వెధవ—ఎవడో హోటీలు ముండాకొడుకట—నిన్ను లేవతీసుకొని పోదామని చూస్తూఉన్నాడట. దాని వల్లోపడి ఇంత పాడైపోయా వేమి? నీకు తిన్నగా బతికిందికి ఆశలేదా ఏమిటి? కొన్నాళ్ళల్లా రఘు రాముడు కొండెక్కుస్తాడేమో అని పడి నచ్చావు. ఇప్పుడు ఊరూ పేరూ లేని ఆ నంగిరి వెధవ నిన్నుద్ధరిస్తాడులే!" అని ప్రలాపించెను.

"అమ్మా! ఈ గృహమున నుండుటకంటె నరకమున నుస్థిరముగా నుండుట మేలు. నీ కడుపున నే నుద్భవింపలేదని యనుకొనుము!" అని గంగ మౌనము వహించెను.

"నా కెందుకీ సొద. ఱెక్కలు వచ్చిన పిట్టలు గూళ్ళలో ఉంటా యా? నీ ఖర్మం ఎలాగో ఆలాగే జరుగుతుంది. నొష్ఠరాత ఎవడు తప్పిస్తాడు—ఛావకొట్టే వాళ్ళు లేక మిట్టి పడుతున్నావు! ముద్దులాగు మొఘం నువ్వూనూ!" అని కాంతమ్మ విసుగుకొనుచు వంట యింట కరిగెను.

రాత్రి యేడుగంటల సమయమున గంగ మెల్లగాఁ దలుపు తీసి, కట్టుబట్టతో వీధిలోనికి వచ్చెను. కాటుక కురిసినటులు చీఁకటి క్రమ్మి యుండెను. ఆమె మెల్లన రఘురాముని గృహమును సమీపించెను. ఎవ్వరును లేరు. ఆ గృహసోపానముననిటలము సోకవంగి,

"రామా! రామా! రామా! నన్ను క్షమింపుము! నన్ను-మఱచి

పోమ్మా!- నే నిప్పుడు-నరకమునఁ బడిపోవుచున్నాను!-నన్ను-నీవు రక్షింపఁ-జాలవు! నీ రక్షణము-నే-నర్థింపఁ జాలను!" అని యాత్మగతమున ననుకొనుచు నామె వెక్కి వెక్కి యేడ్చెను. ఆ యనాథ యువతీయశ్రువారి సోపానమును బ్రక్షాళిత మొనరించుచుండెను. సుశీతల కాంత్యుజ్జ్వలంబులగు ననంతకోటి నక్షత్రము లా ప్రణయ భంగమును నిశ్శబ్దభావమున విలోకించుచుండెను.

## ౧౬

### బంధుప్రీతి

ధూమశకటమున శేషమ్మ గంగను దన ప్రక్కఁ గూర్చుండఁ బెట్టుకొని యుచితాలాపముపముల నామె ననునయించుచుండెను. వేణుగోపాలము వార్తాపత్రిక నవలోకించుచు వారికెదురుగా నొక బల్లపైఁ గూర్చుండెను.

«వేణూ! టిక్కట్లు జాగ్రత్తసుమా!" యని శేషమ్మ యన్యమనస్కయై పలికెను.

వేణుగోపాలరావు తన జేబులోఁ జేయివెట్టి టిక్కెట్లను బైకిఁదీసెను.

«అమ్మా! నువ్వు చాలా జాగ్రత్త మనిషివి. నీదగ్గిరే ఉంచు ఈ టిక్కట్లు" అని వాటిని ఆ విదుషీమణి కందిచ్చెను. శేషమ్మ యా టిక్కెట్లను తీసికొని కొంగున ముడివేసెను.

ధూమశకటము వాయువేగమున నడచి పోవుచుండెను.

"గంగ ఇవాళ మహాలక్ష్మి లాగుంది!" అని వేణుగోపాలరావు చిఱునవ్వు నవ్వెను.

"గంగ వంటి చక్కని పిల్ల భూలోకములో లేదు. వేణూ! నీ

యదృష్టమే యదృష్టము!" అని శేషమ్మ ప్రశంసాపూర్వకముగా ననియెను.

"నేను నిజంగా అదృష్టవంతుణ్ణే. రాజమహేంద్రంలో చదువుకున్న ఆడవాళ్ళు ఎందరో ఉన్నారు. అక్కడ ఒక సమాజం ఉంది. ఆసమాజం పేరు మహిళాసభ. వారం వారం సంతకూడేటట్టు ఆ ఆడవాళ్ళు అందఱూ ఒక్కచోట చేరతారు. భారత రామాయణాలు చదువుతారు. ఉపన్యాసాలు ఇస్తారు." అని వేణుగోపాల మొక యుపన్యాసమారంభించెను.

శేషమ్మ యా యున్మత్తధోరణికి నవ్వుకొనుచు, "వేణూ! గంగ కంటె వారు విద్యాధికలా? పూర్వకవుల రచనలను మా గంగ యన్వయించు నటు లామహిళామండలిలో నొక్కరన్వయింపఁగలరా? శంకరపురంలో—ఆ యూరి బాలికల నుద్ధరించుటకే యా యూరికి ట్రాన్స్ఫర్ చేయించుకున్నాను—విద్యాగంధము లేకపోవుటవలన జీవరత్నము వంటి గంగను బోల్చుకొనలేక పోయినారు. గంగను జూచినతోడనే చేతులు జోడించి వందిమాగధజనము వలె రాజమహేంద్రపురనారీమండలి గంగాస్తవముఁ గావింపదా?" అని పలికెను.

"అమ్మా! నన్నేటికి హేళనము లాడెదరు? నే నవజ్ఞను; అంధురాలను!" అని గంగ శిరము వాల్చెను.

"రూపానికి తగిన విద్య; విద్యకు తగిన వినయం, గంగ యందే చూశాను!"

"ఆ గుణరూపవృత్తముల కనురూపుఁడవు నీ వొక్కఁడవే! అందుకే మీ యిరువురి హృదయము లేకీభవించినవి!"

వాల్తేరు స్టేషనులో శకటమాగెను. వేణుగోపాలరావు వడివడి భోజనశాలకరిగి యల్పాహారములను గొనితెచ్చెను. గంగ యా పదార్థములను మూఁజూడనైనలేదు. ఆమె భయాకులితయై పోవుచుండెను.

శేషమ్మ మోసకత్తె యగునా? మృత్యుముఖమున విసరివేయుటకుఁ దన్నీడ్చుకొని పోవుచున్నదా? వేణుగోపాలము మూర్ఖ జనశిరోమణి; వానియందుఁ దన కెట్టి స్నేహభావమును లేదు. వానిని బరిణయ మగుటకుఁ దాను బోవుచున్నది: తన చేతులతోఁ దనగళమును గోసి కొనుచున్నది! నాఁడు శారదాంబ యంత్యసందేశపూర్వకముగా నామె తోఁ నేమనియెను. "గంగా! నీ చేతులతో నీ గళమును గోసికొన వలదు." అని కదా? గంగ కంపించిపోవుచుండెను. ప్రళయసమయ మేదిని వలె నామె హృదయము భయంకరభావప్రచారితమై పోయెను. మాతృదేవతవలెఁ దోఁచిన శేషమ్మ మృత్యుదేవతవలెఁ గానవచ్చు చుండెను.

—వేణుగోపాలము కృత్రిమహోల్లసితుఁడై యామె నయన పథమునఁ గంటకమువలె నుండెను. ఆ యిరువురి మధ్యఁ దాను బంధితురాలై పోయినట్లామె తలంచెను.

ప్రళయ ప్రవాహమువలె ధూమశకటము చలించి పోవుచుండెను.

"నే నెంత పొరపడితిని. శేషమ్మ చాల మంచిది. నా దుఃఖమున దుఃఖిని. నా సుఖమున సుఖప్రమోదిని. సమాజశకటము నన్నుఁ ద్రొక్కి వేయుచుండ, దయాతిరేకమున నన్నెత్తి హృదయమున నిడుకొన్నది; వాత్సల్యహస్తమున నా యశ్రుపూరితాక్షములు దుడిచినది. నా యనుమానము సరియైనది కాదు. వేణుగోపాలమునకు నా యందనురాగమున్నది. అతఁడు మోసము జేయఁడు!" అని గంగ యాత్మ పరీక్షఁ గావించుకొనుచుండెను.

తునిస్టేషను లో ధూమశకట మాగెను. శేషమ్మయిటునటుఁజూచి, "వేణూ! ఇది తునిస్టేషను కదూ?" అని యడిగెను.

"ఔను!"

"ఈ స్టేషనుమాస్టరు మాదగ్గర బంధువు. ఇచ్చట బండి యెంత

నే పాగును!”

“అరగంట.”

“అట్లైన నే నాతనిఁ జూచి రాఁగలను.” అని గంగవైపుఁజూచి “అమ్మా! గంగా! నే నిప్పుడే వచ్చెదను. నీ కేమియును భయము లేదు.” అని సానురాగమునఁ బలికి రైలు దిగెను. * * * ఇరువది నిమిషములు గడచిపోయెను. శేషమ్మ తిరిగి రాలేదు.

“గంగా! శేషమ్మ ఇంకా రాలేదేమో! ఇంకా పది మినిట్లు లైయుంది.” అని వేణుగోపాల మనియెను.

నిర్విణ్ణహృదయయై గంగ స్టేషన్ మందిరము వైపుఁ జూచుచుం డెను. ఆమెకు శేషమ్మ యగుపించలేదు. గంగానేత్రములు పద్మరాగ మణిశలాకలవలె నెఱ్ఱవడియెను; ముకుపుటము లెగురుచుండెను.

“నేనుగూడ దిగిపోయెదను. నే నొంటరిగా నీతోడ రాఁజాలను!” అని యామె లేచెను. అంతలో శకటము నడచిపోయెను.

“గంగా! భయంలేదు. శేషమ్మకు అన్నీ తెలుసును. మరోబండీలో ఎక్కి ఉంటుంది.” అని వేణుగోపాలమామెనను నయింపఁదొడంగెను.

విషాదచ్ఛాయవలె గంగ యట్టులే నిలువఁబడి పోయెను.

## ౧౭

### విశీర్ణహృదయమున నాశాంకురము

రాజమహేంద్రవరమునఁ గల సత్రములలో నాళమువారి సత్రము పే రెన్నికఁ గన్నది. ఆ పాంథశాలలో సకలదేశాగతులగు బాటసారులు విశ్రామలాభము పడయుచుందురు.

గంగను బండిలోఁ గూర్చుండఁబెట్టుకొని వేణుగోపాల మా సత్ర

మును సమీపించెను. గంగ యావిశ్రామమందిరమునఁ గాలు పెట్టుట కెంతయో భయపడియెను; కాని యామె యేమిచేయఁగలదు?

వేణుగోపాలము ముందుగా లోపలికిఁ బోయి యొక గది శుభ్రము చేయించెను. అతఁడు దారి చూప గంగ యా గదిలోఁ బ్రవేశించెను.

“ఇక్కడే ఉండు. హోటలికి వెళ్ళి అన్నం తెస్తాను.” అని వేణుగోపాల మామెను విడచి యావలికిఁ బోయెను.

గంగ యా యపరిచితావరణమున, నా శూన్యాగారమున నరక వ్యథ ననుభవించుచుండెను. మాతృప్రేమారహిత మాతృగృహ మామె దృక్పథమునఁ బొడసూపెను; శాంతమ్మ పరుషవాక్పరంపర లాగృహాభ్యంతరమునఁ బ్రతిధ్వనించుచుండెను. ఆ గృహమున శాంతి లేదు; అది నరక సోపానము వలె భయావహముగా నుండెను. ఆ గృహత్యాగ మొనరించినప్పుడే గంగ, “ఈ యశాంతధామమును జిరకాల పర్యంతము నేను బరిత్యజించుచున్నాను.” అని స్థిరసంకల్ప మొనరించి యుండెను. మరల నా గృహాంతరమునఁ బాదమిడుట కామె యిష్టపడలేదు. భీషణశ్మశాన తుల్యమగు నా క్షుద్రగృహమును హృదంతరమున విలుప్తముఁ గావింపవలయును.—

శాంతమ్మ స్త్రీ వ్యక్తికదా? స్త్రీ హృదయమున దౌర్జన్యభావముస్వాభావికము. స్త్రీ తన సోదరిని వంచించునా? స్త్రీలకు స్త్రీలయెడ ద్వేష ముండునా? పరమేశ్వరునకుఁ దనయందుఁ గనికరము లేదు. శాంతమ్మ తన్ను వంచించుటయే యందుకుఁ బ్రబల తార్కాణము.

యమకింకరుఁడు వేణుగోపాలము స్వార్థసుఖసమార్జనమునఁ దత్పరుఁడు; తన కన్యాత్వమును హరించుట కాతఁడు బద్ధకంకణుఁడు.—

ఒక్కయనాథ యువతీజీవన విధ్వంస కార్యమున నెందఱు నియుక్తులైరి. ఘాతుక మృగ సంకుల భయంకరారణ్య ప్రదేశమున గంగ యేకాకినియైపోయెను. ఆ యువతీ హృదయమున శతకోటి కాల సర్పము

లు విషానలము గ్రక్కుచుండెను. అవ్యక్త తీవ్రాగ్ని కీలలలో నామెహృదయము కాలిపోవుచుండెను.

వేణుగోపాలము భోజన పదార్థములను సంగ్రహించి గంగయున్న గదిలోఁ బ్రవేశించెను.

"భోజనం చెయ్యి. రైలుబండిలో నీళ్ళైనా తాగలేదు నువ్వు." అని యాతఁడాపదార్థములను గంగ సముఖమున నుంచెను.

"అయ్యా! నాకిప్పు డాకలిలేదు. నాహృదయమునఁ జాల సంశయములున్నవి. నీవా సంశయములకుఁ దగిన సమాధాన మొసంగవలయును!" అని గంగ గంభీరముగా ననియెను.

"నీ సంశయాలేమిటి?"

"శేషమ్మ నిజముగాఁ దుని స్టేషనులో దప్పి పోయినదా; లేక హృదయ పూర్వకముగా మనలను విసర్జించినదా?"

"ఇష్టముండే ఉండిపోయింది."

"నీవామెకు టిక్కట్టు నిచ్చితివికదా? మన యిరువురి టిక్కట్లు నీ చేతిలోని కెట్లు వచ్చినవి?"

"ఆమె తునివరకే టిక్కట్టు పుచ్చుకుంది. ఆటిక్కట్టుతో రెండు ప్లాటుఫారం టిక్కట్లు కలిపి ఆమె కిచ్చాను."

"ఈ మోసకృత్యమున కేమి కారణము?"

"ఆమె మాట వడిందికి ఒప్పుకుంటుందా నీ వెఱ్ఱితనం గాని?"

"ఆమె యిప్పు డెచ్చటికి కరిగినది?"

"తిరుగు ట్రైన్‌లో శంకరవురం వెళ్లిపోయి ఉంటుంది."

గంగ తలవంచి యించుక సేపు ఆలోచన పూర్వకముగా మౌనము వహించెను. ఆ దురాత్మురాలు తన కెంత యపకృతిఁ గావించినది! శంకరపురమున కరిగి యామెను రచ్చ కీడ్చుట కవకాశమున్నదా? ఆమెను రచ్చ కీడ్చిన శృంగభంగ మెవరికి? తనయందు లోకమున కేమి

సానుభూతియున్నది? తన మాట మన్నించు వారెవరు? తన చరిత్రము ను గౌరవించు వారెవరు? తా నెట్టి న్యాయమర్థింప గలదు? న్యాయ విధాత లెవరు? న్యాయభిక్షాప్రాప్తివలనఁ దన కేమి యానందమున్నది?

“ నీ విషయమునఁ బాటుపడుట కామె కేమి యగత్యముండెను?” అని యామె వేణుగోపాలను నడిగెను.

వేణుగోపాలము గోళ్ళు కొఱుకుకొనుచు,

“ నావల్ల దానికి లాభం లేకపోతే ఇంతపని చేస్తుందా? నాకుఇంత ఉపకారం తలపెడుతుందా?”

“ ఎట్టిలాభము?”

“ ధనలాభం.”

“ నీవామెకు ధన మొసంగితివా?”

“ నీకోసానికని కాదూ, నువ్వు చూస్తూ ఉంటే ఐదువందలరూపాయలు—నోట్లు—దాని ఎదాన పెట్టాను. మరచి పోయావూ?”

“ ఆ ధనము నీవామె యొద్ద దాచియుండలేదా?”

“ దాచడం ఏమిటి? అదో నెపం. ఐదువందల రూపాయలు పుచ్చుకొని నిన్ను నాకు వప్ప చెప్పింది. XoX మరల ఆలోచనా ధీనయయ్యెను.

“ ధన పిశాచము నాశ్రయించిన ఘాతుకరాలికి దయా దాక్షిణ్యములుండునా? పాపిని యెంత చేసినది? ఆ మధురాలాపములు విషప్రపూరితములని లేశమాత్రమైన గ్రహింపఁ జాలనైతిని. ఆరమణీయహాసము కుటిల భావోద్దీపితమని యెఱుంగనైతిని. ఆప్రగాఢాశ్లేషము నాజీవన విభ్రంశ సూచకమని తెలియనైతిని. హా! కుటిల హృదయా! నీకు నేనెట్టి యపకార మొనరించితిని? నిర్దయురాలవై నన్ను శమనముఖమునఁ బడఁద్రోసితివా? అమృత కలశప్రదాన మొనరింతునని హాలాహల మొసంగితివి. మృత్యుభోగమున జీవనసుఖ

మర్దించు నాకు జీవనయాత్రలో మృత్యు యాతనఁ గల్పించితివి. నీ కఠోర స్వభావమును నేను బోల్చుకొనఁ జాలనైతిని." అని యామె కన్నులు తుడుచుకొనుచు వేణుగోపాలమును జూచి,

"అయ్యా! ఇప్పుడేమిచేయ సంకల్పించితివి?" యని యడిగెను.

"ఈ వూళ్ళో ఇల్లొకటి అద్దెకు పుచ్చుకుందాం. అందులో కాపరం ఉందాం."

"వివాహ ప్రస్తావన విస్మృతమయ్యేనా?"

"నిజమైన ప్రేమ ఉంటే పెళ్లీ పెడాకులు ఎందుకు?"

గంగ దీర్ఘ నిశ్వాస మెడలించెను. ఆనిశ్వాసమున నాయువతీ హృదయశోణిత మింకిపోయినట్లుండెను. ఆమె కెదురుగా వేఱొక గదిలో మహాతేజస్విని, యవగుంఠనవతి, బంగాలీయువతి యొకతె మృదుల తల్పమునఁ గూర్చుండి వీవనతో విసరు కొనుచుండెను.

గంగ యా సుకుమార దివ్యమూర్తినిఁ దిలకించి యొక్క పరుగున నామెను సమీపించెను. ఉత్తర క్షణమున నామె యాకల్యాణ ప్రతిమాపాదపద్మములపై వ్రాలిపోయెను.

"అమ్మా! అమ్మా! రక్షింపుము! హతభాగ్యను! దీనురాలను! క్రూరనిషాదుఁడు విషబాణఘాతమున నన్నుఁ గూల్పసంకల్పించి సమీపమున నున్నవాఁడు! తల్లీ! మాతృదేవీస్వరూపిణీ! రక్షింపుము!" అని యశ్రుజలములచే నా యువతీపాదములను బ్రక్షాళితముఁ గావించెను.

# ౧౮

## దొంగ యెవఁడు?

"వంచిన నడు మెత్తకుండా ఆర్జించినసొమ్మే! ఆరువందల రూటు బిళ్ళలే; అమ్మా! జలతారు పెట్టెలో పెట్టి భోషాణంలో దాచానే! ఏ పాపిష్టికళ్లు పడ్డాయో, పెట్టి పెట్టిలా గేఉంది. డబ్బుపోయిందే, తల్లీ! నాకొంప కూలిపోయింది. నా కేందారి! అయ్యో! అయ్యో!" అని సుందరమ్మ నెత్తి నోరు మోదుకొనుచు శేషమ్మతోఁ బలుకుచుండెను.

శేషమ్మ యోజనాపూర్వకముగా,

"అమ్మా! నీ వా భోషాణమున ధనముంచినసంగతి యెవ్వరికైనఁ దెలియునా?" యని యడిగెను.

"పిట్టకాకికి తెలీదమ్మా!"

"నీ కెవరియం దనుమాన మున్నది?"

"ఇంట్లో దాసీముండ అంతపని చేస్తుందీ?"

"వంటబ్రాహ్మణుఁడు?" అని సూచనపూర్వకముగా శేషమ్మ పలికెను.

"అబ్బే వెంకటేశం చాలపెద్దమనిషి. ఇంట్లో పిల్లాడిలాగ తిరుగుతాడు. ఇంత ద్రోహం చెయ్యడు!"

"సుందరమ్మా! నీ విశ్వాసమే నిన్నింతకుఁ దెచ్చినది. గోముఖవ్యాఘ్రము లీ వంటబ్రాహ్మణులు. మొదట నమ్మకముగా వర్తించి, కడ కిల్లు గుల్లచేయుదురు. నీ వేమనిన ననుముగాని నా కనుమాన మాతనియందే యున్నది."

"చూడండి నేనెలా అడిగేది అతన్ని?"

„పోలీసు రిపోర్టు ఇవ్వరాదా?"

„సాక్షులు ఎవరు ఉన్నారూ!"

„సాక్షుల కేమికొఱంత?"

„కేసు తెచ్చిందికి డబ్బెక్కడ నాదగ్గిర! శేషూ! మావాడి జాడ లేదేమే?"

„విశాఖపట్టణములో ఆంధ్ర సారస్వతసభ జరుగుచున్నది. ఆ సభకు మీ వేణు నిన్న బయలుదేఱపోయెను. వెళ్ళునపుడు మాయింటికి వచ్చియుండెను."

„వాడు దొంగతనం చెయ్యడు. దొంగతనం మా వంగడంలోనే లేదు; గాని ఎవరేనా వాణ్ణి పాడుచేదామని చెప్పిచేయించారేమో!"

„సుందరమ్మా! నీ వివేక మేమైనది? వేణు కేమి తక్కువ చేసితివి? సొమ్ము కావలసి నిన్నడిగిన నీ వీయనందువా? నీ యందు వానికి చనువులేదా? నీ యొడిలోఁ గూర్చుని, 'అమ్మా! నా కింత సొమ్ము కావలెను' అని వాఁ డడిగిన నీ వీయకుందువా? తల్లిధనమును బుత్రుఁడు హరించునా? లోకమం దెచ్చటనైనఁ గలదా? వాని యందు నీ కనుమానము వలదు. వేణు బుద్ధిమంతుఁడు; నీ వాతని వర్తనమునఁ గళంక మారోపించిన వాఁడెంత నొచ్చుకొనును? నీయనుమానము సరియైనదికాదు. ఇంతకు వాఁడు నేఁడో రేఁపో తిరిగి వచ్చును. ఇంతసొమ్ము హరించుట కాతని కేమిదుర్వ్యసనము లున్నవా? ఎప్పుడో విలాసమునకుఁ బొగచుట్టఁ గాల్చెనని తెలిసికొని నేను వాని నెంతయో తూలనాడితిని. ఇంకెన్నఁడును అట్టి యపరాధమును జేయనని యాతఁడు పశ్చాత్తాపతప్తుఁడై నన్ను క్షమింపుమని వేడుకొనెను. అంత మంచివాఁడు, పాపభీతి కలవాఁడు, నా చెప్పుచేతలలో మెలఁగువాఁడు, చౌర్య మొనరించునా?—సుందరమ్మా! నీవు లక్ష చెప్పినను, వంటవాఁడే యింతపని చేసియుండునని నా నమ్మకము."

“కనుక్కున్నదాన్ని వేఱుసంగతి నాకు తెలీదూ? వా డింతపని చెయ్యడమ్మా! శేషూ! ఎన్నాళ్ళకష్టమే! ఒక్క నిమషంలో పాడై పోయాను? ఆచోకీతెలిసిన వెధవ ఎవడో ఈ పనిచేసిఉండాలి. దొంగ లొచ్చిందికి వేళేదీ? మొన్న చూసుకున్నానా? ఎలా పెట్టినసొమ్ము అలాగే ఉంది; నిన్న చూస్తే వట్టిపెట్టె దమ్మిడీదగ్గిరనుంచి డబ్బీలో వేసి కూడపెట్టాను. చెమటూర్చిన సొమ్మే, శేషూ!” అని యామె మఱల రోదనమునకుఁ గడంగెను.

ఆ సమయమున వంటబ్రాహ్మణుఁడు వేంకటేశ మచ్చటి కరుదెంచెను. సుందరమ్మ వానిని జూచినతోడనే,

“నీ నక్కవినయాలు మండిపోను! ఎంతపని చేశావురా?” అని దండతాడిత భుజంగమువలె మండిపడి యఱచెను.

పాపము వేంకటేశము నిశ్చేష్టితుఁడై,

“ఏమైంది?” అని యడిగెను.

“అబ్బా! నీ కేమీ తెలీదూ? నాలిముచ్చులాగ వెంట వెంట తిరిగి—అయ్యో! శేషూ! ఎంతసొమ్మే! ఎన్నాళ్ళకష్టమే!” యని యామె యేడ్వసాగెను.

“సొమ్మేమిటి?” అని వేంకటేశము విస్మయాతిరేకమునఁ బలికెను.

“ఏమీ తెలీదూ పాపం! జలతారుపెట్టిలో దాచిన రూపాయిలు, ఎంతగుండెదిట్ట తనంరా నీది! ఏముండకిచ్చిందికి దొంగ లాడావు?” అని సుందరమ్మ యేడ్చుచు ననియెను.

వేంకటేశము కోపాక్రాంతుఁడై,

“నీ ఇంట్లో చాకిరీ చేసినందులకు ఫలం బాగాదొరికింది! నల్బై చోట్ల పని చేసినముండాకొడుకుని. ఎక్కడామాట పడలేదు! నీపాడు సొమ్ము ఎవడికి కావాలి? కాకినాడలో డిప్టీకలక్టరు గారింట్లో పదేళ్ళు పనిచేశాను. ఆప్రభువు ఖజానాతాళంచెవులు నాపరంగా విడిచిపెట్టి

గుండెమీద చెయ్యివేసుకొని గుఱ్ఱుపెట్టి పడుకుండేవారు. ఎలాటి సొమ్ము ఆలాగేఉండేది. ఒక్కదమ్మిడీ వినా ఎప్పుడూ పోలేదు! ఈ నాటికి నాఖర్మం కాలి నీఇంట్లో చేరానని నాకు దొంగతనం కట్టావు. నాలుగేళ్లై నీఇంట్లో ఉన్నానుకదా. ఎప్పుడే నా పూతికపుడక తియ్యడం చూశావా? ఛీ! దొంగబతుకేం బతుకు? అడిగితింటే కడుపునిండుతుంది. నీసొమ్ము తీసినవాళ్ళు పాడైపోతారు! ఆడదాని సొమ్ము ఎవడికి కావాలి? ఆడదాని సొమ్ముకోసానికి ఆశించేవెధవల వంశంముందుకొస్తుందీ? సుందరమ్మా! నీఇంట్లో చోరీజరిగినమాటే నాకుతెలీదు!" అని యనియెను.

"అయ్యో! నీసముజాయిషీ కోర్టువారి యెదుట నిత్తువుగానిలే!" అని శేషమ్మ యాబ్రాహ్మణ మర్కటమును బెదరింపఁ జూచెను.

"కోర్టెక్కితే ఎక్కండి! ఈ బెదరింపులికి జడిసేవాళ్లెవరు? కోర్టువారు మాత్రం నిజానిజాలు చూడకుండా నన్ను కొట్లోవేస్తారా ఏమిటి? ఎక్కడికీ జడిపింపులు! ఈ ఇంట్లో పనిచెయ్యమన్నా చెయ్యను. అనుమానంకలిగేచోట అరనిమషం నిలవడకూడదు." అని వేంకటేశము నడచిపోయెను.

"కేసుమాట!" అని శేషమ్మ సుందరమ్మవైపు మోముఁద్రిప్పి యడిగెను.

"దొంగ ఎవడో తెలుస్తేనా కేసున్నూ గీసున్నూ!"

"నిజమే! ఎంతవిచిత్రముగా దొంగతనము జరిగినది! సుందరమ్మా! నీదినములు వంకర కాకుండిన నింతసొమ్ము చాపక్రింద నీరువలె మాయమై పోవునా?" అని యనునయ పూర్వకముగా శేషమ్మ పలికెను.

అచిరకాలములో సుందరమ్మ హోటేలు మూసివేసెను. భర్త జీవితకాలమునఁ బ్రభుత్వభారమును శిరమునఁదాల్చి విజృంభించిన

యనహోయురాలు నీళ్ళబిందెలుమోసి దుర్భర జీవనయాత్ర నెఱప వలసి వచ్చెను.

*   *   *   *

ఒకనాఁడు వేంకటేశము నీళ్ళకావడితో వీధినిఁ బోవుచు నామె కెదురయ్యెను.

"ఆడదానిసొమ్ము దొంగలాడిన విధవలకు నీళ్ళమోత కాకపోతే మరేమిటి?" అని సుందరమ్మ యనెను.

"నీఉద్యోగం ఏమిటి? నీళ్ళు మొయ్యడం, ఎంగిళ్ళెత్తడమే కదూ!" అని యాతఁడు బదులుచెప్పెను.

## ౧౬

### జానకి

జానకి కిప్పుడు పదునాలుగేండ్లు నిండినవి. నవయౌవనావిర్భావమున నా బాలికాహృదయము నవభావోద్దీపితమై, నవప్రేమప్రసారితమై, నవ్యానందబంధురమై పోయెను. జగన్నాటకాలయమున నాయువతీనేత్రములు శోభారాణీ దృశ్యమునే విలోకించుచుండెను. భువనము శోభాభవనమై యామెకు స్ఫురించుచుండెను. అమృతమయసృష్టిశోభావంతమై నితాంతనంతోషమునుఁగూర్చుచుండెను. ఆయువతీహృదయనందన వనమునఁ బ్రేమపారిజాతము వికసించినది. ఆమె నిరంతరమనంతసరసవసంతమధుమహోత్సవమును, అనంత జీవనయౌవనమహానందవిభవమును, ధ్యానించుచుండెను. జీవనదివసయామిని యనంత కల్యాణమయంబని యామె యూహించుచుండెను. స్వీయనాథుని మందిరమునఁ బ్రణయపట్టాభిషేకమహోత్సవమును, ప్రణయ

రాజ్యసుఖానుభోగమును, ప్రణయప్రసన్న జీవనభాగ్యమును, స్మరించుచుండెను. ఆ లావణ్యమయ విగ్రహస్నిగ్ధలలాటమునఁ బ్రణయప్రఫుల్ల తేజము విడంబించి యుండెను. విశాలనేత్రద్వయము ప్రణయరాగసిక్తమైయుండెను. కోమలహృదయమునఁ బ్రణయారాధన గీతము ధ్వనించుచుండెను.

జానకి చదువుల సరస్వతి. ఆగ్రామమున బతితప్రాణోద్ధరణదయావ్రతపాలిని "మిస్ జూలియా" యను క్రిస్టియన్ పారసూతి (Mistress)జానకియం దమితానురాగము గలిగియుండెను. ఆబాలికా విద్యావిషయమున నామె యధికశ్రద్ధ వహించి, కుట్టుపని, ఊలుపని, చిత్రలేఖన, పుస్తకపఠన, లేఖన, సంగీతము మొదలగు మధుర కళలామెకు నేర్పియుండెను. జానకియు నామెయందు భక్తితత్పరయై విద్యావినోదిని యయ్యెను.

ఒకనాఁడు మిస్‌జూలియా వసంతరావు నుద్దేశించి,

"మీయమ్మాయి విద్యా విషయమున నేను శక్తివంచనలేక పాటుపడితిని. ఆబాలికయు శ్రద్ధా విధేయయై జ్ఞానోపార్జన గావించినది. సంగీతము లలితకళలలో నగ్రగణ్యము. ఆ కళాపరిజ్ఞానము నే నెఱింగినంతవఱకు జానకికి నేర్పితిని. భారతవర్షము సంగీత సాహిత్య విజ్ఞానమున మహోన్నత స్థాన మలంకరించినది. మీ దేశమున కీవిషయమున గల గౌరవాధిక్యము తదితర దేశములకు లేదు. మీరీ విషయమున జానకికి విపులావకాశములు గల్పింపవలయును. సంగీతశాస్త్రజ్ఞు నొకని నియోగించి యామెకు జగజ్జేగీయమానమగు గాంధర్వవిద్య విపులముగా నేర్పింపుడు. ఈశ్వర దత్తమగు మధుర కంఠస్వరము శాస్త్రపరిజ్ఞానమున ధన్యతఁ గాంచును!" అని యుద్బోధన పూర్వకముగా బలికెను.

వసంతరావు పాశ్చాత్య యువతీ మధుర ప్రబోధమున కెంతయు సంతసించి,

" అమ్మా! నీకు మా పిల్లయందు చాల ప్రేమ. నీ అభిప్రాయం అనుసరించి దానికి సంగీతం నేర్పిస్తాను." అనియెను.

స్నిగ్ధఛాయామయు సంధ్యామహాదేవి సుశీతలకాంత్యుజ్జ్వలతారా విమండితయై జగదంగాలయమున విరాజమానమయ్యెను. ఆమధుర సాయంసమయమున జానకి గృహోపవరణమునఁ గల ప్రమదా వనాంత రమున శ్యామల దుర్వాదళ నిర్గాస్తరణమున నధివశించి 'సుధాశర చ్చంద్రమ' ను సుధామయగద్య ప్రబంధమునఁ బూర్వభాగముఁ జదువుచుండెను. తొల్పుకూరు గ్రామమునఁ జిన్ననాటినెచ్చెలుల జీవన ప్రణాలి కవిచంద్రుని మధుర లేఖనీ వర్తనమున సుమధురముగాఁ జిత్రితమైయుండెను. ప్రాలేయాచల శిరోభాగమునఁ బర్వతకన్య యుమా దేవి మహాతపో నిష్ఠాగరిష్ఠుఁడగు శంకరదేవుని హృదయ ప్రవేశ మొన రింప బ్రణయయోగ సమాధిలో నిమగ్న యయ్యెను. ఆ దేవీ ప్రణ యతపస్సు ప్రణయాధి నాథుని భస్మీ పటల మొనరించెను. జానకి హస్త మలంకరించి, యామె హృదయ మలరించిన గ్రంథ రాజ మున సుమాప్రణయము ఉమా హృదయముననే భస్మీభూతమైపో యెను. కరుణ రసవంతమగు సుమా జీవన చరిత్రము జానకీ హృదయ విదారణ మొనరించెను. ఆ యువాయికి యశ్రుపూరిత నేత్రములతో సుమా చరిత్రమును స్మరించుచు గ్రంథమును మూసివేసెను.

దేవకి యామెను సమీపించి,

" తల్లీ! నువ్వెందుకు ఏడుస్తూ ఉన్నావు! నీ కాటిక కళ్లలో నుంత్యా లేమి?" అని వాత్సల్య మొప్పఁగ నామెను గౌఁగలించుకొనెను.

"అమ్మా! సృష్టి యమృతమయము. ప్రాణికోటి సుఖానుభవ మునకే కదా, సృష్టి రాజ్యప్రవేశ మొనరించినది? ఆనందసాగరమున గరళముద్భవించునా? దేహధారులు దుఃఖితులగుదురా? సుమవన మున విషపన్నగములు నివసించునా? అమృతపానము దుఃఖప్రద

మగునా?" యని జానకి తల్లియొడిలోఁ గూర్చుండి సకరుణముగా నడిగెను.

"అమ్మా! సృష్టిలో సుఖదుఃఖాలు కలసిఉంటాయి. కేవలం సుఖమే అనుభవించిందుకి ప్రాణికి అవకాశంలేదు."

"అమ్మా! సుఖానుభవమున కలవాటు పడినప్రాణి దుఃఖ మెట్లను భవింపఁగలదు? ఆనందబాష్పములలో దుఃఖాశ్రువులు మిళితములై పోయిన నానందయోగమున నర్థమేమున్నది? ప్రాణుల సుఖావాప్తికే కదా, సృష్టికర్త శాసనములు నిర్దేశింపఁబడినవి? సృష్టికర్తకుఁ దెలి యని దుఃఖము ప్రాణుల కెట్లు సంప్రాప్తమైనది?"

"తల్లీ! సుఖదుఃఖాలు మనచేతిలో ఉన్నాయి. వాటిని కల్పించే శక్తి మనలో ఉంది."

"అటులేని మానవుఁడే దుఃఖనిర్మాతయని నీ యభిప్రాయమా? అమ్మా! నీ వ్యాఖ్యానము సరిగా నున్నది. ఉమా చరిత్రమును వింటివా? ఆ యబల కేమి సుఖమున్నది? మధుపాన విలోలుఁడు, రహస్యప్రణయప్రమోది ధనంజయుఁడే యా సుమకోమలహృదయ మున నగ్నిప్రతిష్ఠాపన మొనరించెను. అమ్మా! అగ్నిసాక్షిగాఁ జేప ట్టిన భర్తయే కులసతీప్రణయ విభంగకర్తయగునేని, యాడుదై పుట్టుట మహాభయంకర పాపఫలముగాక వేఱేమి యగును? పురుషహృద యము నిజముగా కర్కశమగునా? అటులేని స్త్రీజాతికి మోక్షము న్నదా?"

"జానకీ! నువ్వా పుస్తకం మరి చదువవద్దు. చిన్నదానివి; నీకెం దుకీపెద్దఆలోచనలు;" అని దేవకి యా గ్రంథమును దీసికొనియెను.

అనతిదూరమున గవాక్షప్రాంతమున 'ఇండియన్ పీనల్‌కోడ్'ను బరిశీలించుచున్న వసంతరావు మాతృపుత్రికాసంభాషణ మాలించి నిలువున వణికిపోయెను.

"ఆ వైద్యుడు నా యింటికి ఎందుకు వొచ్చాడు? వచ్చినవాడు పిడుగువంటి ఆ కబురు నా చెవిని ఎందుకు వేశాడు? మామాటలు జానకి విన్నదేమో?—రఘురాముడు అంతపని చేస్తాడా? సాధుస్వభావంలో దార్జన్యం ఉంటుందా? తొందరపడి అనమానం పెంచుకోరాదు. నిలకడమీద నిజం తేల్తుంది." అని యాతఁడనుకొనుచుండెను.

## ౨౦

### వాగ్వజ్రము

ప్రథమవత్సరదీక్ష పరిసమాప్తమైయుండినది. రఘురాముఁడు పరీక్షితుఁడై గృహోన్ముఖుఁడయ్యెను.

ఆతని హృదయమున నానందదుఃఖభావప్రవంతులు సమ్మిళితములగుచుండెను. జానకీ వదనమండలమును నయనానందకరముగాఁ జూచు భాగ్యము చేకూరనున్నది. జానకి తన ప్రణయాధిష్ఠాత్రి దేవత. ఆ యువతీప్రణయాపాంగనిబంధనమాతఁడభిలషించుచుండెను. కులసతీస్నిగ్ధహృదయమున శుష్కకాష్ఠవహ్నివలె నిరంతరము వెలుగు ప్రేమజ్యోతి నాతఁడు మధురభక్త్యావేశమున స్మరించుచుండెను. పురాణదంపతులు సీతారాములు; ఆ యాదిదంపతుల లోకోత్తర ప్రేమాదర్శమున కంజలిఘటించి, యనంతజీవనపథమున నా యాదర్శప్రాప్తి తన కలవడునటు లనుగ్రహింప దేవతల నాతఁడు ప్రొక్కుచుండెను.— — — — గంగ యేమైయుండును? అనంత జీవన సాగరమున నామె లక్ష్మీప్రసన్నయై విరాజిల్లుచుండునా? ప్రగాఢతమోచ్ఛాయలో విలీనమై యుండునా? ఆ సుఖస్వరూపము దుఃఖాశ్రుసిక్తనేత్రయై సాంఘికాంధకారమున నదృశ్యమై పోయెనా? ఆ యనన్య

సౌందర్యరూపమును విధాతనిర్మింపనేల? నిర్మించి దుఃఖార్ణవమునముంప నేల? ఆ యభాగిని తన జీవనసుఖమును దనయందు కేంద్రీకరించియుండెను. తన యందరమును,—కాదు,—ప్రేమను గృహాంజలియై యర్థించు చుండెను. కఠినకర్ముఁడై యాతఁడు దుదాసీనము వహించి స్థలాంతర మున నిస్తబ్ధభావనిమగ్నుఁడై పోయెను?— — —

"హా! గంగా! నీ మధురసౌశీల్యము, నీ యనంతౌదార్యము, నీ దివ్యసౌందర్యము, నీ జీవన విభ్రాంతిమునకుఁ గారణము లయ్యెనా? నీ జ్యోతిర్మయ హాసోల్లసితవదనబింబమున విషాదచ్ఛాయ పడకూడదని వేల్పుల పాదపద్మముల నివేదన మొనరించుచుంటిని. నా హృదయ పార్థనలం దుత్తేజన లేదా? మానసికారాధనవలన నసాధ్యమగు ప్రయోజనము లేదందురు.—ఆ యూర్యోక్తి సత్యదూరమగునా?

"గంగా! జానకి నా ప్రణయభాగిని; నీవు నా హృదయ దేవతవు! జానకి నా జీవనపథమును సుమప్రచయములచే నలంకరించును; నీవు దివ్యజ్యోతిర్మయ మొనరింతువు. జానకి నా హృదయమున ఖేలనాలోలయగును; నీవు నిగూఢ తపోవిభవమున మానముద్రాంకిత వగుదువు. జానకి యానందప్రదాయిని; నీవు దుఃఖప్రదాయినివి. ఆనంద దుఃఖభావసమ్మిళితహృదయమును దాల్చి నే నీ జీవనయాత్ర నెఱప వలయును. అనంతానందమున ననంతదుఃఖమున్నది. గంగా! నీవలనఁ గలిగిన యనంతదుఃఖమున ననంతానందమున్నది. నీ ముఖావలోకన మున సకలక్లేశవినాశనమగును. దుర్భరవ్యథనిద్రాణమగును. నీ సంస్మ రణమున నే ననంతదుఃఖానంద మనుభవించుచున్నాను. నీకు నే నెట్టి యుపకృతియుఁ గావింపఁ జాలనైతిని. నా హృదయదౌర్బల్యమును నీ వెంతగా నిందించితివో! శంకరపురమును వీడునపుడు నీతో భాషింప నైతిని; మాతృదేవీనయన వారి నన్ను దుర్బలునిగా నొనరించినది. నీ ముఖమును నే నింకెట్లు చూడగలను? గంగా! గంగా! నీ నామమును

బహిరంగము గా నుచ్చరించుటకైన శక్తి చాలకున్నది. నా దౌర్బల్యము నాకే యసహ్యముగా నున్నది!" అని యాతఁడు హృదయార్తులు గార్చుచుండెను.

ఆతఁడు నిజగృహమునఁ గాలుపెట్టినతోడనే యనిర్వచనీయభయాక్రాంతుఁడై పోయెను.

నిజపుత్రుని మంగళాగమనమున కెంతయు నంతసించి, యశోదమ్మ యాతని కెదురేగి,

"రఘూ! మడి కట్టుకో!" అని సాదరపూర్వకముగా ననియెను.

రఘురామమూర్తి మాతృపదములకు నమస్కరించి,

"అమ్మా! మన వారందఱు సుఖమున్నవారా?" యని ప్రశ్నించెను. గంగాక్షేమమునుగూడ మాతృముఖమునఁ దెలిసికొనవలయునని యాతఁ డుద్వేగ మొందెను. గాని హృదయావేగమును బ్రియత్న పూర్వముగా నాతఁ డణచుకొనియెను.

"నాయనా! అంతరూ కులాసాగా ఉన్నారు. మీ మామగారు మొన్ననే ఉత్తరం రాశారు: వాళ్ళ ఊరికి కొత్తగా ఎవరో సంగీతం మేష్టరు వచ్చాడట. జానకి అతని దగ్గర పాట నేర్చుకుంటూ ఉంది." అని యశోదమ్మ పలికెను.

భోజన సమయమున రఘురాముఁడు సాత్త్వికభావసంచారిత హృదయుఁడై,

"అమ్మా! తిరిగి యెన్నిదినములకు నీ యమృతహస్తములతో నాకు భోజనము బెట్టితివి? ఈ సంవత్సరమధ్యమున నీ నాఁటికి మఱల భోజనసుఖము ప్రాప్తించినది. అమ్మా! నా హృదయమున నొక పాత్రిగాయ మింకను బచ్చిగానే యున్నది. చిరవ్యథాకులితమగు నా హృదయమున నీ యమృతలేపనముఁ గావింపవలయును. నా వర్తనమునుగూర్చి లోక మేమనుకొనుచున్నది?" అని యాతఁ డడిగెను.

"రఘూ! అనవసరంగా నీకు ఎంత విచారం కలిగించాను! అది—ఎవడో పాలేటలుదాని కొడుకట—వాడితో పారిపోయింది! నీమీద నిందమోపిన వాళ్ళు నిన్ను నిష్కారణం ఎంచినందుకు పశ్చాత్తాపం పొందుతూన్నారు. దాని మా నాన అది పోయింది. నవ్వింక విచారించకు!" అని యశోదమ్మ ప్రత్యుత్తరపూర్వకముగా నగిరొను.

"అమ్మా! గంగ పారిపోయినదా?—ఎంత పనిచేసినది?—నిజముగా—పారిపోయినదా? పాలేటలు వానితోఁ—బారిపోయినదా? ఆమె యిప్పు డీ యూరలేదా? కాంతమ్మ యేమైనది?" అని రఘురాముఁడు విభ్రాంతుఁడై యడిగెను.

„నాయనా! తెక్కలొచ్చిన పిట్ట—ఎగిరిపోకుండా ఉంటుందీ?—సమయం చూసి దారి తీసింది. మొన్న చవితినాడు కాంతమ్మ దగ్గు రోగంతో బాధపడి చచ్చిపోయింది. చచ్చిన నక్షత్రం మంచిది కాకపోవడంచేత ఆ ఇంట్లో కొత్తవాళ్ళు అద్దెకి దిగలేదు.—పాపం! ఎంత చక్కని పిల్ల పాడైపోయింది!" అని యశోదమ్మ పలికెను.

రఘురాముఁడు భోజన మెట్టులో కావించి శయనాగారముఁ జేరుకొనియెను.

## ౨౧

### ఏకాంతవిలాపము

„గంగా! ఎంత పనిచేసితివి! సౌందర్యము పాప చింతారహితమని విశ్వసించితిని. జగదేకసుందరివి! నీ పాదపద్మ సంస్పర్శవలన మేదిని పుణ్యప్రాభవరంజితయని నమ్మితిని. నీ దివ్యరూపసందర్శనమునఁ గలుషభావము తిరోహితమగునని యూహించితిని!

"గంగా! ఎంతపని చేసితివి! నీవు కఠినాత్మురాలవు గావు. స్వార్థపరత్వము నీ యందు లేశమాత్రమైనను జూపట్టలేదు. ఇహలోకభోగాసక్తి నీ హృదయమున స్ఫురింపలేదు. నీ కోమలహస్తములతో నీ కోమలగళమును గోసికొంటివా? అనంతసుఖప్రదాయినీ! నాకీయనంత దుఃఖ మేల కల్పించితివి?

"గంగా! ఎంతపని చేసితివి! నీ పద్మాననమును దిలకించుభాగ్య మిఁక నాకీ భవంబునఁ గలుగదా? హాసమయివి; విషాదభోగమాశించితివేమి? నీ హృదయము పుణ్యప్రభావ విరహితమేని, పుష్పములలో సౌరభ ముండునా? మణిశలాక కాంతిమంత మగునా? ముక్తాఫలము లావణ్యరంజిత మగునా? చంద్రిక సుధామయ మగునా? గంగా! గాంగనిర్ఝరిణీజలసదృశమగు నీ యానంద మే మరుభూమిలో నింకిపోయినది? పుణ్యప్రదమగు నీ చారిత్ర మెట్లు కలుషితమైపోయినది? లోకకల్యాణార్థ మవతరించిన నీ వెట్లు లోకాపవాదమునకు వెఱువవైతివి? వివేకదీపికాకలిత హస్తములతో నీ వెట్లు నిబిడాంధకారమునఁ బడిపోయితివి? స్త్రీలలాటమున సౌశీల్యము విస్పష్టముగా దృగ్గోచర మగుచుండును; స్త్రీజన శిరోమణివి; గంగా! దుశ్శీల వెట్లయితివి. నీ విట్లాచరింతువని నే నొక్కనాఁడైనఁ దలంపనైతిని!...

"ఎంతపని చేసితివి. గంగా! జగన్మోహన విగ్రహము హా! త్రుటిలోఁజూర్ణవిచూర్ణమైపోయినది!—ఆహా! వికసిత ప్రాభాతనళినీ సదృశ వదనము—మఱి నేఁ జూడఁజాలనా? ప్రేమరసతరంగిత నీలోత్పల నేత్రములు—నా చూపులలోఁ గలియుభాగ్య మింక లేదా? శరచ్చంద్రికా సమమధుమయహాసము—నా కీ భవమునఁ గఱవైపోయెనా? స్థిరసౌదామినీ తుల్యతనూవిలసనము—మఱి నాకంటఁ బడదా? గంగావతారమును మఱి నే సందర్శింపఁజాలనా? ఎంతలో నెంత

దారుణమగు మార్పు! చూచుచుండఁగనే యమృతమున విషానల ముద్భవించినది!—

“పురప్రవేశ మొనరింపఁగనే నీ ముఖము నా కెదురగునేమో యని భయపడితిని. నా హృదయము మెఱింగి యీ యాత్మవినాశము సంకల్పించితివా? గంగా! ఆత్మ ప్రబోధమున నీ వింతటి దారుణ కృత్య మొనరించియుండవు; నిన్ను నే నెఱుంగనా? చిరపరిచితుఁడ నగు నాతో భాషించునపుడే నిలువున లజ్జాతిరేకమున సంచలించు దానవు; పరపురుషునితో స్థలాంతరమున కెట్లు గమనింపఁ జాలుదువు? గంగా! నా హృదయశోణితము మహాగ్నిలో నింకిపోవుచున్నది. అమృతమయీ! నా కెట్టి యాతనఁ గల్పించితివి! కడకు, అబ్బా!—తలఁచుకొనుటయే కష్టసాధ్యము!—నీ వెట్లంగీకరించితివి?

“గఁగా! ఎంతపని చేసితివి! నిజముగా నీ వీ యవమానమున కంగీకరించియుందువా? మనోవాక్కాయకర్మల నెట్టి పాపమును జేసియెఱుంగవు; ఎంత ఘోరపాపాచరణమున సాహసురాల వైతివి! నితాంతపావపుణ్యములు సులభసాధ్యములు గావు. ఈ ఘోరభైరవకల్మష వ్యాపారము నీ కెట్లు సులభసాధ్య మయ్యెను? * *

“గంగా! నీ సుఖమును నీ చేతలతో మహాగ్నికుండమునఁ గాల్చివేసితివి! సమాజమునకుఁ జెందవలసిననింద నీ శిరమునఁ దాల్చితివి. నీపై నీకుఁగల కసిదీర్చుకొంటివి. మధురహాసమునఁ గర్కశభావప్రకటనముఁ గావించితివి! స్వప్నరంగమునన్నైన నిట్టి భయంకర వ్యాపారమును నేను జూడఁజాలను! వాస్తవతామూలకమగు నీ దృశ్యము నేనెట్లు భరింపఁగలను?—

“నా హృదయమును నీ వెఱుంగవా? గంగా! నీ వ్రేళులు గాల్చిన నేను గన్నులు మూసికొందును. నీ యీ పాపకృత్యము నా హృదయమును గోసివేయునని నీ వెఱుంగవా?

"గంగా! ఎంతపని చేసితివి? నే నిప్పుడు నిప్పులలోఁ బొరలాడుచున్నాను! నా కింతకష్టము కలుగునని నీవెఱుంగవా?—హా! నీభృగుపతనమునకు నేనే మూలకారణము! సమాజనిబంధనలకు శిరము వంచి, నీ హృదయదుఃఖమును జూడఁజాలక పోయితిని. నా యుదాసీనమునకుఁ దగిన ప్రతిహింస కావించితివి!" అని యింకేమేమియో యోజించుచు రఘురామమూర్తి శయ్యాతలమున నిర్విణ్ణుఁడై, నిర్నిద్రుఁడై, పడియుండెను.

మఱునాఁటి యుదయమున నాతఁడు శయ్యాపరిత్యాగముఁ గావించి, తన దినచర్య పుస్తకములో నీ క్రిందిగీతమును వ్రాసెను:—

"విమలప్రాభాత మల్లికాపిలసనంబు,
కనకకేతకీ సుకుమార కాంతిగరిమ,
లలిత శారద చంద్రమండలము సొగసు,
కలిసి తులలేని మాధుర్య మొలుకునెంచు,
నా నగుమొగంబుఁ జూచు భాగ్యంబు మఱల
కలుగునే నాకుఁ బలు జన్మములకునైన?
సాంద్రభూరిలతాశీతలచ్ఛాయ లందు,
నవ్యలీలాభినయముల నాట్యమాడు
ప్రేమభూషిత వీక్షణ విభవ మెసఁగఁ
బచ్చివగడాల కెంపు సంపద హసించు
నధరమున దంతధవళిమ యలముకొనఁగ,
దివ్యసౌరభ కలిత దేదీప్యమాన
మా నగుమొగంబుఁజూచు భాగ్యంబుమఱల
కలుగునే నాకుఁ బలు జన్మములకునైన?
విరులు తొడిఁగిన లతకూన కరణి, సలలి
తస్మితంబున నునుసిగ్గు తళుకుఁగులికి

మలయు చందమున, మలయమారుతమున
నలరుల సువాసనలు లీనమైనమాడ్కి,
త్రిభువనామోద సౌందర్య విభవమందు
విమల ప్రేమాను భావము వెలయునట్లు,
బాల్య యౌవన భాగ్య సౌభాగ్యమిళిత
మా నగు మొగంబుఁ గాంచు భాగ్యంబుమఱల
కలుగునే నాకుఁ బలుజన్మములకునైన?
దుఃఖతిమిర మందునఁ ద్రొవ్వఁ ద్రోఁగునపుడు,
నాదు దృక్పథంబును మహానంద బాష్ప
కలిత మొనరించి దీపమువలె వెలుఁగు
నా నగు మొగంబుఁ జూచు భాగ్యంబుమఱల
కలుగునే నాకుఁ బలుజన్మములకునైన?"
తిమిర మందున జీవన దీప మార్పి,
నే ననంతపథంబున నేగునపుడు,
ఆ నగు మొగంబుఁ జూచు భాగ్యంబు మఱల
కలుగునేని నా కదియు స్వర్గంబు కాదె?॥."

## ౨౨

### వాహ్యాళి

రఘురాముని యాగమనవార్త నాలించి వసంతరావు శంకరపుర ప్రయాణము సంకల్పించెను. హృదయాందోళన కారణమున నిజ గృహమునఁ దన కొక నిమిషము యుగముగాఁ దోఁచుచుండెను. భావపరంపర హృదయమును గలంచివేయుచుండెను. సంశయవిచ్ఛేద

నమైనఁగాని, తన కాత్మశాంతిలేదు.

ఒకనాఁటి మధ్యాహ్న మాతఁడు జామాతాగృహమునఁ కరిగెను. రఘురాముఁడు తాఁ బెంచిన పిల్లికూనను నొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని యేమేమియో యోజించుచుండెను. మామగారినిఁ జూచిన తోడనే యాతఁడు మార్జాలపుత్రిని అంకతలమునుండి తొలఁగించి, యాతని కెదురేగి ప్రణమిల్లెను.

ఆశీర్వాదపూర్వకముగా నల్లుని లేవనెత్తి, వసంతరావు,

“రఘురామా! మెడ్రాసునుంచి రాయడమే కాని ఇక్కడికి వచ్చిన తరవాత ఉత్తరం రాశావు కావేమి? మీ పరీక్షలైపోయాయా? పరీక్షకాగితాలు బాగా రాశావా?” అని యడిగెను.

“విద్యావిషయమున నెట్టి లోపములును గలుగలేదు. శక్తివంచన లేక పరిశ్రమ గావించితిని.” అని రఘురామమూర్తి బదులు పలుకుచు రత్నకంబళమును బఱచి,

“మామా! ఈ యాసనమున నధివసింపుఁడు.” అనియెను.

యశోదమ్మ వంటయింటిలోఁ జలువ నీడను నిదురించుచుండెను. ఆమె మేలుకొని, యీవలికి వచ్చి, వసంతరావును జూచి,

“ఓహో! అన్నగారా! తలవని తలంపుగా వచ్చారు! మావదిన క్షేమంగా వుందా? మాకోడలు మాణిక్యం సంగీతం నేర్చుకుంటూ ఉందట!” అని మందస్మితవదనయై పలికెను.

వసంతరావు చిఱునవ్వు నవ్వి,

“అందఱూ క్షేమంగానే ఉన్నారు. మిమ్మల్ని ఒకసారి చూచి పోదామని వచ్చాను.” అనియెను.

యశోదమ్మ వంటయింటి కరిగి, యుదయమునఁ జేసిన చిట్టిబూరెలను పళ్ళెరములో వేసి, రఘూ! యని పిలచెను.

రఘురాముఁడు వడివడి నడచి పోయి యామెను సమీపించెను.

"మీ మామగారికి ఇయ్యి కాఫీకాచి తెస్తా" అని యామె యా పళ్ళెరమును రఘురామునికందిచ్చెను.

వెండిచెంబులో మంచినీళ్లు సంగ్రహించి రఘురాము డావళ్లెరమును నీళ్లచెంబును మామగారి యెదుటఁబెట్టెను.

"భోంచేసి వచ్చాను, ఇవన్నీ ఎందుకు!" అని వసంతరావు మర్యాదపూర్వకముగా ననియెను.

" ఉదయమున భోజనము చేసియుందురు. మీరు స్వీకరింపవలయును." అని రఘురాముఁడు సవినయముగా ననియెను.

పెంపుడు పిల్లి ద్వారబంధము నుంగల నొడలు ముడుచుకొని యర్ధనిమీలిత నేత్రములతోఁ బళ్లెరము వైపు ధ్యానపూర్వకముగా విలోకించుచుండెను.

వసంతరా వాయుల్పాహారమును స్వీకరించి, జలపానముఁ గావించెను. అంతలో యశోదమ్మ కాఫీ కాచి, తెచ్చి, యతని సమీపమునఁ బెట్టెను.

"నీళ్లు తాగాను చాలదూ, కాఫీ కూడా ఎందుకు!" అని వసంతరావు పలికెను.

"కాఫీ మీకు అలవాటే కదూ, పుచ్చుకోండి." అని యశోదమ్మ సుమధురస్వరమునఁ బలికెను.

వసంతరావు కాఫీ త్రాగి, రఘురాముఁ డంతలో సమర్పించిన, తాంబూలమును సేవించుచుండెను.

"అన్నగారు తోవతప్పి వచ్చినట్టుంది." అని యశోదమ్మ యనెను.

"మిమ్మల్ని చూడాలనే వచ్చాను. నాకే వూళ్ళో పనేముంది?— రఘురామా! వేసంగి సెలవులు రెండు నెలలుకదూ? కిందటేడు సెలవులని మాయింటి కొచ్చావు. నిన్ను చూడాలని మీ అత్త చాలా

తొందరపడుతూ ఉంది. మాఇంట్లో పది పూటలు గడపరాదూ!" అని వసంతరావు పలికెను.

« ఏదీ, వచ్చి రెండురోజులేకదూ ఐంది? మీ ఇంటికి రాకుండా వెళ్ళిపోతాడా ఏమిటి? మంచి రోజు చూసి పంపిస్తాను." అని యశోదమ్మ యనెను.

« ఆమాత్రం దయ ఉంటే చాలును." అని వసంతరావు వివిధ విషయ ప్రసంగమునకుఁ గడంగెను.

సూర్యభగవానుఁడు పశ్చిమాశాంతమున మునిఁగి పోవుచుండెను. రవిబింబము సుందర లోహిత వర్ణాంచితమై నేత్రా నందకరముగా నుండెను. పశ్చిమాకాశము సిందూరమయమై హృదయాహ్లాదమొన గూర్చుచుండెను.

ఆసుమధుర సంధ్యాసమయమున వసంతరావుజామాతా సహితుఁడై పురపరిసర రసాలవనమునకు వాహ్యాళి వెడలెను.

వివిధ కథోప కథనముల ననురక్తులై వారిరువురు కొంతదూరము నడచిపోయిరి. నిశ్శబ్దానంద బంధుర వనప్రదేశమున దట్టంపుపచ్చని పచ్చికసెజ్జపైఁ గూర్చుండి వారిరువురు ఫలవంతమైన యా వనరామణీయకము నభివర్ణించిరి.

వసంతరావు లోకజ్ఞానము గలవాఁడు. అల్లుని హృదయ రహస్యమును గ్రహింప బ్రబల ప్రయత్నము గావించుచుండెను.

రఘురాముఁ డా మధువన దృశ్యావలోకనమునముగ్ధుఁడైపోయెను. శ్వశుర నేత్రమునఁ బరిశోధన దృష్టి నాతఁడు గమనింపలేదు.

«రఘురామా! మీవీధిలో గంగ అనే పిల్ల ఉండేది కదూ? అది ఇప్పుడెక్కడ ఉంది?" అని వసంతరావు అల్లుని నడిగెను.

« ఆమె యిప్పుడెచ్చట నున్నదో నాకుఁ దెలియదు." అనిరఘు రాముఁడు చకితుఁడై యుత్తర మొసఁగెను.

"నీకాపిల్ల బాగా తెలుసునా?"

"తెలియును."

"మీ ఇద్దరికి చిన్నప్పటినంచి స్నేహంకదూ!"

"అవును."

"ఎక్కడ ఉందో నీకు తెలీదూ ఐతే?"

"తెలియదు—మామా! మీయుద్దేశమును నేను గ్రహించితిని. ఆ బాలికను నేను పరిణయమగుదునని లోకాపవాదము కలిగినది; కాని నేను కర్తవ్యకార్యవిముఖుఁడను గాను. గంగను బరిణయమాడి జానకిని విసర్జింతునని మీకనుమానము కలిగినది. అట్టి యనుమానము లోకమునకు గలిగిన యంతనే నే నపరాధినిగాను. గంగాజీవనమును గతినాత్ముడనై విధ్వంసనమొనరింప సాహసింపను. జానకీ జీవన కుఠారమునై నే నీలోకమునఁ దిరుగఁ జాలను. నాయుద్దేశమును మీరు గ్రహించితిరా?" యని రఘురాముఁ డభిమానాశ్రుపూరిత నేత్రుండై పలికెను.

"రఘురామా! నీయందు నాకు అనుమానం లేదు. గాని గంగకి నువ్వెట్టి వాగ్దానం చెయ్యలేదా?"

"లేదు. అది యనాథబాలిక. మోహాంధుఁడనై యామె కన్యాత్వమును హరించుటకు నే నెన్నఁడును సంకల్పింపలేదు. అట్టి కుటిల విచారము, దంభప్రతిజ్ఞ, అమానుష ప్రవర్తన నా హృదయమున జనింపలేదు. వివాహితుఁడనగు నే నామెకెట్టి వాగ్ప్రదానమునుగావింపఁ జాలను; అట్టియధికారము నాకు లేదు. ఆ బాలిక సాంఘికాంధకారమున మునిఁగి పోవుచుండ బాష్పసిక్త నేత్రములతో నామెను జూచుచు, నా యసమర్థతకు దుఃఖించుచుండెదను. జానకీగళమున మంగళసూత్రబంధనముఁ గావించినప్పుడే మహాత్తరధర్మ సూత్రముచే నేను బంధింపబడితిని. జానకియందు నాకెట్టి యభావమును లేదు. జానకి

మీమస్తకమణి, నా హృదయేశ్వరి. ఈశ్వరానుగ్రహము వలనను, బూర్వభవార్జిత పుణ్యపరిపాకము వలనను జానకి నాకు భార్యయైనది. జానకి నాప్రణయాధికారిణి. గంగ—హితభాగిని గంగ—నాహృదయ కారుణ్య భాగిని. నాహృదయ దయావిభాగమున మీయాపత్తి యేమున్నది?" అని రఘురాముఁడుత్తేజభావమున నడిగెను.

"రామా! సమాజంమాట మరచిపోయావు. సమాజంలో నిందిత ఐన ఆడదాని విషయంలో మనం మూకీభావం అవలంబించాలి. నీ హృదయం చాల మెత్తంది. గంగ దయకు అర్హురాలు కాదని నేను చెప్పడంలేదు అర్హురాలే; కాని లోకానికి వెఱచి, మనంమెలగవలసి ఉంటుంది." అని వసంతరావు సాభిప్రాయపూర్వకముగా వచియెను.

"మామా! మీరునిర్వచించినధర్మమును నే నెఱుంగుదును. చాల కాలమునుండి నా హృదయమును గలంచి వేయుచున్న భావములు నన్నిప్పుడు మ్రింగివేయుచున్నవి. సమాజము రక్తకలుషితసంస్థ. సమాజ నిబంధనలు నిస్తేజములై, వజ్రముకంటె గఠినతరములై పోయినవి. అనాథాబాలికా బాష్పములనుగ్రోలి సమాజ మెన్నాళ్ళు గౌరవపతాకముధరింపఁగలదు? వ్యక్తిత్వవిహీనమగు సమాజమునకుమనమెన్నాళ్లు శుశ్రూష చేయఁగలము? ఈశ్వర సంకల్పమునకు విరుద్ధమైన సమాజమును నేను మన్నింపఁజాల"నని తనలోఁ దాను విలీనమగుచున్న సమాజమును మన ముద్ధరింపలేము.— మృతప్రాయమైన సమాజమునకు ధిక్కారము!—"

"ఐతే, నువ్వు సంఘసంస్కారివా? గంగను పెళ్ళాడి,—"

అర్ధోక్తిలో రఘురాముఁడు,

"ఆ యనుమానము మీకు వలదని నివేదించుచుంటిని. నేను గంగను బరిణయమాడుటకు నిశ్చయింపలేదు. ఆవిషయమున నాకెట్టి యౌత్సుక్యమును లేదు. గంగవంటి యనాథబాలికల నయనవారిఁదుడు

చుటకే స్థిరసంకల్పుఁడనైతిని. నా యీ విశ్వాసమున కెట్టి యంత
రాయమును గలుగనేరదు."

"శాస్త్రవిరుద్ధం ఐన పనులు చెయ్యవచ్చునా? వెలివెయ్యరా పెద్దలు;"

"శాస్త్ర విరుద్ధమైనచో బాధలేదు; ఈశ్వరేచ్ఛకు విరుద్ధములగు కార్యములు మానవుఁడు చేయరాదు. ఇది నా యాత్మ విశ్వాసము."

"నువ్వు చిన్నవాడివి; లోకజ్ఞానం లేని మాటలాడతావు. ముందు ముందు కష్టసుఖాలు నీకే అనుభవంలో బోధపడతాయి."

సంధ్యాంధకారము జగద్వలయము నావరించెను. సంధ్యావందన గీతములను బాడుచు విహంగములు నిజకులాయడోలికల కెగసివచ్చెను. సంధ్యాదీపావళి ప్రత్యేకగృహాభ్యంతరము నలంకరించెను.

రఘురాముఁడు శ్వశురదేవునితో గృహమునకు మరలివచ్చెను.

౧

## ప్రణయ లేఖ

సన్ముహూర్తమున రఘురాముఁడు శ్వశురగృహమునఁ బ్రవేశించెను. దేవకి యల్లుని యాగమనమున కెంతయు సంతసించి, సమాదరణపూర్వకముగా,

“నాయనా! ఆ మంచంమీద కూర్చో” అనియెను.

జానకి కవాటప్రాంతమున నిలువఁబడి, ప్రాణేశ్వరుని, తేజోమయ విగ్రహమును గటాక్షమాలికలచే నలంకరించుచుండెను.

కామకళా కవితాధోరణి కిప్పుడామె జడియునది కాదు; ఆకిశోరీభావమా స్వర్ణవిగ్రహమున విలుప్తమై పోయినది.

గంగా చరిత్రము నామె కర్ణాకర్ణికగా నాలించియుండెను. తన హృదయేశ్వరుఁడు, జీవనవల్లభుఁడు అన్యకాంతా ప్రణయనిబద్ధుఁడై, తన జీవనసుమమును ద్రెంపివేయునని యామె లేశమాత్రము సంశయాధీనయై యుండెను. ఆ కారణమున నామె యసాధారణ సాహసప్రదర్శన పూర్వకముగా నాతని విశాలనేత్రములను బరిశీలించుచుండెను. ఆ విస్ఫారిత నయనద్వయమున నామె దివ్యప్రేమ తేజమును విలోకించెను. ప్రేమస్వరూపుఁడు ప్రేమాధీనయగు నిల్లాలిని విసర్జించునా? ప్రేమతత్త్వవిశారదుఁడు ప్రేమమునఁ గపట మూహించునా? ప్రేమారాధన తత్పరుఁడు ప్రేమదీపము నార్పివేయునా?—జానకి హృదయభారము తొలఁగిపోయెను. ఆ ప్రణయప్రసన్నహృదయమును శంకించిన తన యపరాధమున కామె పశ్చాత్తాప మొందుచుండెను.

ఐదు దినములు గడచిపోయెను. * * * *

ఆరవనాఁటి సాయంసమయమున జానకి రఘురాముని కొఱకు

స్వయముగా సురభిళ సుమశయ్యావిరచనఁగావించెను. అగరుధూపము లచే నాగారమును శుభ్రపఱచెను. గదిలో నామె యొక్కతయే యుండెను. వినయ వినమితయై యా ప్రణయిని శయ్యాతలమునకు నమస్కరించి,

“ప్రణయాధినాథా! మీ చరణదాసిని. మిమ్ములనే నమ్మి జీవన సుఖముల ననుభవింప సంకల్పించితిని. నన్నెట్లు పాలింతురో, మీహృదయమునఁ గల ఈశ్వరున కెఱుక.” అని యంజలిఘటించి నివేదన పూర్వకముగాఁ బలికెను. ఆహృదయప్రార్థన మెవ్వ రాలించి యుందురు? భగవంతుఁడే యాయువతీ హృదయమున నట్టి ప్రబోధముఁ గావించెను; భగవంతుఁడే యాప్రార్థన మాలించుచుండెను!

రాత్రి పదిగంటలైనది. జానకి మాతృదేవి సమీపమున నిద్రితురాలై యుండెను. ఆమెకు బాగుగా నిదురపట్టుటలేదు.

ఏమేమియో దుస్స్వప్నము లామెకు నిద్రాభంగము గలిగించుచుండెను. ఆమె మెల్లన లేచి ప్రక్క గదిలోని కరిగి దీపమును వెలిఁగించెను. కలమును కాగితమును సంగ్రహించి యొకలేఖ వ్రాసెను. ఆమె నేత్రములు సిక్తములై దీపకాంతిలో మిల మిల మెఱయుచుండెను. మెల్లన దీపము నార్పి యా భీతహరిణాక్షి చడి చప్పుడు లేక రఘురాముఁడు నిద్రించుచున్న గదిలోఁ బ్రవేశించెను.

రఘురాముఁడు దీర్ఘయోజనా ధీనుఁడై, నిమీలితనేత్రుఁడై యుండెను. జానకి యాతని సమక్షమున నిలువఁబడియెను.

రఘురాముఁడు కన్నులు విప్పి యా రత్నపాంచాలికను విలోకించి నిర్భరానందమున మాటాడఁ జాలకపోయెను. జానకి యాతని పాదములను గన్నుల నద్దుకొని తాను వ్రాసిన లేఖ నాతని కరకమలమున సమర్పించి, యీవలికి నడచివచ్చి, తనతల్లి ప్రక్కలో యథారీతి శయనించెను.

రఘురాముఁ డత్యంతాతురితుఁడై దీపమును సమీపించి, యుత్త రమును విప్పి, లోలోన నిట్లు చదువుకొనియెను!

"ప్రాణేశ్వరా!

శతకోటి పుణ్య వ్రత ఫలము నేఁడు నాకుఁ జేకూరినది; నేను ధన్యురాలను! మీ చరణసేవ యీ మందభాగ్యురాలికి లభింపదని లోకము వేనోళ్ళఁ జాటినది. లోకాపవాదము నా కర్ణగోచరమైనప్పుడు సంశయ డోలాయమాన మనస్కనై యంధలోక మొనరించిన యపరాధమునే నే నొనర్చితిని. నే నపజ్ఞురాలను. మీచరణధ్యానమే పరమావధిగా నంస్మరించు దానను. లోకాపవాదమున సత్యాసత్య విమర్శన నా కవసరములేదు. మీ పాదపూజా విధానమున వంచితురాలను గాకుండు నేని నా జన్మము సార్థకమగును; నా జీవనము పుణ్య ప్లావితమగును!

"హృదయేశ్వరా!

గిరికుమారి పార్వతీదేవి యేహృదయముతో మహేశ్వరునిఁ బూజించెనో, సీతామహాదేవి రఘువంశరత్నమును ఏహృదయముతో సర్వ కాల—సర్వావస్థల సేవించెనో, మహాపతివ్రత సావిత్రి చిత్తాశ్వుని నే హృదయమున మరణానంతరమునఁ గూడ నారాధించెనో, రాధారాణి శ్రీకృష్ణ భగవానుని ఏహృదయమున యమునాతీరస్థవనభూములలో నర్చించెనో, యా హృదయముతో మీ పాద పద్మములను బూజించి, సేవించి, యారాధించి, యర్చించుచుందును. నాధ్యాన నేత్రమున మీ శ్రీ చరణములే విరాజిల్లు చుండును. భక్తులయెడ భగవంతున కుదాసీన భావము గలుగదు!

"ప్రాణేశ్వరా!

నా యపరాధమును మన్నించి, నన్నను గ్రహింపుఁడు. లేఖాముఖమున నా హృదయ మెఱింగించి నందుకు నన్ను క్షమింపుఁడు.

మీ చరణదాసి,

"జానకి"

రఘురాముఁ డాయుత్తరమును గనులనద్దుకొని,

"పెట్టిజానకి యెన్ని కన్నీళ్ళుగార్చినది! నిరుద్దేశపూర్వకముగా నే నామె నాకెట్టి దుఃఖ మాపాదించితిని. జానకీ! నీ యందు నా కెట్టి యభావమును లేదు. నిన్ను వంచించుటకు నేను బ్రయత్నమునరింపలేదు. నీకీ యనవసర వ్యథ నావలనఁ గలిగినది—కావున నేనే నీ తునుకర్హుఁడను!" అని యాతఁడనుకొని, దీపమును, తగ్గించి, శయ్యాతలమున మేను వాల్చెను.

## ౨

### పరమ ప్రమాదము

మఱునాఁటి యుదయమున వసంతరావు రఘురామమూర్తినిఁ దన ప్రక్కఁ గూర్చుండఁ బెట్టుకొని,

"రఘురామా! మీ కాలేజీ తిరిగి ఎప్పుడు తెరుస్తారు?" అని యడిగెను.

"జూలై మూఁడవ తారీఖున."

"ఐతే ఇంకా ఆరు రోజులేనా సెలవుంది?"

"మామా! రెండురోజులు ముందుగా నేను మదరాసు చేరవలయును. ఈ సంవత్సరము విక్టోరియా హాస్టలులోఁ జేరవలయునని యుద్దేశించితిని. అచ్చట వసతి యారోగ్యప్రదముగా నుండును; భోజన సదుపాయముకూడ శ్లాఘనీయము."

"నీ కేలా సదుపాయం ఐతే అలా చెయ్యవచ్చును."

"నేఁటి సాయంకాలము బండిలో నేనేనింటికిఁబోయెదను. రేఁపు మాయింటివద్దఁ గడపి, యెల్లుండి మెయిల్లో మదరాసు నగరము

నకుఁ బ్రయాణ మయ్యెదను. మామా! నేను దిరిగి వేసంగి సెలవులకుఁ గాని మఱి రాఁ జాలను. నాయందు మీ కెట్టి యనుమానమును వలదని మఱియొకసారి కరాంజలిఘటితమస్తకుఁడనై మీ పాదసమీపమున నివేదించుచున్నాను. జానకినిఁ బరిత్యజించుటకు నే నెన్నఁడును సంకల్పింపలేదు. ఆమె హృదయమున మహాగ్ని రవులుకొలుప నే నూహింపలేదు. నే నంతటి కఠోరకర్ముఁడను గాను. జానకి నా సహధర్మచారిణి. కులసతీ నయనము లశ్రుపూరితములైన నా కభ్యుదయము లేదని నే నెఱుంగుదును. మామా! నా యందణుమాత్రమైన మీ కనుమానము వలదు. ఇదియే నా యంత్యప్రార్థన. నిరుద్దేశపూర్వకముగా నేను మీ యంతరాత్మ నాక్రోశింపఁ జేసితిని; నా యపరాధమును క్షమింపుఁడు. జన్మజన్మాంతరములఁ గూడ జానకియే నా సహధర్మచారిణి యగును గావుత మని నేను భగవంతుని సమక్షమునఁ బ్రార్థించుచుందును. మా సనాతన ప్రణయసంబంధము విచ్ఛిన్నము కానేరదు. ఇది నా యాత్మవిశ్వాసము." అని రఘురాముఁడు పలికెను.

జానకి కవాట సమీపమున నిలువఁబడి యా సుమధురవాణి నాలించుచుండెను.ఆమెవిన్నాలించుచున్నదని రఘురాముఁ డెఱుంగును. ఆ యువతీచంపక సదృశనాశిక సువర్ణముక్తాఫలశోభితమై కవాట రంధ్రమున విస్పష్టముగా నాతనికి దృగ్గోచరమగుచుండెను. ప్రకంపిత హస్తములతో నామె విరచించిన ప్రణయలేఖకు సముత్తరపూర్వకముగా నాతఁడు మామగారితోఁ దన హృదయరహస్యమును బ్రకటించియుండెను. ఆ ప్రణయప్రబోధవాక్యములు తన హృత్తాపశమనమునకు నిర్దేశింపఁబడినవని యా యువతి గ్రహించెను. ఆమె హృదయమున జల్లునఁ బూవులవాన కురిసెను; నేత్రములు ప్రేమాశ్రుసిక్తములై పోయెను. ఆతనిని బిగియారఁ గౌఁగిలించుకొని, యాతని రమణీయ

లావణ్యమయ కపోలమును ముద్దాడవలయునని యూతం డాకాంక్షు వొడమెను; గాని లజ్జాభరమున నామె నిలువునఁ జలించిపోయెను.

సాయంసమయమున రఘురామమూర్తి ప్రయాణోన్ముఖుఁ డయ్యెను. జానకి గవాక్షమార్గమున నా ప్రేమమూర్తిని విలోకించు చుండెను. రఘురాముఁ డామె నొకసారి ప్రఫుల్లనేత్రుఁడై చూచెను. "జానకీ! హృదయేశ్వరీ! పోయివచ్చెదను; నీవు నా ప్రణయాధిదేవతవు!" అని యా చూపులు విస్పష్టముగా నెఱింగించుచుండెను. ఆలేఖ్యసుందర దరహాసవదనయై జానకి యా ప్రణయకటాక్షసందేశమును హృదయంగమముఁ గావించుకొనుచువివశయై పోవుచుండెను.

## 3

### తపస్విని

భువనవిఖ్యాత, పురాణకీర్తిత, భువనేశ్వరము (ఏకామ్రకాననతీర్థము) బౌద్ధధర్మ రంగభూమి, ఖండగిరి శిరోవతంసమై భక్తుల నేత్రములను విముగ్ధ మొనరించుచుండెను. దేవప్రియుఁడు, ప్రియదర్శి, యశోక చక్రవర్తి యమ్మహాపుణ్యాము తీర్థేశ్వరిని, భక్త్యుల్లాసోస్థితభావమున సేవించియుండెను. ఆపుణ్యక్షేత్రము రాజశ్రీ మండిత, విపులగౌరవమయ కేసరీ వంశరాజధానియై, విక్రమవిభవమున భాసిల్లియుండెను. ఆయుత్కళ గౌరవ నిధానము, శిల్పరత్నాకరము, మయ విరచిత మాయానగరీ సమానమై, మానవహృదయ విశ్వాసబలమును నిరూపించుచుండెను. ఆ గంభీర గుంఫాగుంఫిత భూధరము పుణ్యతాపస నివాసమై, యోగిజనప్రశాంత సమాధిక్షేత్రమై, శతశత దేవాలయ

విమండితమై, మనోజ్ఞపురాణ మహిమను బ్రకటించుచుండెను.

"అహింసయే పరమధర్మము" అను మహాపుణ్యమంత్రము, ప్రాణపులకిత, స్వర్గీయ, రోమాంచపూర్ణ మహావాక్యము, దిగ దిగంత ప్రచారిత శాంతిమయ సుశాసనము, ఖండగిరి ఫాలభాగమున సమరాక్షర సంకలితమైయుండెను. బౌద్ధశ్రమణ శ్రమణీ సమాజము హామంత్రోచ్చారణ మున నిర్వాణభాగ్య భోగమనుభవింపఁ బ్రయత్నించుచుండిరి.

యోగి యోగినీదళములు భువనేశ్వరాలయప్రాంగణమునఁ బ్రాయోపవిష్టులై, " భువనేశ్వరుఁడే యేకేశ్వరుఁడు! " అను మహా,విశ్వాసమును జపించుచుండిరి.

యాత్రిక జన సమూహ యాన్వేషణమునఁ బండా తండ మిటునటు విన వినఁ దిరుగుచుండెను.

ఘంటికా నినాదపూర్ణంబును, యాత్రికజన కోలాహల సంకులంబును భైక్షుకజన దీనార్తనాద ప్రతిధ్వనితంబును, నగు నామహాలయ ప్రాంగణము విశ్వ హృదయమువలె గంభీరభావ పూర్ణంబునై యుండెను.

ఆలయ సోపానమునఁ గాషాయ వస్త్రధారిణి, మహాతేజస్విని యువతి యొకతె నిమీలిత నేత్రయై నిలువఁ బడియుండెను. ఉషాదేవి తుషార శుభ్రపరిశాంతలలాటమువలె నా సన్న్యాసినీ ఫాలము వెలుఁగుచుండెను. త్రిదివపుణ్య పుంజమా మహనీయురాలి తరుణమస్తకమునఁ గిరీటమువలె వెలుఁగుచుండెను. ఆమె యెట్టి యాభరణములను దాల్చియుండలేదు. జ్యోతిర్మయ సిందూరబిందు, జ్యోతిర్మయవలయము, జ్యోతిర్మయావతంసము, జ్యోతిర్మయహారము, ఆజ్యోతిర్మయ విగ్రహము నలంకరించుచుండెను. నాతిదీర్ఘమును, నాతి స్థూలమునగు నాఋషికన్యా కళేబరము హిమగౌరవ

రమ్యమైయుండెను. ఆకర్ణవిశ్రాంత విశాలలోచన యుగము యోగ నిద్రా ముద్రితమైయుండెను. శుభలక్ష్య సిద్ధిసాధన సూచకమగు సుతీక్ష్ణనాశిక తీక్ష్ణ ఖడ్గాగ్రమువలె నుండెను. అరుణ రాగోజ్జ్వలము లగు నోష్ఠములు వాణీహర్మ్య మాణిక్య సోపానముల వలెనుండెను. అగ్ని ప్రభాకలిత జటావటలి యాజానులంబితమైయుండెను. సమున్న తవక్షస్థలము మహాభావలీలాస్థలమైయుండెను. కావ్యతారాస్నిగ్ధ జ్యోతి యామె ముఖమునఁ దరళించుచుండెను.

ఆ మహామాధురీ లీలాసందర్శనమున యాత్రికులు విస్మయా కలితులై,

"ఆహా! భువనమోహినీమూర్తి భువనేశ్వరుని శ్రీచరణధ్యానమున హృదయార్పణముఁ గావించినది!" అని యనుకొనుచుండిరి.

ఆ తపస్విని ప్రేమావేశమున వక్షస్థాపితహస్తములతో, నశ్రు విలిప్తనేత్రములతో, నిట్లనియెను !

"ఓ దేవదేవా ! ప్రభూ ! పరాత్పరా ! నా హృదంతరమున నేఁ డెట్టి యమృతతేజమును గల్పించితివి ! ఆత్మప్రభుఁడవు; స్వప్రకాశుఁ డవు ! మహాభూతచయమున నీ నిదర్శనముఁ గాంచి, పూర్వఋషి మండలి నీ శ్రీచరణములకు బూజించిరి. ఈ క్షుద్రప్రాణమున నీ యవ తరణభాగ్యము నా కేపుణ్యమున లభించినది ? నీ యోంకారమయ పవిత్ర ఝంకారము నా హృదయ కందరమున నిండిపోవునుగాక ! అద్వితీయప్రభూ ! సకల భువనాధారా ! ప్రాణవిధాతా ! మంగళ మయ మహామహేశ్వరా ! నీ శ్రీచరణదాసిని; నన్ననుగ్రహింపుము." అని యా తాపసకుమారి భువనేశ్వరునకు దండప్రణామములు గావించెను.

నిష్కేశమస్తకుఁడు పండాబ్రాహ్మణుఁ డొకఁడు దేవాలయగర్భ మునుండి వెలువడి, యా యువతీ భుజకీలితమును, గషాయవర్ణాంచిత

"గంగా! నీ వెందున్న దానవు? నా హృదయధామమున వాణీస్వరూపమున నమృత సంగీతమును బాడితివి. నా నేత్రములకు సృష్టిసౌందర్యదర్శనశక్తిఁ బ్రసాదించితివి. నా జ్ఞాననేత్రమును నీ యమృతహస్తములతో సుధాంజనసంకలిత మొనరించితివి. వాణీస్వరూపిణీ! శక్తిప్రదాయినీ! సుధామయీ! గంగా! అనంతాకాశమున విమలోజ్జ్వల నక్షత్రమవై వెలుఁగవలసిన దానవు; భూతలమున కేల వచ్చితివి? ప్రఫుల్ల పుష్పవనమున మధురసౌరభరూపమున జగదానంద మొనరింపవలసిన దానవు; కలుషమానవ ప్రపంచమున నవతరించితి వేల? లోకాతీతసౌందర్యవిలాసినీ! కల్మషరూపమునఁ బడిపోయితి వేల?

"గంగా! నీ వెందున్న దానవు? జీవనమార్గమున నిన్నొకసారి వీక్షించి, నీ పదముల వ్రాలి, 'పుణ్యశీలా! నన్ను క్షమింపుము; నీ హృదయమున నఖండక్లేశానలము రవులు కొలిపితిని! నా యపరాధమును క్షమింపుము!' అని ప్రార్థించు భాగ్యము నా కెన్నఁడేనిఁ జేకూరునా? గంగా! నీవు పాపకార్యాచరణమున కవతరింపలేదు. నీహృదయమునఁ బాపచ్ఛాయ పడనేరదు. లోకమేమనుకొనినను, నీవనింద్యచరిత్రవు. నా విశ్వాసము నిర్హేతుకమైనది కాదు. సౌందర్యము స్వర్గీయము; స్త్రీ భగవతీపుత్రి; సౌందర్యశాలిని స్వర్గీయపుణ్యప్రభ. గంగా! నీవు దివ్యజ్యోతిర్మయివు. నీ వెట్లు కలుషకార్య కలాపమున హస్తక్షేప మొనరింతువు; అనాథాబాలికా! గంగా! తొల్లిఁటిముచ్చటలు స్మృతిపథమున నంకితములై పోయినవి. నాఁడు మార్గాలకిశోరమును మీ యింట దాచి, నా హృదయమును బరీక్షించితివి; షోడశకళాచంద్రబింబసదృశమగు నీ ముఖము, వికసితమల్లికావిభవమును గందుపఱచు మందహాసరేఖ నేను జన్మాంతరమునఁ గూడ మఱవఁగలనా? పూర్వసువాసినీ సమాజము మాయింట సమావేశమై నీ వైధవ్యప్రాప్తినిఁ గూర్చి ముచ్చటించునపుడు, హృదయాశ్రువులను గంత

మున నిరోధించి, జాలితోఁ గూడిన లేఁతనవ్వు విశుభ్రాననమునఁ దొలకాడ, సకరుణముగా నన్ను విలోకించితివి; ఆ హృదయ విదారణ కటాక్షము విస్మృతమగునా? చిగురు చేతులతో నా కర్పించిన దేవీ ప్రసాదమును మఱవఁగలనా?

“గంగా! నా జీవనప్రాచీన ఖమునఁ బ్రాభాతతారవలె స్ఫురించితివి. నీ కల్యాణదృశ్యము నా దృష్టిపథమునకు శాశ్వతముగా నెడమై పోయినదా? నిన్ను నే మఱి చూడఁజాలనా? లోకాంతరముననైన నీ యమృతలీలామూర్తి నాకు దృగ్గోచరమగునా?” అని యాతఁడు వెక్కివెక్కి యేడ్చెను.

ఆ రోదనము సముద్ర ఘోషలో విలీనమై పోవుచుండెను. శీతల సింధుసమీరణ మాతని విశాలవక్షస్థలమును స్పర్శించి, దుఃఖోపశమనముఁ గావించుచుండెను.

“గంగా! మన యిరువురి మధ్య నెట్టి సంబంధమున్నది? నేను నీకే మగుదును? ప్రణయపాశమున మన యాత్మలు బంధింపఁబడినవా? మన యిరువురి మధ్య దాంపత్యసుఖము విధాత నిర్దేశించెనా?

“కాదు! కాదు! నీవు నా ప్రణయభాగినివి కావు!-ఇంకేమి సంబంధమున్నది? స్త్రీ పురుషుల కింతకంటె వేఱు సంబంధ మేముండును?-అవును, తెలిసినది! గంగా! నీవు నా ప్రణయభాగిని కావు; నా ప్రాణభగినివి! ఆహా! నా హృదయ మిపుడు దివ్యానందబంధురమై పోయినది! గంగా! నా ప్రాణభగినీ! నీసంబంధమును నే నింతవఱకు గ్రహింపఁజాలక పోయితిని. సోదరీ! నీ పదములను నా బాష్పవారిచేఁ బ్రక్షాళితముఁ గావించి, నీ నయనాశ్రులుదుడిచి, నా హృదయసంతాపము నుపసంహరించుకొను మహాభాగ్యము నా కెన్నఁడేని లభించునా?” యని యతఁ డతి దీనముగా నంబురాశినిఁ జూచెను.

దూరమున నీల జలార్ణవమున బెస్తవారు గ్రుడ్డిదీపముల వెలుఁ

గున నావలలోఁ గూర్చుండి, చేపలు బట్టుచుండిరి. ముక్తామయఫేనవిమండితోత్తుంగతరంగశిఖరము లామహాంధకారమున విజృంభించి యణగి పోవుచుండెను సంక్షుభితసముద్రగర్భమునఁ దారా కోటి ప్రతిబింబితమై హీరాఖండప్రచయముఁవలె మిలమిల వెలుఁగుచుండెను.

రఘురామమూర్తి యా నిశీథమున నా మహార్ణవ వేలాతలమున, సుశీతల శీకరసిక్త సైకతవేదికపై నిద్రాముద్రితుఁడై పోయెను.

## ౬

### స్వప్నభంగము

పిండియారఁబోసినటులు వెన్నెల కాయుచుండెను. భువనేశ్వరాలయ భిత్తికచ్ఛాయ లాలయాంగణమున దీర్ఘములై పడియుండెను. పండా బ్రాహ్మణులు నైవేద్యభక్ష్యములుఁగొని యాలయావరణమునఁ గల క్షుద్రకుటీరముల కరిగిరి. జనశూన్యమై యాలయప్రాంతము గంభీరముగా నుండెను. ఒకరిద్దరు బీఁద యాత్రికులు దేవాలయసోపానమున గుఱువెట్టి నిదురించుచుండిరి. సంధ్యాదేవీ వయస్య నిద్రాదేవి తన యమృతహస్తములతోఁ బరిశ్రమక్లేశమున నొడలుచాచిన ప్రాణికోటిని జోకొట్టుచుండెను. మలయమారుతము మనోహరముగా వీచుచుండెను. ఆదూరస్థగిరిగుహాలయమున నొకానొక భక్తుఁడు సంకీర్తన గీతమును మృదుమధురకంఠస్వరమునఁ బాడుచుండెను.

ఆ ప్రశాంతసమయమున దేవాలయముఖమంటపమున నాసీనయై తపస్విని యేమేమియో యోజించుచుండెను. ఆ యువతీ పాటలాధరము స్పందించుచుండెను.

“హృదయమా! నీ వెట్టి నీవు మానవుకదా? ఎట్టి యడియాస!

స్వర్గసోపానమున వ్యాకుల మేటికి? నందనవనమునఁ గలఁతయేమి? ఆనందమున శోకలాంఛనమేమి? ఆహా! హృదయమా! కొట్టుకొన కుము!" ఆమె కన్నులు మోడ్చెను. ఆమె హృదయమున నీ క్రింది గీతము వెల్లివిరియుచుండెను:

"ఎంత దూరమునుండి నేఁ డిందువచ్చి
నావో? ఎంత వడిగ వచ్చినావో, నాథ!—
మధురప్రాభాత సమయనుమంబువోని
మేన ఘర్మాంబు పూరము సోనగట్టె!
బడలికలువాయ మెల్లఁగాఁ దుడువనిమ్ము,
అనమ సుకుమార! తెఱఁగుతో విసురనిమ్ము!
మృదులచూతకిసలయ సదృశములైన
చరణయుగళము ధూళిధూసరితమయ్యె!
ఎంత కఠినాత్మురాలనో, యీవిధాన,
నిట్టిచూఁపుతో నినుఁ గౌఁగిలింప వలసె!
అప్రయత్నముగాఁ జారునశ్రువారి
వడిగఁ బారించి, ప్రాణేశ! కడుగనిమ్ము!
భవ్యపాదారవింద సంస్పర్శనాఢ్య
మైన యీపుణ్యజల ముత్తమాంగమందుఁ
జల్లుకొననిమ్ము నిలువెల్ల జల్లురనఁగ!
నావిలంబ వినీలకుంతల నిచయము
తోడ మెలమెల్లఁగా వానిఁ దుడువనిమ్ము!
పూర్ణ చంద్రునిఁ గప్పు జీమూతపటలి
వోలెఁ జూర్ణకుంతలములు ముద్దుమోము
నందమును గప్పె, సుమధురానందమూర్తి!
తొలఁగఁ ద్రోయుదునె కరాంగుళులను జాపి!—

నీ నగు మొగంబుఁ జూపవా, ప్రాణనాథ!—
స్వర్ణ స్వప్నప్రపంచ విధ్వంసమందు,
ధ్వంస మొందక నేనేల బ్రతికినాను!—
ఇంతవఱకేను మ్రింగినదంత నన్ను
మ్రింగుచున్నది, తసుఁ దానె మ్రింగుకొనుచు!"

ఆమె కన్నులు తెఱచి సాశ్రునేత్రయై యులికి పడియెను:

"ఎట్టయెదుటనే సాక్షాత్కరించి, నన్నుఁ
బ్రేమమంత్రానుబద్ధను, విడిచి యెందుఁ
బోతివో? పాడు కనులేల మూఁతపడియె?
చేతులకు సోకి సోకకఁ జెదరెనేమి,
నీ యనంతకల్యాణ శోభాయమాన
మూర్తి!—ఎందుండి వచ్చె నీమూర్తి మఱల?—
ఇంతవఱకుఁ గంటఁ బడని యీచరాచ
రాత్మకజగంబు మంత్రనిర్మాణమువలెఁ
దెల్లగాఁ జూఁపులో వెల్లి విరిసె నేమి?—"

* * * *

"స్వర్గారోహణశక్తి నాయందు మందీభవించుచున్న దేమి? మనో రథము శోకచ్ఛాయను నిలువఁబడిపోయినది!" అని యామె త్రిభువనేశ్వరుఁడగు భువనేశ్వరు నుద్దేశించి, చేతులు మోడ్చి,

"మహాదేవా! నీవు మనోనేత్రమున జ్ఞానాలోకనమయుఁడవు; సర్వదర్శననిదానా! నీకు నమస్కారము!

"నీవు పరిపూర్ణానంద స్వరూపుఁడవు; నేనాయానందసంజనితను. పరమపితా! నీకు నమస్కారము!

"నీవు మహాసింధు స్వరూపుఁడవు; నేను క్షుద్రోర్మిప్రాయను. సర్వప్రాణాధారా! నీకు నమస్కారము!

“నీ యనంతప్రేమాంతరిక్షమున నేను విహంగకన్యకనై, నీవిజయగాన మొనరించుచు, భ్రమణ మొనరింతునుగాక!

“నీప్రేమలోచనములు నిరుపమస్నేహాభావోద్దీపితములై యనుక్షణము నన్ను వీక్షించుచున్నవి! నేనవజ్ఞురాలనై యోమహాప్రభూ! నీదివ్యస్నేహగరిమ గ్రహింపకుంటిని. నాప్రపీడితహృదయము నుద్ధరింపుము. తండ్రీ! మధుపాత్రమున మక్షికమువలెఁ బడిపోయితిని! నన్ను దరిఁజేర్పుము! అనాథనాథా! నీకు నమస్కారము!” అని యామె భగవంతునకుఁ బ్రణామముఁ గావించెను.

ఆతపస్వినీమూర్తి దివ్యతేజోవిరాజితమై యానిశ్శబ్దతమోమయమంటపమును క్షణమాత్రము సముజ్జ్వలమొనరించెను.

## ౭

### అన్వేషణవ్రతము

రఘురాముని విద్యావిషయమున విశేషముగా వ్రాయుటకు మాకభిలాషకలదు; గాని గ్రంథవిస్తర మొనరించి పాఠకమహాశయుల యుదారశ్రద్ధాభిమానమును గోల్పోవుట కిష్టములేదు. రెండు మూఁడు సంగతులు మాత్రము వ్రాయకతీరదు. రఘురాముఁడు తొల్లిఁటివలె నుత్సాహపూరితుఁడై పరీక్షాపత్రములకు సమాధానములు వ్రాయఁజాలకపోయెను. చులకనిప్రశ్నలే గూంతసికానసమయమునఁ గష్టముగా స్ఫురించెను. ఆ కారణమున నాతఁడు నూటికి నలుబదియైదుగుణములు గణింపఁగలిగెను. ఎట్లయిన నుత్తీర్ణుఁడయ్యెను.

* * * *

పరీక్షలు ముగిసి సంవత్సరమైనది ఆతఁడిప్పుడు జానకితోఁ గావు

రముఁ జేయుచున్నాఁడు. నూతనవధూవరుల ప్రేమ సమ్మేళనమును గూర్చి విపులముగా వ్రాయుట అనవసరము; పాఠకమహాశయుల కామధురానంద మపరిచితముగాదు.

*　　　*　　　*　　　*

క్రొత్తకోఁడలిపై గృహసర్వహణభారమును మోపి, యశోదమ్మ యార్యావర్తమునఁ గల పుణ్యక్షేత్ర సందర్శనమునకుఁ బోయెను.

ఒకనాఁటి సాయంసమయమున జానకి పెరటిలో మల్లెచెట్లకు నీళ్లు తోడి పోయుచుండెను. రఘురాముఁడు పుస్తకభాండాగారమునుండి యప్పుడే వచ్చియుండెను. ధూళిధూసరితములైన కాళ్ళుకడుగుకొనుట కాతఁడు పెరటిలోనికరిగెను. నవమృణాలసదృశ బాహుయుగము చలింప, నవపల్లవహస్తము లెత్తివాఅ, జానకి నీళ్ళు తోడుచుండెను. ఆయువతీ ధమ్మిల్లమున వికసితమల్లికామంజరి మనోహరముగా నుండెను-

రఘురామునిఁ జూచినతోడనే యామె యించుక జారినపయ్యెద నరదుకొని,

"ఏకాంతముగానున్న యాఁడువారిదరికిఁ బురుషులు రాఁదగునా?" యని చిఱునవ్వులొలుకు ముఖమండలమును వంచి పలికెను.

"జానకీ! నిన్నేకాంతమున సేవించు భక్తుఁడు, నిన్నేకాంతమున దర్శింప కెట్లుండఁగలఁడు?" అని రఘురాముఁ డామెను నమిూపించి,

"నీళ్ళుతోడి చాలయలసితివి!—నీవు సింహాపీఠమునఁ గూర్చుండ వలసినదానవు; నీకీ యాయాసమేటికి? నేను దోడెదను. నీవించుక విశ్రమింపుము!" అనియెను.

"మహారాణి పాటుపడకూడదా?—నాకక్కసెల్లెండ్రు లేరు. ఈవూలమొక్కలు నాసోదరీప్రేమకుఁ బాత్రమైనవి. వాటిని దని యింప నేనెంతయో యుల్లాసమున నీళ్లు చేదుచున్నాను." అని

జానకి యాయాననమును హాయిగుపఱచి పలికెను.

"నీ సోదరీమణులను సేవించుటకు నాకధికారము లేదా? జానకీ! నీవు చాల నలసిపోయితివి!" అని యాతఁడామెహస్తమునుండి చేదఁ దీసికొని, యామె యారంభించిన కార్యమును దాను ముగించెను.

ఆ నాటి రాత్రి భోజనానంతరము జానకీ రఘురాములు మేడడాబా పై నిండువెన్నెలలోఁ గంతాలింగనపూర్వకముగాఁ గూర్చుండి యుండిరి. శీతగాలులు మురువుగా మలయుచుండెను. ఇరువురును నిశ్శబ్దముగా నట్టులే కూర్చుండి నిశ్శబ్దానంద మనుభవించుచుండిరి.

కొంత వడికి జానకి తన ముద్దుమోమెత్తి రఘురాముని వదనమును దిలకించెను. ఆతని నేత్రము లశ్రుపూరితములై యుండెను. జానకి యులజడి వడియెను.

"ప్రాణేశ్వరా! మీ ముఖమిట్లు చిన్నవోయిన దేమి? మాయత్తగారు జాబు వ్రాయలేదనియా? ఆ పుణ్యాత్మురాలి కెట్టి యాపదయును గలుఁగదు. భగవంతుని యనురాగ మామెయందు నిండుగాఁ గలదు." అని యామె చేలాంచలమున నాతని కన్ను లొత్తుచుఁ బలికెను.

"జానకీ! మా యమ్మ పుణ్యశీల; ఆమె భగవంతుని పాదపద్మముల హృదిసమర్పణముఁ గావించినది. ఆ మహాత్మురాలి కెట్టి యాపదయుఁ గలుగ నేరదని నే నెఱుఁగుదును. నా హృదయ మేటికో నేఁడు దుఃఖ మనుభవించుచున్నది!—జానకీ! వెనుకటి కథ లెన్నియో నా స్మరణకు వచ్చుచున్నవి!—" అని రఘురాముఁడు గద్గదగాత్రుఁడై పలికెను.

జానకి యాతని హృదయమునఁ జేయివేసి యాతని ముఖము నట్టె చూచెను. ఆమె హృదయము దడదడ కొట్టుకొనుచుండెను.

"జీవితేశ్వరా! మీ యానందమునే కాక దుఃఖమును గూడ పంచు

కొనుటకు నా కధికారమున్నది. మీ దుఃఖభాగిని నగు నా యందు దాపఱిక మేటికి?” అని యామె సాంజనాశ్రునేత్రయై పలికెను.

“ప్రేయసీ! నా హృదయ మొకానొక యనాథబాలిక కొఱకు పరితపించుచున్నది.”

“గంగను గూర్చి మీరు యోచించుచుంటిరా?

“అవును. ఆమె యేమైనదో, యెచ్చ టనున్నదో తెలిసికొనఁ గోరి నా హృదయము కృశించిపోవుచున్నది.”

“ఆమె యెందున్నదో మన మెట్లు గ్రహింపఁగలము?”

“ప్రియురాలా! ఆమెను మఱి నేఁ జూడఁజాలనా?—ఆహా! గంగ యెంతమంచిది! ఎంతచక్కనిది! దాని ముఖమున నెంత హాయి యున్నది! ఆ సుఖస్వరూపమును నేను మఱి చూడఁ జాలనా?”

“ఆమె కళంకిని యని లోకము గర్హించుచున్నది.”

“ఏమి! గంగ కళంకినియా? లోక మెంత గ్రుడ్డిది!—జానకీ! నీవు గూడ నట్లే భావింతువా?”

“నాథా! నా కామె యపరిచితురాలు. నే నామె నెప్పుడు చూచి యుండలేదు. ఆమెను గూర్చి దురంత విమర్శనలే నా శ్రుతిగోచర మగుచుండెను. నే నేమి చెప్పఁగలను?”

“జానకీ! గంగాన్వేషణము నా ప్రథమకర్తవ్యము. ఆమె నా బాల్య సఖి; నా ప్రాణభగిని! ఆమె కన్నీరు దుడిచినఁ గాని నా హృదయ శోక ముపశమిల్లదు. ఎట్లయిన నే నామెను జూడ వలయును!”

“అటులైన నీ యన్వేషణకార్యమున నేను మీ వెంట వచ్చెదను.”

“ప్రియురాలా! నీ వబలవు; గమ్యస్థాన మగమ్యగోచరము. ఈ ప్రయాణమున నెంతదూరము పోవలయునో, యెన్ని యిక్కట్లు పడవలయునో, యూహింపలేము. నీవు నీమాతృగృహమున గొన్ని దినములు గడుపరాదా?”

"నా జీవన ప్రభూ! మిమ్ము విడచి నే నుండఁగలనా? మీకుఁ గలుగని క్లేశము నా కెట్లు కలుగును?"

"జానకీ! నిన్నుఁ బాసి నేను మాత్రము సుఖయాత్ర చేయఁ గలనా?" అని యాతఁ డామెను గౌఁగిలించుకొని, యా నిదాఘనిశా సమయమున నెంతయో తడవు నేమేమియో నామెతోఁ బలుకుచు నిశాంతమునఁ గన్నులు మోడ్చి నిదురించెను.

## ౨

### శుభసూచన.

ప్రాచీముఖమున నుషారాణి ప్రశాంత శోభాప్రసన్న మయ్యెను. ప్రత్యూషాంధకారము క్రమముగా విడిపోయెను. అసంఖ్యతారాకోటి యనంతాకాశమున నదృశ్యమైపోయెను. బాలసూర్యరశ్మి వీథులలో, సౌధోపరిభాగముల, దూరమున, సమీపమున, నెల్లయెడల నిండి పోయెను.

రఘురాముఁడు కాల్య కృత్యములు దీర్చుకొని,

"జానకీ! ఇది పుణ్య ముహూర్తము. గంగాన్వేషణ వ్రతమున కుపక్రమించుట కిదియే పరమోత్తమ సమయము" అనియెను.

"మీసహధర్మచారిణికి, మీయానతి శిరోభూషణముగా మౌళి దాల్తును." అని జానకి వినయవినమితయై పలికెను.

"ఈ యూరి బాలికా పాఠశాలలో శేషమ్మయను నుపాధ్యాయిని యుండెడిది. ఇప్పుడామె గౌతమీ తీరమున నున్నదట. గంగాచరిత్రమునఁ గొంతభాగము మన కామె వలన దెలియ గలదు. గంగ యా విదూషమణి గృహమున విద్యాభ్యాసము జేయుచుండెడిది."

అని రఘురాముఁడు సాలోచన పూర్వకముగాఁ బలికెను.

జానకీ రఘురాములు భోజనము గావించి, వలయు బట్టలను, నితర సామగ్రులను, సంగ్రహించి యింటికిఁ దాళము వేసి ప్రయాణోన్ముఖులైరి. మూఁడుదినముల క్రిందట రైతులు రఘురామునకు శిస్తు రూపాయలు మూఁడు వేలు చెల్లించియుండిరి. ఆ ధనమున నర్ధభాగము నాతఁడు సేవింగ్సు బ్యాంకులో నిక్షిప్తమొనర్చి, మిగిలిన యర్ధభాగమును ప్రయాణవ్యయమున కేర్పాటు చేసికొనియెను.

ఆ దంపతులు ధూమశకట మారోహించి రాజమహేంద్రవరమునకు బ్రయాణమైరి. గమ్యస్థానముఁ జేరునరికి మధ్యాహ్నము మూఁడు గంటలయ్యెను. రఘురాముఁ డొక యొద్దుబండి నద్దెకుఁ గుదిర్చెను. జానకి బండి నెక్క, సామానులు తొందరగా సరదిన బండివాని సోమరితనమునకు జాలివడుచు విభుని యాస్తరణకు నదుపాయముగా సామానులు సరదెను. రఘురాముఁ డాకులసతీ విన్నాణమున కానందించుచు బండిలోఁ గూర్చుండెను.

"చత్రానికా బాబూ!" అని బండివాఁడు తొందరగా బండిఁ దోలుచు నడిగెను.

శేషమ్మ యే వీధిలో నున్నదో యాతఁ డెఱుంగఁడు.

"ఈ యూర మంచి సత్రమేది?" అని యాతఁడు బండివాని నడిగెను.

"నాళంవారి చత్రం, బాబూ!" అని యా బండివాఁడు తనకంటె ముందుగాఁ బోవుచున్న బండివానితోఁ బంతము లాడుచు, నెద్దును బరుగెత్తింపసాగెను.

నాళమువారి సత్ర మెదుట బండినాపి, బండివాఁడు, "బాబూ! ఇదే చత్రం, దిగండి." అనియెను.

రఘురాముఁడు బండిదిగి, యాధర్మశాలలో నొకవిశాలాగార

మున సామానులు జేర్పించెను.

«బాబూ! అద్ది! మళ్ళీ కేలికి పోవాలనాను.» అని బండివాఁడు వెదురు కొరడా చంకలోఁ బెట్టుకొని, చేతులు జోడించి, యడిగెను.

రఘురాముఁడు వాని చేతిలో నాలుగణాలుపెట్టెను. వాఁడా నాణెమును గైకొని, కన్నుల నద్దుకొని, ముద్దాడి, చంగున గంతువేసి, యచ్చట యెడ్లను విప్పి కూర్చుండియున్న తదితర బండివాండ్రను జూచి కిలకిల నవ్వుచు,

"పావలా కోణీ, పంచకల్యాణి!" అని యున్మత్తవానరమువలె నృత్యముఁ జేయసాగెను.

రఘురాముఁడు జానకి నిమిత్త మల్పాహారములు గొని తెచ్చుటకు సమీపమునఁగల కాఫీహోటలున కరిగెను.

ఆహోటలు యజమాని, రామకోటిరావు, బహుయోగ్యుఁడు; ప్రజానురంజకుఁడు. కర్ణాటదేశస్థుఁడైనను, నాంధ్రదేశమునఁ జాలకాలమునుండి నివసించుటచే నాంధ్రమున నాధుని కాంధ్రయువకులకంటె స్వచ్ఛందముగా భాషింపఁగలఁడు. అతని ముఖమున మందహాసము తాండవించుచునే యుండును.

"రఘురామునిఁ జూచిన తోడనే యాతఁడు సగౌరవముగా,

"బాబూ! దయచెయ్యండి! మనదే యూరు?" అని యాతని కొక బెంచినిఁ జూపెను.

రఘురాముఁ డాయాసనమునఁ గూర్చుండి, కావలసిన పదార్థములను నిరూపించి, పొట్లములు కట్టించుచుండెను.

రెండవ గదిలో బ్రాహ్మణేతరులు కొందఱుఁ బాటసారులై యుండురు) భోజన మొనరించుచుండిరి. మసిగుడ్డ కట్టుకొని వంటవాఁడు వడ్డించుచుండెను.

రఘురాముఁడా వంట వానివైపు దృష్టి చెదర్పక చూడసాగెను.

"బాబూ! ఇంకేమి కావాలి!" అని రామకోటిరావు రఘురాము నడిగెను.

"మఱియేమియు నవసరములేదు. అయ్యా! ఆ వంటవాని దే యూరు?" అని రఘురాముఁ డడిగెను.

"వాడా? శంకరపురం బచ్చా!"

రఘురాముని నేత్రములు కాంత్యుజ్జ్వలము లయ్యెను.

"అయ్యా! రాత్రి భోజనమునకు వచ్చెదను. ఈ పదార్థముల ఖరీ దెంత?" అని యాతఁడడిగెను.

"కారం బూంది, అణా; ఉప్మా, రెండణాలు;—అణా రెండణా లు, మూడణాలు;—రవాలడ్డూ, రెండణాలు, మూడణాలు, రెండ ణాలు, ఐదణాలు." అని మెల్లగా గొణుగుకొనుచు, నాతఁడు,

"అంతా ఐదణాలైంది." అనియెను.

రఘురాముఁ డాతనికి కావలసిన పైకమును చెల్లించి, వడివడి సత్ర ముఁ జేరుకొనియెను.

జానకి యాతని రాక కుద్వేగమనస్కయై యెదురు చూచు చుండెను.

"జానకీ! మనము బయలుదేరిన ముహూర్తము మంచిది. మనకా ర్యము నెరవేరు సూచన లగపడుచున్నవి." అని యానంద పులకితుఁ డై రఘురాముఁడు పలికెను.

"విశేషమేమి?" అని జానకి యావేగమున నడిగెను.

"శంకరపురవాసి యొకఁ డీయూరనున్నాఁడు; ఆతని వలన శేషమ్మ నివాసస్థానమును మనము తెలిసికొనఁగలము."

## ౬

## ముడివిడినను చిక్కు విడలేదు

ఆ నాఁటి సాయంసమయమున భోజనశాల కెదురుగానున్న యంగడిప్రక్క "శంకరపురం బచ్చా" సిగరెట్టుఁ గాల్చుచు నిలువఁబడి యుండెను.

"ఆహా! కాలమా! ఎట్టివాని సహాయమును నే నపేక్షించుచుంటిని. అని యనుకొనుచు రఘురాముఁ డాతనిని సమీపించెను. అప్పు డాయిరువుర కీక్రింది సంభాషణ జరిగెను:—

"అయ్యా! మీ దేయూరు?"

"ఇప్పు డీఊరే."

"మీ స్వగ్రామము?"

"శంకరపురం."

"ఈ యూరనుంటి రేల?"

"పొట్ట గడవక."

"మీ పేరేమి?"

"వేణుగోపాలరావు."

"ఈ యూరికి వచ్చి యెన్నిదినము లైనది?"

"మూఁడేళ్ళు"

"ఈ మధ్యను శంకరపురమున కెన్నఁడును బోలేదా?"

"లేదు—హోటేల్లో నెలకి పది రూపాయలు ఇస్తారు. నెలాఖరు అయ్యే సరికి పదిరూపాయలూ పైసలా?"

"ఇంటికిఁ బోవుటకు మీ కభిలాషయున్నదా?"

"ఉండి. జరగడం ఎలాగ?"

“నేను మీకు ధనసహాయము జేసెదను——”

వేణుగోపాలము సిగరెట్టును బారవైచి, చేతులు జోడించి, రఘు రాముని మృదుమధురవాక్కులచేఁ గట్టుపడి,

“బాబూ! నేనుమీకు బొత్తిగా కొత్తవాణ్ణి. నామీద మీ కింత దయకలగడం నా పూర్వపుణ్యం అనుకుంటాను. శంకరపురంలో నాముసిలి తల్లి ఉంది. పాపం, నీళ్ళబిందెలు మోసి పొట్టపోసు కుంటున్నాదట. బాబూ! మొదట బాగా బతికిన వాళ్ళం; మాఖర్మం కాలిహీనమానం పడుతూ ఉన్నాం”

రఘురాముఁడు వేణుగోపాలము చేయిపట్టుకొని, “ఆ సత్రములో నేను బసచేసియున్నాను. మాబసకుఁ బోవుదము, రండు.” అనియెను.

“బాబూ! మీరు ఎవ్వరో పెద్ద ఇంటివాళ్ళలా ఉన్నారు. నన్ను ‘మీరు,’ ‘అండి,’ అని మన్నించి నాతో మాటాడితే నాకు సిగ్గు వేస్తూఉంది.”అని వేణుగోపాలము చేతులు నలుపుకొనుచుఁ బలికెను.

“అయ్యా! పదవులు భేదించినను, వ్యక్తులు సమానమే. పేదవాఁడై నంత మాత్రమున గౌరవార్హులుగారా? పదవికిఁ బేదరికముగాని వ్యక్తికిఁగాదు. ఈశ్వరదత్త మగుపదవిని నేను మన్నింతును. కడకు పంచముఁడైనను గౌరవింపఁదగినవాఁడనియే నా యభిప్రాయము.’’ అని రఘురాముఁడుత్తర మొసఁగెను.

వారిరువురా ధర్మశాల యరుగుపైఁ గూర్చుండి యీ క్రింది విధముగా సంభాషించిరి.

“మొదట బాగుగా బ్రతికినవారమని యంటిరి. ఇప్పు డీకష్టదశకుఁ గారణ మేమి?”

“బాబూ! నాకథ చాలా చిత్రం ఐనది! మానాన్నగారు తాశీల్దారీ చేశారు. అతను చనిపోగానే మా అమ్మ అతను ఆర్జించిన సొమ్మంతా పాడుచేసేసింది. మేము మొదట ఈ వూళ్ళోనే ఉండే

వాళ్ళం. సొమ్మంతా ఖర్చు ఐపోయింది; ఇళ్ళు వాకిళ్ళూ వేలాం ఐపోయాయి. శంకరపురం చేరాము. ఆఊళ్ళో మాఅమ్మ ఒక హోటేలు పెట్టింది.——”

రఘురాముఁడాయంత్యవాక్యశ్రవణమునఁ గంపించిపోయెను. లోక మేమనుచున్నది? “గంగ హోటేలుదాని కొడుకుతోఁ బారిపోయినది.” అనికదా! గంగాజీవన విధ్వంసి వీఁడే యగునా? ఆ జగన్మోహన కల్యాణమూర్తినిఁ గలుష పంకిలమునఁ ద్రోసిన కఠినకర్ముఁడు వీఁడే యగునా? రఘురాముఁడు హృదయాందోళన మణచుకొని,

“తరువాత?” అనియెను.

“కొన్నాళ్ళకి హోటేలు కూడా సాగిందికాదు. నేనింట్లో చెప్ప కుండా ఈ ఊరు పారిపొచ్చాను.”

“మీ పలాయనమునకుఁ గారణమేమి?”

“బాబూ! తమ వంటి పెద్దలు నన్నావిషయం అడగరాదు; నేను చెప్పకూడదు.”

“ఏమియును భయము లేదు; మీగుట్టు నేను వెలిబుచ్చను.”

“ఆ ఊళ్ళో శేషమ్మ అని ఒక ఇనుప్పాలు మేష్టరు ఉండేది. దాని మాయలోపడి నేనొక పెద్ద తప్పు చేశాను. విధవపెళ్ళి చేసుకోమని ఆ శేషమ్మ నన్ను చాలా ప్రోద్బలం చేసింది. వాళ్ళింటికి గంగ అనే పిల్ల వస్తూఉండేదీ. దాన్ని చూడగానే, నాకు దానిమీద చాలా మోహం కలిగింది నాదగ్గిర ఐదువందల రూపాయలు పుచ్చుకొని ఆ పిల్లని నాకు అంటకట్టింది. గంగని మాయచేసి నాతో పంపించింది. ఈ నత్రింలోనే మే మిద్దరం దిగాము. గంగ చాల తెలివైనపిల్ల. నా చేతనే మాపన్నాగాలన్నీ చెప్పించింది. మూడో నెంబరు గదిలోనే ఆనాడు కూర్చున్నాము. దాన్ని పెళ్ళి చేసుకుందికి నేను ఇష్టపడలేదు. ఉంచుకుంటానన్నాను. దానికి పట్టరానంతటి కోపం, దుఃఖం వచ్చింది.

కు ఎదురుగా మరోగదిలో బంగాళా దేశం ఆడది ఒకత్తె కూర్చొని ండెను. గంగ పరుగెత్తి వెళ్లి ఆవిడ పాదాలమీద పడింది. నా మొగం చెల్లక నేను సత్రం దాటి పోయాను. ఆనాటి రాత్రే గంగ ఆ బంగాలీ విడతో స్టేషనికి వెళ్ళింది. అప్పట్నుంచి హోటలులో ప్రవేశించి కష్టాలు పడిపోయేటట్టు చాకిరీ చేసి పొట్టపోసుకుంటూ ఉన్నాను. పాపఫలం నేను అనుభవిస్తూ ఉన్నాను."

రఘురాముడు మహాగ్ని పర్వతముఖమునఁ బడిపోయెను. పర్వత దనమున నాతని దేహము జ్వలించిపోవుచుండెను. "హా! గంగా! ంత మోసము! మోస మెఱుఁగని దానవు. తృటిలో మోసగింపఁ డితివి!" అని యాతఁడు పశ్చాత్తాపమవనయించు కొనుచుండెను. శ్రారుణితములైన యాతని నేత్రగోళములను దిలకించి వేణుగోపాలము యపడియెను.

"బాబూ! సాయంత్రం ఐపోయింది. వంటకి వేళఐంది నాకు." ని యాతఁడనియెను.

"స్వగ్రామమున కరుగుదురా?" అని రఘురాముఁడు వాని డిగెను.

"తమ దయఉంటే వెళతాను."

"మీ కెంత సొమ్ము కావలయును?"

"పదిహేను రూపాయలు ఉంటేనే గాని కాలు కదలించలేను."

"మీరు చేసిన పాపము చాల భయంకర మైనది; కాని పాప ల భోగానంతరముననైనఁ బశ్చాత్తాప మొందుచుంటిరి కావున మీ ందు నాకు జాలి కలిగినది. మీరు కోరిన ధనమును మీకిచ్చెదను. ంకెన్నఁడును నిట్టి దారుణకృత్యములు చేయవలదు." అని పలికి రాతఁ డావంటవానిచేతిలోఁ బదునైదు రూపాయలు పెట్టెను.

*

# ౧౦

## “ గుమాస్తాగారు ”

రఘురామమూర్తి లోనికరిగి మూఁడవ నెంబరు గదివైపుఁ జూచుచుఁ గొంత సేపు నిలువఁబడియెను. ఆతని నేత్రములు బహుళాశ్రుపూరమునఁ దడిసిపోయెను.

“హా! గంగా! ప్రియసోదరీ! ఎంతకష్టమున కోర్చితివి!” అని యనుకొని యాతఁడు జానకియున్న గదివైపు నడచిపోయెను.

ఆతఁడు గది గుమ్మమువద్ద నిలువఁబడి,

“ జానకీ! యని పిలచెను. ప్రత్యుత్తరము రాకపోవుటవలన నాతఁడు గదితలుపుఁ ద్రోసి, లోనికిఁ దొంగిచూచెను. గదిలో జానకిలేదు. ఆతఁడు వ్యాకులాకులితుఁడై, “జానకీ! జానకీ!” యని రెండు మారులు పిలచెను. తత్తరపాటుతో జానకి వేఱొక గదిలోనుండి యీవలికి వచ్చెను.

“ ఏమి చేయుచుంటి వచ్చట? ”

“ రహస్యవిభేదన ప్రయత్నము. ”

వారిరువురు గదిలోఁ బ్రవేశించి, తలుపువేసి, శయ్యాతలమునఁ గూర్చుండిరి.

“ ఆవంటవానితో మాట్లాడితి రా? ”

“ మాటాడితిని. క్షేమమ్మతో మనకుఁ బనిలేదు. ”

“ గంగ యెందేగినదో తెలిసినదా? ”

“ లేదు.—నీ ప్రయత్న మేమయ్యెను? ”

“ సత్రముగుమాస్తాతో మాటాడితిని. చాలదినములక్రిందట భద్రాచలమునుండి యొక బంగాళీయువతి యిచ్చటికి వచ్చియుండెనట. ఆమెతో నొక యనాథబాలిక- ఆంధ్రయువతి- ప్రయాణమైపోయి

నటు లాతఁడు చెప్పెను. ”

« జానకీ ! ఆ యనాథబాలికయే ౪౦౪. ఈ విషయమంతయు వేణుగోపాలము నాతోఁడఁ జెప్పియుండెను. ఆబంగాళీ యువతి యెవ్వరో? ఆమెయూరు, పేరు మనకెట్లు తెలియఁగలదు ? ”

రఘురాముఁడు గుమాస్తా గదిలోఁ బ్రవేశించెను.

« అయ్యా ! మీరు నాకొక మహోపకారముఁ జేయవలయును. మీకుఁ దగిన పురస్కార మిచ్చెదను." అని యాతఁడు పలికెను.

ప్రాఁతసులోచనములు పెట్టుకొని « గుమాస్తాగారు ” ( “గారు” శబ్దమును జేర్చకపోయిన నపర దూర్వాసునివలె నాతఁడు మండి పడును! ) రఘురాముని ముఖమును బరికించి,

“ బాబూ ! ఆకుర్చీలో దయచెయ్యండి. ” అని చేతులులేని కఱ్ఱ కుర్చీ నొకటి చూపెను.

రఘురాముఁ డాయాసనమున నధివసించి,

“ ఈసత్రమున నొక బంగాళీయువతి వచ్చియుండెనని నాభార్యతోఁ జెప్పితిరట. ఆమె చిరునామా మీకుఁ దెలియునా? ” యనియడిగెను.

“ బాబూ! లక్షమంది వస్తారు; లక్షమంది పోతారు. అందరి చిరునామాలూ జ్ఞాపకం ఉంటాయా? గాని ఏదో పుస్తకంలో అవిడ పేరు రాసినట్టు ఉంది. ఇక్కడ మూడురోజులకంటె అధికం ఉన్న వాళ్ళు అద్దె చెల్లించాలి- ఈ నియమం ఉంది- విన్నారా?- ఆవిడ నాలుగైదురోజులు ఇక్కడనే నిలిచిపోయింది- గోదావరిస్నానానికి కాబోలు! ఎక్కడి బంగాళా దేశం- అంత దూరంనుంచి వచ్చిందా? మనకు లేదుగాని, ఆదేశస్థులకి గోదావరీస్నానం అంటే చాలా పట్టింపు- మంచిభక్తులు వాళ్ళంతా! విన్నారా? మూడురోజులకుమించా ఉంటే అద్దె చెల్లించాలి అని చెప్పానుకదూ? అలా అద్దె చెల్లించేవాళ్ళపేర్లు మాలీస్టులోకి ఎక్కుతాయి- ఈలీస్టులో బహుశా ఉండవచ్చును.”

అని యాతఁడు సులోచనములు సరదుకొనుచు, ప్రాఁతపుస్తక మొకటి తీసి, పరిశీలనపూర్వకముగాఁ జూడ నారంభించెను.

“బాబూ! వార్ధక్యం; కొంచెం రేచీకటికూడాను నాకు. విన్నారా? శ్రమ అనక తమ రొక్కసారి దయచేసి ఈపుస్తకంలోనే చూడండి. ఇందులోనే ఆవిడపేరు రాశాను- నాకు తొంభైఏళ్ళమాట గ్యాపకం ఉంటుంది. లేకపోతే ఇంతపనీ ఒక్క చేతిమీద, నలభైఏళ్ళైంది- ఏకచక్రంగా నడిపించగలనూ?” అని యాచిత్రగుప్తుఁడు పుస్తకమును రఘురామునియెదుటఁ బెట్టెను.

రఘురాముఁడు ఆనర్సు పరీక్షకైన నంత శ్రద్ధగా నేపుస్తకమును జూచియుండలేదు. ఆగ్రంథమున నొక పుట యడుగున నిట్లు వ్రాయఁబడి యుండెను:

“ వసంతకుమారి- బంగాళాక్షత్రియజాతి-

భద్రాచలం- జాజపురం (కటకంజిల్లా)

మహాభాగధేయమును బొందిన పేదవానివలె రఘురాముఁ డానందపరవశుఁడై పోయెను.

“అయ్యా! మీ యమూల్యోపకారమునకు నేను చిరకృతజ్ఞుఁడను. ఈయుంగరమును స్వీకరింపుఁడు!” అని యాతాత వ్రేలికిఁ దన వ్రేలిముద్రిఁ దొడిఁగించి, యాతఁడు తనకై యెదురుచూచుచున్న జానకి సమక్షమునకు నొక్క పరుగునఁ బోయెను.

“జాడ దొరికినదా?” యని జానకి యడిగెను.

“వసంతకుమారి; జాజపురము” అని రఘురాముఁడు మహోల్లాసమున మైమఱచిపోవుచుఁ బలికెను.

## ౧౧

### ఆతిథ్యము

జానకీరఘురాములు జాజపురముఁ జేరునప్పటికి రాత్రి పదిగంటలయ్యెను. రజనిరాణి తన కాళికాస్వరూపమును జలస్థలభాగములఁ, బర్వత కాననప్రదేశములఁ బ్రదర్శించెను. రత్నదీపప్రచయమువలె నక్షత్రకోటి యొక్కటొకటి విశాలశ్యామలాకాశమున వెలుఁగుచుండెఁ. దివసకోలాహలము క్రమముగా ననంతనిశ్శబ్దగర్భమున విలీనమై పోయెను. సచేతనాభవనము నిద్రాదేవీ మధుమయోత్సంగమున ననంత మృత్యుసుఖము క్షణకాల మనుభవించుచుండెను. దినశ్రమాంతమున వ్యాకులిత హృదయాంతరము విశ్రాంతిలాభ మర్థించుచుండెను.

భక్త్యావేశమున శైవగీతములు పాడుచుఁ దంతువాయు లొకరిద్దరు బట్టఁ నేయుచుండిరి.

రఘురాముఁడు జానకీసమేతుఁడై రాజమార్గమున నడచిపోవుచుండెను. సామానులను కూలివాఁడు—మూఁగవాఁడు—మోసికొని వచ్చుచుండెను.

కొంతదూర మరిగినతరువాత నాతనికొక యుత్కళబ్రాహ్మణుఁ డెదురయ్యెను. రఘురాముఁ డాతనిచేయిపట్టి, యాపి,

"అయ్యా! క్షత్రియకులాంగన, వసంతకుమారీ గృహ మెచ్చట?" యని యడిగెను.

ఉత్కళవిప్రుఁడు రఘురాముని నాపాదమస్తకముఁ బరిశీలనపూర్వకముగాఁ జూచుచు,

"తెలంగీ లేదు" అని తన యాంధ్రభాషాపరిజ్ఞానమును వెల్లడించెను.

రఘురాముఁడు పూర్వోక్తప్రశ్న నాంగ్లభాషలో నడిగెను. ఉత్క-

శ్రీయుతు తన కాభాష యపరిచితమని సంజ్ఞాపూర్వకముగా నెఱింగించెను. రఘురామునకా యుత్కళభాష తెలియదు. మానవసమాజమున నాంతరంగిక భావప్రకటనకు సర్వసామాన్యమగు వాణియేది? పరమేశ్వరుఁడు మానవహృదయమును భావపరిపూర్ణ మొనరించి, భావప్రకటనకుఁ దగిన సదుపాయముఁ గూర్పలేకపోయెనా? కృష్ణా గోదావరీ పుణ్యస్రవంతీమధ్యస్థభూఖండమున విశ్రుతమైనవాణి, ఋషికుల్యా సువర్ణానదీ మధ్యస్థ భూభాగమున నవిశ్రుతమేమి? ఆర్యావర్తమున మాతృవాణియేది? భారతవర్షము సనాతన పుణ్యప్లావితమగు నార్యగృహము; భారతీయులందఱు నొక యింటివారు. ఏకకుటుంబమున భిన్నభిన్నభాషాప్రచారమేమి? ఏకకుటుంబమున నేకభాషవిశ్రుతము కాకుండిన హృదయమైక్యమొందుటెట్లు? ఏకలక్ష్యములవడుటెట్లు? సర్వైక్యసాధన సమకూడుటెట్లు? ఉత్కళసోదరుని హృదయమునకును, దనహృదయమునకును మధ్య నవ్యక్తమైన భిత్తిక నెట్లు భేదింపనగును? ఏభాష సమస్తమానవప్రపంచమునకే కాక, దేవతా కోటికిఁగూడ సువ్యక్తమై, మాతృభాషయై యుండెనో, యావేదభాష, గీర్వాణవాణి, నేఁడు మృతభాషలలోఁ గలసిపోయినది!

హతాశుఁడై రఘురాముఁడు జానకితో నగ్రసరుఁడయ్యెను. గమ్యస్థానము జేరుకొనియు నాతఁడు గమ్యస్థానమునఁ బరిభ్రమించుచుండెను.

“వసంతకుమారి యీప్రాంతముననుండియు, మనకు శతయోజన దూరమైపోయినది!” అని యాతఁడు జానకితో ననియెను.

“ప్రాణేశ్వరా! అల్లదే, ప్రక్కవీధిలో దీపకాంతి పడియున్నది. ఆగృహనివాసులు మేలుకొనియున్నటులున్నది. అచటికరిగి తెలిసికొందము.” అని జానకి యాతనిమార్గమును నాశాప్లావిత మొనరించెను.

రెండుమూఁడు నిమిషములలో నాయఖండపుణ్యఫలభోక్తలా గృహద్వారమున నిలువఁబడిరి.

కాశ్మీరరత్నవల్లికపాటలసుమశోభితమై, శిశిరార్ద్రమై, యాసౌధ ద్వారము నలంకరించుచుండెను. సోపానముల కిరుప్రక్కల మొగ్గ దొడిగిన మల్లిమొక్కలు ముద్దులొలుకుచుండెను. చావడిలో మేజా బల్ల కెదురుగా నొకకుర్చీలోఁ బ్రకాండగాత్రుఁడొకఁడు కూర్చుండి, యేమేమియో వ్రాసికొనుచుండెను. దీపకలిక నిశ్చంచలమై యాతని నుస్పృహహృదయము ననుకరించుచున్నటు లుండెను.

రఘురాముఁడాతని సమక్షమునఁ నిలువఁబడి యాంగ్లమున మాటాడఁ గడంగెను. ఆతఁడను బాశ్చాత్యభాషావిజ్ఞుఁడు గావున వారిరు వురు నెట్టియాతంకమును నెఱుంగక కథోపకథన మొనరించిరి.

"అయ్యా! మీరు హృదయార్పణముఁ గావించి విశ్వసమస్య నెదు ర్కొనినట్లు ఏకాగ్రచిత్తమున నేమియో విరచించుచున్నారు. మీకీ పవిత్రసమయమున నాతంకముఁ గలిగించినందులకు నేను విచారించు చున్నాను!" అని రఘురాముఁడు వినయవిభూషణుఁడై పలికెను.

"అయ్యా! మీ వలన నా కెట్టి యాతంకమును గలుగలేదు. మీ రీ గ్రామమునకు నూతనముగా వచ్చినటు లున్నది. ఎచ్చట బస చేసి తిరి?" అని యా సభ్యు డడిగెను.

"మే మీం దినముననే యీ పురాణకీర్తిత నగరమునఁ బ్రవేశించి తిమి. ఇది మాకుఁ గ్రొత్తయూరు; మే మెఱిఁగిన వారెవ్వ రీ యూర లేరు"

ఆ గృహస్థుఁడు మిక్కిలి వ్యాకులముతో,

"అయ్యా! జాజపురము సుప్రసిద్ధనగరము; రసజ్ఞకవిశేఖరుల కాట పట్టు; ఉత్కళరాజ్యలక్ష్మిలలాట తిలకము. మీ కింతవఱకు నీ ధన ధాన్యసమృద్ధిశాలినీ క్రోడమున నాశ్రయమె లభింపలేదా? యని పలికి,

"మా గో, మా!" యని పిలుచుచు, వినవిన లోనికిఁ బోయెను.

X o X

ఉత్తర క్షణమున నొక జరాజీర్ణకళేబర మీవలికిఁ గదలి వచ్చెను. ఆ వృద్ధనారి జానకి హస్తమును బట్టుకొని,

“అమ్మా! లోనికి రమ్మా!” అని యస్పష్టముగా నుత్కళభాషలోఁ బలికెను. జానకి యా భాష నెఱుంగక పోయినను, ఆ నారీహృదయాహ్వానమును గ్రహించి, యామెతో లోపలికిఁ బోయెను.

పురుషుఁడు మరలివచ్చి, రఘురామునిఁ జూచి,

“అయ్యా! పాదప్రక్షాళనముఁ గావించుకొనుఁడు. మేము క్షత్రియులము; మీరు బ్రాహ్మణులవలెఁ గన్పట్టుచున్నారు. మేము మీ వంక్తి బాహ్యులము; అయినను, ‘చపాటీ’ స్వీకరించుటకు నెట్టి యభ్యంతరము నుండదనుకొనియెదను.” అనియెను.

రఘురాముఁడు చిఱునవ్వు నవ్వి,

“మా కెట్టి యభ్యంతరమును లేదు. మీకు శ్రమ గలిగించితిమని విచారించుచున్నాను!” అనియెను.

ఆతిథ్యస్వీకార మొనరించి రఘురాముఁ డాతనితో నిట్లు ప్రసంగించెను.

“అయ్యా! మే మొక మహత్తరకార్య నిమగ్నులమై యీ యపరిచిత దేశమున కరుదెంచితిమి. ఈ యూర బంగాళీక్షత్రియు లెవ్వరైనఁ గాపురమున్నవారా?”

“ప్రస్తుతము మా కుటుంబ మొకటియే యున్నది; నెల దినముల క్రిందట మా పినతండ్రికుమారుఁడు ‘విహారీమిత్ర’ యీ నగర పరిత్యాగముఁ గావించి కలకత్తాపట్టణమున నివాస మేర్పఱచుకొనియెను.”

“సుమారు మూఁడు వత్సరముల క్రిందట వసంతకుమారియను క్షత్రియాంగన భద్రాచల యాత్రకువచ్చి యుండెను.—”

“ఓహో! ఆమె నా సోదరియే. ఆమె తీర్థయాత్రాభిలాషిణి.

ఆమె పేరు మీ కెట్లు తెలిసినది?"

"రాజమహేంద్రవరమున నొక సత్రములో నామె బసచేసియుం డెను. ఆ సత్రపు గుమస్తా ముఖమున నామె చిరునామా తెలిసి కొంటిని. ఆమె యిప్పుడెందున్నది?"

"మున్ననే బుద్ధగయకుఁ బోయినది? అది భర్తృవిహీన. పరమే శ్వరుని యాశ్రయముఁ గోరి నానాపుణ్యనదుల పుణ్యభూములఁ గ్రుమ్మ రుచుండెను. —ఆమెతో మీకేమి పని యున్నది?"

"అయ్యా! మీరు నా కొక మహోపకారమును జేయవలయును వసంతకుమారితో నొక యాంధ్రయువతి వచ్చియుండెను గాదా?"

"అవును."

"ఆమె యిప్పుడెందున్నది?"

"భువనేశ్వరమున."

"కారణమేమి?"

"ఆబాలిక యనాథయట. మాయక్కతో నిట కరుదెంచియారు నెలలు మాత్రమే మాయింట నుండెను. ఒకనాఁడు భువనేశ్వరము నుండి 'రామపండా' యను బ్రాహ్మణుఁడు మాయింటికి నైవేద్య భక్ష్యములను గొని వచ్చియుండెను. ఆ బాలిక భువనేశ్వరదేవుని దర్శనమపేక్షించి, యావృద్ధ విప్రునితో నడచిపోయెను. రెండు మూడుసారులు మా వసంత యామెను బిలుచుకొని వచ్చుటకుఁ బోయి యుండెను గాని యామె మా గృహమునకు మరలరాలేదు. ఆపుణ్యా రంగముననే నిలచిపోయినది. ఆయనాథ బాలికను జూచిన నాగుండె నీరగుచుండును. పాపము, ఆమె మాతృపితృహీనయట, భర్తృవి హీనయట, నిర్ధనురాలట!—మీ కాబాలిక యేమగును?"

"అయ్యా! ఆమె నా ప్రాణభగిని. నేనామె కన్నీరుఁ దుడుచుటకు నన్వేషణమార్గమును నిష్కంటక మొనరించుచున్నాను. అయ్యా!

మీ పేరేమి? ”

“ రాజీవలోచన మిత్ర—మీ పేరు?”

“ రఘురామమూర్తి—పరమేశ్వరునకు నా యందుఁ బ్రీతికలదు. అతఁడే తన యగోచర హస్తములతో మమ్మా యార్యగృహ ద్వారమునకు దోడ్కొనివచ్చెను. వివిధలీలా వినోదుడగు నీశ్వరుని సంకల్పము నెఱుంగ నెవని వశము?”

## ౧౨

### రామపండా

ఆ మరునాఁటి యుదయముననే జానకీరఘురాములు భువనేశ్వరమునకుఁ బ్రయాణమైరి పండాబ్రాహ్మణులు తండోపతండములుగా స్టేషను ప్రాంగణమున, కేశవపండా, మాధవపండా, గోవిందపండా, హరిపండా, రామపండా, కృష్ణపండా, యని పొగఁబడ్డ తేనెటీఁగలవలె ఝుంకార మొనరించుచుండిరి.

‘రామపండా’ యని యరచుచున్న యువకుని భుజమునఁ జేయివేసి రఘురాముఁడు,

“ఆతని యిల్లెక్కడ?” అని యడిగెను. వాఁడు ప్రత్యుత్తర మొసఁగకయే కోడిపిల్లను గ్రద్ద యాకర్షించునటు లాతని సామానులను బట్టుకొని ముందు నడువసాగెను. వాని యింగిత మెఱిఁగి రఘురాముఁడు జానకీ సహితుఁడై వాని వెంటనే స్టేషన్ వెలుపలి కరిగెను.

కొంతవడికి నా యువకుఁడు భువనేశ్వరాలయ ప్రాంగణమున నొక కుటీరమున సామానులు దింపి, జానకీ రఘురాములకు సముచితాసనములు కల్పించెను.

ఆ కుటీర దక్షిణకోణమున నొక చింకిచాపపైని పలితకేశమస్తకుఁడు వృద్ధవిప్రుఁ డొకఁడు కూర్చుండియుండెను. బహుళధవళ యజ్ఞోపవీత మాతని కృశకళేబరమున మెఱయుచుండెను. జీర్ణమలినవస్త్రఖండ మొకటి వామభుజమున నాతనిశిష్టాచారవిధేయతను బ్రకటించుచుండెను. చెవులకు వ్రేలాడు తులసిపూసలు బోసినోట ముఖమున నలేఖ్యవిలాసము దిద్దుచుండెను.

జానకీరఘురాములను జూచి యాతఁడు సంభ్రమాకలితుఁడై లేచి వచ్చి,

“బాబూ! మీది ఏ పోఖా ఊరు?” అని యడిగెను.

“మాది శంకరపురము.”

“భాగబానోభుబానశ్చారో మీకు మంగళ్ళో చేస్తారు!” అని యాశీర్వదించి, కుటీరాంతరమున నొక క్షుద్రయాగారమునఁ బండుకొనియున్న బాలిక నుద్దేశించి యాతఁడు,

“మాళ్లోతిగో, బాటువాకాఁ ఇగో!” అనియెను.

ఆ బాలిక వినుకొనుచు లేచి, సగము చిరిగిన బట్టువా (సంచి) చిలుక కొయ్యనుండి వెడలించి, యాతని ముంగలఁ బెట్టి, యలసభావమున మరల యథాస్థానమునఁ బండుకొనియెను.

“పనో వేస్తారా?” అని వృద్ధబ్రాహ్మణుఁడు బట్టువా విప్పుచు రఘురాముని నడిగెను.

“అవసరము లేదు—అయ్యా! మీకుఁ గావలసిన ధనమొసంగెదను. నే నడిగిన ప్రశ్నలకు సదుత్తర మొసఁగవలయును,” అని రఘురాముఁడనియెను.

‘ధనము’ అను శబ్దము చెవులఁ బడిన తోడనే వృద్ధవిప్రుని నేత్రములు విస్ఫారితము లయ్యెను. గండద్వయమున, సంకుచితఫాలభాగమున, మహానందభావము జరావతార సూచకములగు మడుతలలో

వెల్లి విరిసెను.

"ఏమి కావాలా?" అని యాతఁడు బంగాళాతముల పాకును జేబ్బుచు నడిగెను.

"జాజపురనివాసి, క్షత్రియకులాలంకారుఁడు, రాజీవలోచన మిత్రను మీ రెఱుఁగుదురా?"

"హాఁ—అమె అతని పోండా." అని తమాలపాకులో నర్థభాగమున, కుంకుడి పిక్కయంత సున్నమున, నల్లకవిరి ముక్కయును, వచ్చిచెక్క పొడియుఁ, బొగాకు గుండయు వేసి, చిన్న పొట్లమువలెఁ జుట్టి, నోట వేసికొనియెను.

"ఆ మిత్రగారి సోదరి వసంతకుమారిని మీ రెఱుఁగుదురా?"

"హాఁ! చూడా ఘూంసా మేము త్యారోచేస్తే దానికి ఇష్టం."

"వారియింట నొక యాంధ్రయువతి యుండెనుగాదా?"

"ఆంధ్రోజాబాతి!—మేము చూడలేదు; మాకు నై తెలుసు."—అని యాతఁడు వీధి గుమ్మములో భోల్లున నుమిసెను.

"మాకు ఒభ్యాసం, మొహాలాఖిల్లి" అని వామభుజమునఁ గల యార్ద్రవస్త్రఖండముతో నాతఁడు తనవదనగహ్వరమును దుడిచికొనియెను.

రఘురాముని ముఖము వైవర్ణ్య మొందెను.

"గంగా సందర్శనము నాకీ జన్మమధ్యమున మఱికలుగదా? మా యిరువురిమధ్యఁ బెఱిగిపోయిన ప్రకాండభిత్తికను భేదించు నుపాయము లేదా? ఆమె యడుగిడిన తావులలోఁ గ్రుమ్మరుటనేఁ గాని, యామెను బ్రత్యక్షముగాఁ జూచుటకు వీలులేదని విధాత కఠోరశాసనముఁ గావించెనా?—హా! గంగా! అనాథబాలికా గంగా! నిన్నుఁ జూడక నే నెట్లుండఁగలను?" అని యాతని హృదయ మాక్రోశించుచుండెను; హృదయాశ్రువులు హృదయశోణితజ్వాలలో నింకిపోవుచుండెను.

జానకి యాతని ముఖలక్షణముఁ గాంచి,

"నాథా! మీ రేటికి దుఃఖించెదరు? మిత్రగారి తల్లి నాతోఁ గొన్ని విషయములు చెప్పియుండెను. XoX వారి యాశ్రయమున నారుమాసములుండెనట.

"నేను భువనైక దుఃఖసిని, భువనేశ్వరుని నారాధించి, నేను పునర్జన్మముఁ బడసెదను. నా హృదయమునఁ బశ్చాత్తాపమునకు నవకాశమున్నది!" అని XoX యామెతో నొకనాఁడు పలికెనట. ఆమె యిప్పు డీ యాలయ సమీపముననే కాషాయవస్త్రధారిణియై మెలఁగుచున్నదని యావృద్ధాంగన నాతోఁ జెప్పినది. ఆమెకు నాంధ్రభాష రాక పోవుటచే నామె చెప్పిన సంగతులన్నియుఁ బూర్ణముగా గ్రహింపఁజాలక పోయితిని." అనియెను.

"జానకీ! హతాశాహృదయమున నాశాజ్యోతి వెలిఁగించితివి. ఆ మహాతపస్వినీ సందర్శనము నాకు లభించునా?" యని రఘురామమూర్తి బిట్టు నిట్టూర్పు విడలించెను.

"తాపస్విని— కే! హాఁ—అది ఎందుకు మీకు!" అని రామపండా యడిగెను.

"ఆమె యెందున్నది?" అని రఘురాముఁ డావేగమున నడిగెను.

"గుంఫాలో."

"మీ కా గుంఫా తెలియునా?"

"హాఁ"

జానకీ రఘురాములను రామపండా గృహమునకుఁ దోడ్కొని వచ్చి యువకుఁ డాసమయమున నొక కుండలో 'కిచిడి' తీసికొని వచ్చెను.

జానకి రఘురామున కా దివ్యభోగమున భాగమును బెట్టెను; శేషాన్నమును దాను వడ్డించుకొనియెను.

'సాంబశివా!' అని రామపండా కూర్చున్న చోటుననే కునుకుచు గూలఁబడియెను.

భుక్తాన్న శేషమును మార్జాలము వలెఁ గబళించి యువకుఁడు వెడలిపోయెను.

## ౧౩

### దీక్షా గ్రహణము

సాయంకాల మైదుగంటలైనది. భువనేశ్వరాలయమున కించుక దూరముగా నొక గిరికందరమున్నది. ఆ గుహాభ్యంతరమున శైవాలశోభిత శిలాతలముపైఁ దపస్విని యాసీనయైయుండెను. ఆమె యెట్ట యెదుట నొక బాలిక రోగార్త-నవపల్లవకోమల శయ్యాతలముపైఁ బ్రశాంతనిద్రా ముద్రితయై యుండెను.

తపస్విని చేతులుమోడ్చి, నిర్భరాశ్రుపూరితయై భువనేశ్వరుని ప్రార్థించుచుండెను.

"పరాత్పరా! పరమేశ్వరా! నీకు నమస్కారము! సర్వజగద్వ్యాపీ! విశ్వకారణా! నీకు నమస్కారము! ప్రాణపితామాతా! ప్రాణపతీ! నీకు నమస్కారము! కరుణాసింధూ! సచ్చిదానందసుందరా! నీకు నమస్కారము! దీనబంధూ! దయామయా! నీకు నమస్కారము! నీ కరుణాపాంగ ప్రసారమున నీ రోగార్త-దీనహీనబాలిక—ఆరోగ్యప్రాభవము వడయునుగాక! పుణ్యశాంతిదాయకా! సర్వసృష్టినాయకా! నీ యమృతహస్తములతో నీ బాలికా హృత్పీడన ముపశమింపఁజేయుము! తండ్రీ! నీకు నమస్కారము!" అని యామెమౌనమువహించెను.

ఆమె కెంబెదవులు బెదరుచుండెను! విశాలఫాలమున స్వర్గీయజ్యోతి

వెలుఁగుచుండెను.

కొంతసేపటి కామె నేత్రోన్మీలనముఁ గావించెను. ఆమె సమక్షమున జానకీ రఘురాములు నిమీలిత నేత్రములతో, విన్యస్తమస్తకములలోఁ బరమేశ్వర ధ్యాన నిమగ్నులై యుండిరి.

"రామా! రామా! రామా!" యని తపస్విని నిర్భరానంద పారవశ్యమునఁ బిలచెను.

రఘురాముఁడు కన్నులు విప్పి యాస్వర్గీయ తేజఃప్రభనువిలోకించెను.

"గంగా! గంగా! గంగా!—" యని యాతఁడు మఱి మాటాడఁ జాలకపోయెను.

గంగ జానకిని బిగియారఁ గౌఁగిలించుకొని,

"అమ్మా! అనంతక్లేశమున కోర్చి యీ పాపాత్మురాలినిఁ జూడ వచ్చితివా? ఆహా! నిన్ను నే నేమని కొనియాడుదును! భువనేశ్వరునకు నాయందు జాలి కలిగినది; నేను ధన్యురాల నైతిని.—రామా! రామా! అశ్రులు రాల్పకుము! నేఁడు భువనేశ్వరము—ఈ ప్రాచీన నగరము—ధన్యకైలాసమైనది! నేను చరితార్థురాల నైతిని! నా జీవనము దివ్యకాంతిమంతమైనది!" అని యామె గద్గదస్వరమునఁ బలికెను. రఘురాముని పాదధూళి శిరమున నిడుకొని "రామా! నీ దివ్యపాద రజోధారణ చేకూరఁగలదను స్థిరవిశ్వాసము సర్వపాపతాపహారి శ్రీ భువనేశ్వరుఁడు నాకుఁ బ్రసాదించెను! ఆ విశ్వాసబలమున నే నీ భువనాలయమునఁ బ్రాణధారణఁ గావించుచున్నాను! రామా! నేను సఫలీకృత మనోరథురాలనైతిని. ఇంక నాకెట్టి యాశయును లేదు!" అని ఆమెను మధురాశ్రుసిక్త నేత్రములతో నాతని పాదములను దడిపివేసెను.

"గంగా! నిన్నుద్ధరించుట కరుదెంచి నేనుద్ధరింపఁబడితిని. దివ్యసౌందర్యమయీ! నీమహోదార, స్వర్గీయ, హృదయసౌందర్యమున

నాకొఱకు, నాదేశాభ్యుదయముకొఱకు, జగత్కల్యాణసాధనకొఱకు, నిత్యప్రేమయున్న సందేశమెట్టిది?'' అని రఘురాముఁడు మహానంద పులకితగాత్రుఁడై యడిగెను.

" రామా! నీవు ధర్మవరాయణుఁడవు; జానకి నీసహధర్మచారిణి. పురాణప్రసిద్ధులైన సీతారాములవలె మీరిరువురు సనాతనదంపతులు. మీప్రణయ సంబంధ మనంతకాలమున ననంతసౌభాగ్యవిలసితమై, యనంతానందప్రదమై, లోకకల్యాణమునఁగూర్చును!

" రామా! ఆంధ్రభూమి శోభనసదనము. పురాతనగౌరవసంపద యీ భూఖండమున నింకను విరాజిల్లుచున్నది; కాని యచిరకాలములో మనదేశగౌరవము విలుప్తమైపోవును! రామా! నీవు కర్మ వీరుఁడవు! దేశవిముక్తి, దేశగౌరవరక్షణ, నీతరుణహస్తమున నున్నది. అనాథబాలికాకోటి మాతృదేశపక్షమునఁ బ్రచండజ్వాలా సదృశ బాష్పవృష్టిఁ గావించుచున్నది. ఆవరితప్తహృదయశాంతి సాధనకై జీవితమును ధారపోయుము. అందున నాంధ్ర దేశమాత సంతుష్ట యగును; మాతృసంతోషమే సంతానజీవనౌషధము!" అని గంగ యుత్తేజభావమున భువనేశ్వరుని స్మరించుచుఁ బలికెను.

"గంగా! నాప్రాణ భగినీ! నీ సందేశమును సంపూర్ణవిశ్వాస ముతో స్వీకరించితిని. అనాథస్త్రీలబాష్పవారిఁ దుడుచుటకు నీ సమ క్షమున భువనేశ్వరునిసాక్షిగాఁ ద్రికరణశుద్ధిగా, నా సహధర్మచారిణి హస్తమున హస్తముంచి దీక్షాగ్రహణముఁ గావించుచున్నాను!" అని రఘురాముఁడు విశ్వాసబంధురుఁడై పలికెను.

* * * *

జానకి హర్షపులకితయై గంగను కౌఁగిలించుకొని, " అక్కా! నీవు శోభారాణివి! జీవన వసంతమున నీకతిన తపోనిష్ఠ యేల? ఇంటికిఁ బోవుదము రమ్మా! '' అనియెను.

" జానకీ! నీ మధురామంత్రణమున కెంతయు సంతసించితివి. కాని నన్ను క్షమింపుము. భయంకర నాగపాశమున బంధింపఁబడి ప్రగాఢ యాతన ననుభవించి, భువనేశ్వరుని యపార కరుణాప్రభావమున బంధవిముక్తి వడసితిని. నేను మహానందయోగ మనుభవించుచున్నాను!

" జానకీ! ఇటుఁ జూడుము. ఈపల్లవశయ్యాతలమునఁ బడియున్న బాలిక మాతృ పితృ హీన. విపుల జగద్వలయమున నీమె కొక్కఁడైనను బంధువులేఁడు! ఇప్పుడామె ప్రపీడితయై భువనేశ్వరుని సమక్షమున దయాభిక్ష నర్థించుచున్నది. ఇట్టి యనాథ బాలికలను ప్రేమోత్సంగమునఁ జేర్చి, లాలించి పాలించు విధానము శారదాసాంగత్యమున నాకలవడెను. అమ్మా! ఇంటి సుఖముల కాశించి నే నీపవిత్రవ్రతమున వంచితురాలనుగాఁజాలను! అని యామె జానకీ రఘురాముల మధ్యఁ గూర్చుండి, వారి భుజములపైఁ దన బాహువల్లరుల నిడి, నిమీలితాక్షియై యీక్రింది గీతమును బాడెను.

" సుఖము—సుఖము—సుఖమని విసుఖమునొందె
దేల? మానవా! సుఖమేమొ యెఱుఁగలేవు!
ప్రాజ్యరాజ్యాభిషేకము, ప్రాభవంబు,
కీర్తికామన, గౌరవ కేతనంబు,
అతుల సుఖలాంఛనములని యందువేమొ?
తోఁచలేదె, విషాదాగ్రదూతలనుచు?
అరయ సుఖమేది? యనుభవమగుట యెట్లు?
ఈమహాత్తర సంశయ మెటులదీరు?
విపుల పార్థివ సంపద వెలయునేని,
సుఖము సుస్థిరమై తలచూపఁగలదె?
లోకకల్యాణ కామనాలోలుఁ డగుచు,

ధనము, ప్రాణము, మానము, ధారవోసియు
నెవఁడు, పరుల సుఖమునకై యొసఁగు నిజసు
ఖము విసర్జించు, నతఁడె సుఖప్రమోది!"

సమాప్తము.



ప్రకాశకులు:—ఆద్దేపల్లి లక్ష్మణస్వామి నాయఁడుగారు

# సరస్వతీగ్రంథమండలి

## రాజమహేంద్రవరము



నవలలు—నవరసభరితములగు—నవలలు

ముచ్చటైన బొమ్మలతో ముద్దులొలుకు క్యాలికో బైండుతో

రెండుమాసముల కొక్కటిగా వెలువడు చుండును.

### నిబంధనలు.

1. ఇందుఁ జందాదారులుఁగ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా రు 0-4-0 లు చెల్లింపవలయును.

2. ఇందు రెండేసిమాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండుగల ప్రతిగ్రంథమును రు 1-0-0 వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందుము.

3. గ్రంథములఁ బంపుట కగుపోస్టేజీ మొదలగు కర్చులన్నియును జందాదారులే భరింపవలయును.

4. చందాదారు లగువారు వెనుకటిగ్రంథముల నన్నియును గొనవలయు ననునియమములేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములు కూడ, జందాదారులవెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులుతప్పక పుచ్చుకొనుచుండవలెను.

5. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయు ననునియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

6. సంవత్సరము చందా అనగాముందు ప్రకటింపఁబడు ఆఱుపుస్తకములకు రు 7-2-0 లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకములను అన్‌రిజిష్టర్డుపార్శిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆఱుపుస్తకములకు చెల్లింపవలసిన మనియార్డరు కమీషను 0-12-0 లును రిజిష్టరు కర్చు 0-12-0 లును రు 1-8-0 కూడివచ్చును.

ఇందీవరకు ప్రకటింపఁబడిన గ్రంధములు:—చిత్రపటశోభితములు

---

**ప్రేమసుందరి** నవరసభరిత మగు సాంఘికనవల. క్యాలికోబైండు 272 పుటలు వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**చోరశిఖామణి** లోమహర్షకమగు డిటెక్టివునవల. క్యాలికోబైండు 197 పుటలు వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**లక్ష్మీప్రసాదము** నవరసభరితమగు సాంఘికనవల. ఇందు మూఢురాండ్రగు స్త్రీలవలన కుటుంబములందు సంభవించు కలహములును అందువలన కలుగు కష్టపరంపరలు చక్కగా వర్ణింపఁబడినవి. 346 పుటలు వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**హత్యారహస్యము** జటిలమగు ఇతివృత్తముగల డిటెక్టివునవల తుదవరకు దోషులెవరో కనుగొనుటకు వీలు లేకుండునటుల యుండగలు పన్నినపన్నాగము లత్యంతభయంకరములు వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**ఫాస్టు** (ప్రథమభాగము) అధికార దుర్వినియోగము—అభేద్యములైన కోటలందు దురాచారుల దురంతములు-మహాప్రళయము రహస్యమువలన గలిగిన తీవ్రమనోవేదనము, మున్నగు చిత్రవిచిత్రకల్పన, బాలకమహాశయుల త్తరువుల గావించుచుండును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**ఫాస్టు** (ద్వితీయభాగము) ఈశ్వర కృపాతిశయము, భక్తసంరక్షణము, భాగవత విజయము, విమల ప్రేమాభిరాములగు సాధుయువతీయువజనుల కళ్యాణము మున్నగు సత్యద్భుతఘట్టము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**కుముద్వతి** ఇందలి దుష్టకేతుని దౌష్ట్యము భయావహము. ఈమాయా మారీచుని మాయలు భయంకరకృత్యములు చదివి యానందింపుడు. ఇయ్యది నవలకాదు. నవరసరత్నాకరము. వీర శృంగార కరుణారసంబుల యేకీభావము చేద్రివేణీసంగమమును బోలి చదువరులహృదయముల రసరంజితములుగ జేయును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**చిన్నకోడలు** శ్రీయుత కాశీనాథ రఘునాథమిత్రగారిచే మహారాష్ట్రభాషయందు వ్రాయబడిన ధాక ట్యాసూన్‌భాయి, నుంచి తెనిగింపబడినది. కథాచమత్కృతి నవీనము. చిన్నకోడలు "లక్ష్మి" యొక్క శాంత్యౌదార్యాది సుగుణములును, పతిభక్తియు, మిక్కిలి పేదస్థితియందున్న సంసారమును తన చాతుర్యముచే లక్ష్మీసంపన్నముగాఁ జేయుట మొదలగు సంగతులు చదువవలసినవి. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**రహస్యభేదనము** రహస్యాపరాధ పరిశోధక నవల. కథాకల్పన మత్యద్భుతము. సంఘటనములతిభయంకరములు. నిగూఢహత్య లెన్నియో వర్ణింపబడినవి. ఇది స్వతంత్రగ్రంథము. ఇతివృత్తమాంధ్రదేశమునకు సంబంధించినది. ఇట్టి గ్రంథ మిదివఱకాంధ్రదేశములో వెలువడలేదు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**సింహగడము** మహారాష్ట్రభాషలో శ్రీహరినారాయణ ఆపటేగారు విరచించిన గ్రంథమున కనువాదము. రమణీయమగు యీకథగాంభీర్యమై యుండును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0

**మణిహారము** ప్రభాకరునిపగిది ప్రకాశించు ప్రభాకరుడు, హృదయరంజనియగు రంజని, చంద్రునిబోలు విజయచంద్రుడు, వికసితహృదయపద్మినియగు పద్మిని సార్వభౌమ లక్షణలక్షితుండగు అలకసుందరుడును చదువరి హృదయమును వివిధ రసభావతరంగముల దేలించును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**మొగలాయీ దర్బారు**
ప్రథమ భాగము

శ్రీ. శ్రీ. ధీరేంద్రనాథపాల్ గారి సుప్రసిద్ధ గ్రంథరాజమున కనువాదము. ఇయ్యది నవరస భరితమై చరిత్రాత్మకమై, చిత్రవిచిత్రోపకథలతో విరాజిల్లుచు పాఠకమహాశయుల కెంతయు నానందదాయకముగ నుండును. అద్భుతసంఘటనములతో నిండి సులభశైలిని వ్రాయబడిన యీగ్రంథ మెల్లరు జదువతగియున్నది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0

**మొగలాయీ దర్బారు**
రెండవ భాగము

ప్రథమ సంపుటముకంటె నిగూఢములైన దారుణశవప్రదర్శనములు, పిశాచకృత్యములు నిందు శోధింపబడి చదువరుల నానందనిమగ్నుల నొనర్చును. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**ఘటనాచక్రము**

పాంచకడీదేవ విరచితమగు భీషణపరిశోధకనువాదము. ఆశ్చర్యములకుబుట్టినిల్లు, కౌతుకములకు భాండారము, విచిత్రములకు గనియై, పాఠకులను విస్మయసాగరమున ముంచివేయును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**రాజసుందరి**

ఆంధ్రదేశాత్మక మగు స్వతంత్ర కల్పన. సాంఘికనవల. కథావిధాన మత్యద్భుతము— నిరుపమానము. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**కుంకుమభరణి** ఇది సాంఘికనవల. మామూలునవలలవలె గాక యిందు క్రొత్తచమత్కారములున్నవి. చదువుటకు మిక్కిలి మనోహరము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**జాగిలము** అతి భయంకర నిరూపక నవలారాజము. హంతకుడు భయంకరమగు జాగిలము సహాయము చేయు హత్యలుహృదయవిదారకములు. అపరాధపరిశోధకులు యీవిషమ సమస్యను భేదించుటతి విచిత్రము. హత్యలపై హత్యలు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**సరస్వతి** మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకరింపబడిన సాంఘికనవల. మనోహరకథావిధానము. శైలి నాతికఠినము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**ఆనందాభాయి** ఇయ్యది యూహాజనితమేయైనను చరిత్ర సమ్మిళితము. పండితకవులచే మనోహరముగా వ్రాయబడినది. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**హత్యాన్వేషణము** అద్భుతమగు పరిశోధక నవలారాజము. ఆంగ్లేయగ్రంథమునుండి మనోహరముగా భాషాంతరీకరింపబడినది. తుదివఱకు చదివినగాని అపరాధిని తెలుసుకొనలేరు. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

**మొగలాయీ దర్బారు**
తృతీయ సంపుటము

మొదటి రెండు సంపుటములవలె నిదియును చరిత్రాత్మకమై, నవరసభరితమై, చిత్రవిచిత్రోపకథల కాలవాలమై, మనోహరమై, యానంద దాయకమై పాఠకుల కెంతయు విజ్ఞానప్రదమై యొప్పును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

అనుబంధ గ్రంథములు

**మృత్యురంగిణి**

గొప్ప డిటెక్టివునవల. ఒకానొకసుందరి యొక్క భయంకరకథ. నరహత్య-నారీహత్య-హత్యపై హత్యలు. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు రు 0-12-0

**అభాగిని**

బాలవితంతువుల పసుకష్టములు. దుండగులు పన్ను కుట్రలు-సహజరీతిని వర్ణింపబడిననవరస భరితమగు సాంఘిక నవల. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 0-12-0

**ఛద్మవేషి**

ఇది చక్కని పరిశోధక నవల. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు 0-12-0

**విదురుని యుపదేశములు**

చిత్తస్వాతంత్ర్యము- సత్యవాక్య పరిపాలనమునీతిబలము-ధర్మోపదేశము జదువతగినవి వెలచందాదారులకు రు0-8-0 ఇతరులకు 1-0-0

**కాంచనమాల**

అశోకుని కాలమునాటి బౌద్ధమతధర్మ ప్రచారముల దెలుపు నవల. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 1-0-0

**సీమంతిని** పౌరాణికగాథ. నీతిదాయకము. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0

**సుశీల** పతివ్రతయగు నీమె చరిత్రము హృదయవిదారకమయ్యెను ప్రగాఢ ప్రణయాదర్శముజూపి యనేకుల పవిత్రుల జేయకమానదు. చందాదారులకు 0-8-0 ఇతరులకు 1-0-0

**శశిరేఖ** ప్రేమ మూర్తియగు శశిరేఖ ప్రియుని తరువాత ప్రియుని స్వీకరించుట యెట్లవసరమయ్యెనో అయినను ఆమె నిర్మలచారిత్రి యెట్లయ్యెనో వ్రాయబడినది. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0

**యమునాభాయి** తమతమ పరిస్థితులను పరిశీలింపని ప్రేమాంధులగు యువతీయువకుల కీగ్రంథమత్యంతబోధప్రదము. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 0-12-0

**శ్యామల** శిథిలప్రణయుల దుఃఖగాథ. సాంఘికదురాచారమును ఖండించు ప్రేమైక నవల. చందాదారులకు 0-8-0 ఇతరులకు 1-0-0

## —: నా ట కా ను బం ధ ము లు :—

**మార్కండేయ** 3 గంటలకాలములో ప్రదర్శించుట కనువుగ వ్రాయబడిన భక్తిపూరితమగు 6 అంకములనాటకము: చక్కని పాటలు గలవు. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 0-12-0

**అహల్యాశాప విమోచనము** భక్తిరసపూరితమగు చక్కని నాటకము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు 0-12-0

**మీవారుపతనము** వీర రసప్రధానమగు నైదంకముల నాటకము. ఐతిహాసికవచననాటకమునకనువాదము. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 1-0-0

**షాజహాను** విషాదాంతమైన మొగలాయీ చారిత్రిక వచననాటకము. చందాదారులకు 0-8-0 ఇతరులకు 1-0-0

**వరమాల** హిందీనుండి యాంధ్రీకరింపబడిన మనోహరమగు నాటకము. ఇందు ప్రేమపరీక్ష, తత్పరిణామము హృదయంగమముగను చమత్కారప్రదముగను నిరూపింపబడినది. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0

**కాంతంకథలు** శ్రవణానందదాయకములై, హాస్యరసపూరితములై యొప్పు వివిధకథల సంపుటము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0

**నూర్జహాను** కరుణరసపూరితము. విషాదాంతము నగు చరిత్రాత్మక నాటకరాజము. మనోహరగీతములుకలవు. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు 1-0-0

ఇట్టివే చక్కని నవలలు పలువురు కవులచే రచియింపఁజేసి రెండు మాసముల కొకటిగా ప్రకటింపఁబడుచుండును.

సరస్వతీ గ్రంథమండలి,
రాజమహేంద్రవరము.